ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము. -౨.



# జైమినిభారతము

ఇది,

సముఖము వేంకటకృష్ణప్పనాయకప్రణీతము.

కాకినాడ

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ

ప్రకటింపఁబడినది.



రాజమహేంద్రవరము:

శ్రీసుజనరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౧౯

వెల: ౧-౨ అణాలు.

## PREFACE TO THE FIRST EDITION.

—:o:—

This is a Telugu prose version of the well-known Sanskrit poem called the "Jaimini Bharatam" of which there is also a metrical translation by Pillalamarri Pina Virabhadra. The author is Samukham Venkata Krishnappa Naik, son of Minakshi Naik and Alamelu or Alamelu Akka. According to one account, Minakshi Naik was the Chief Minister of the great Tirumala Naik who was king of Madura from 1623 to 1659 A. D. His son Venkata Krishnappa Naik lived at the court of Tirumala Naik's great great grandson Vijayaranga Chokkanadha who reigned from 1704 to 1731. The interval between the father and son would thus be great. Although it might be explained away by supposing that Minakshi Naik was old when Venkata Krishnappa Naik was born and that the latter was also old during the reign of Vijayaranga Chokkanadha, it would seem to be more in accordance with probabilities to refer Minakshi Naik to the reign of Vijayaranga Chokkanadha's grand mother Queen Mangamma (1689-1704) who, according to the tradition referred to above, had brought up Alamelu from her infancy.

Vijayaranga Chokkanadha was a great patron of learning and, among his many gifts, was that of a village to a learned Telugu Brahmin named Sonti Gunnayya whose descendants now live at Periyakulam otherwise called Thenkarai,

Among the contemporaries of our author was Kumara Ramabhadra Naik, the then Zamindar of Vadagarai and his name is perpetuated by a street named after him in Vadagarai and a mantapam in Periyakulam where an annual festival is held.

After the downfall of the Naik dynasty of Madura during the time of Vijayaranga's widow Meenakshi, the family of Venkata Krishnappa Naik settled down at Vadagarai under the auspices of the Zamindar of that place to whom it was related and it held the office of the village munsif of Vadagarai till 1870. The last member of the family was Vijayabhagam Alagari Swami Naik who was the husband of the paternal aunt of the present Zamindar of Vadagarai. He died leaving a daughter whose son Mr. Rama Venkataswami Naidu has inherited his grand-father's property.

Venkata Krishnappa Naik was also the author of another prose work dealing with the story of Sarangadhara and of two peoms *Ahaylasankrandanamu* and *Radhikasanthvanamu* all of which he dedicated to the god of Srirangam. The present work, he dedicated to his Sovereign and patron. This is one of the several Telugu prose manuscripts that have been secured for the library of the Telugu Academy, in the Tamil districts. Till recently, it was believed that there was no prose literature in Telugu prior to the time of the well-known author and scholar Chinnayya Suri, but the discovery of these manuscripts by the Academy has upset that theory.

While true to the original Sanskrit in the story, the translator has expanded the descriptive portions and there are evidences that he kept Pina Virabhadra's poem closely in view. The style is elegant and flowing and the language chaste and, on the whole, simple. The work is of a high order and will repay reading.

This edition is based on two manuscript copies which are in the library of the Academy. One was obtained from Mr. G. S. Krishnayya of Batlagundu in the Madura District and the other from Mr. Thirumalai Veeraswami Pantulu of Puddukottai. To give an idea of the method of editing which is adopted, a portion of one of the manuscripts which corresponds to the printed page 7 is printed as an appendix to this book, just as it is in the original.

The book is published at the cost of the Hon'ble Dewan Bahadur V. Ramabhadra Naidu Garu, F. M. U., Zamindar of Vadagarai and Doddappanayakkanur, whose relationship to the family of the author has been set forth above.

J. RAMAYYA.

—:o:—

## ప్రథమముద్రణభూమిక.

—:o:—

ఇది సుప్రసిద్ధమైన సంస్కృతజైమినిభారతమునకుఁ దెలుఁగువచనము. ఈవచన రచనకు ముందే పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి సంస్కృతజైమినిభారతమును బద్యకావ్యముగ నాంధ్రీకరించియుండెను. ఈవచనజైమినిభారతమును సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు రచియించెను. ఈతనితండ్రి మీనాక్షీనాయఁకుఁడు. తల్లి అలమేలక్క. మీనాక్షీనాయఁకుఁడు 1623-వ క్రైస్తవ సంవత్సరము మొదలు 1659-వ సంవత్సరమువఱకును మధురరాజ్యమును బాలించి యశస్సుగాంచిన తిరుమలనాయకుని మంత్రిగానుండెననియొక ప్రతీతి గలదు. వేంకటకృష్ణప్పనాయఁకుఁడు తిరుమలనాయఁకుని మనుమనిమనుమఁడగు విజయరంగచొక్కనాథుని యాస్థానమునందుండెను. విజయరంగచొక్కనాథుఁడు 1704-వ సంవత్సరము మొదలు 1731-వ సంవత్సరమువఱకు రాజ్యమేలెను. దీనిని బట్టి తండ్రికిని గుమారునకును నడుమ నంతర మధికముగాఁ గనుపట్టుచున్నది. వేంకటకృష్ణప్పనాయఁకుఁడు మీనాక్షీనాయఁకుని వృద్ధదశలోఁ బుట్టినవాఁడనియు, విజయరంగచొక్కనాథుని రాజ్యకాలమందు వేంకటకృష్ణప్పనాయఁకుఁడుగూడ వృద్ధుఁడుగానుండెననియు నూహించినచో నీయంతరమత్యధికముగాఁదోపకపోవచ్చును, గాని, వేంకటకృష్ణప్పనాయఁకుని తల్లియగు అలమేలక్క "మంగమ్మ సాకుడుకూఁతు" రను ప్రతీతియుండుటచే నామెభర్తయగు మీనాక్షీనాయఁకుఁడు

విజయరంగచొక్కనాథుని పితామహి యగు మంగమ్మదేవి క్రింద మంత్రిగా నుండెనని యూహించుటయే సమంజసమైనట్లు కన్పట్టుచున్నది. ఈమంగమ్మదేవి క్రీ. 1689వ సం. మొదలు 1704-వ సం. వఱకు విజయరంగచొక్కనాథుని సంరక్షణకర్త్రిగా రాజ్యముచేసెను.

మీనాక్షీనాయకుఁడు మధుర మీనాక్షీ యాలయమున కెదుట నొక మండపమును గట్టించి యఖండదీపముఁ గూడ నిల్పెనఁట. విజయరంగచొక్కనాథుఁ డనేక ధర్మకార్యములు చేసెను. శొంఠి (సొంటి) గున్నయ్య యనునాంధ్రబ్రాహ్మణున కొక యగ్రహార మిచ్చెనఁట. ఈబ్రాహ్మణుని సంతతివా రిప్పటికిని నాయగ్రహార మనుభవించుచు పెరియకొళగ్రామమందున్నారు.

విజయరంగచొక్కనాథుఁడు గతించినపిదప నాతని భార్య మీనాక్షమ్మ 5-6 సంవత్సరములు మాత్రమె రాజ్యముచేసెను. అనంతరము దేశము తురుష్కాక్రాంత మాయెను. అప్పుడు వేంకటకృష్ణప్పనాయఁకుని కుటుంబమువారు తమబంధు వగు వడకరై జమీందారు నాశ్రయించి యచ్చటనే నివసించిరి. 1870-వ సంవత్సరము వఱకు నీకుటుంబమువారు వడకరై గ్రామాధికారులు (గ్రామమునసు మునసబులు) గానుండిరి. విజయభాగము అలగిరిస్వామి నాయఁకుఁ డనునాయనతో సముఖవంశ మంతరించెను. ఈయలగిరిస్వామినాయఁకుఁ డిపుడు వడగర దొడ్డప్పనాయఁకనూరుసంస్థానములకు [illegible] గు ఆనరబుల్ దివాన్‌బహాదర్ పి. రామభద్రనాయఁడుగారి

మేనత్తపెనిమిటి. ఆయన దౌహిత్రుఁడగు రామా వెంకట స్వామి నాయఁడుగారు వర్ధమానులై యున్నవారు.

ఈగ్రంథమునకు రెండువ్రాతప్రతులుమాత్రమేపరిషత్తునకు లభించినవి. అందొకటి మ. రా. పుదుకోట తిరుమలవీరాస్వామిపంతులు వారివలనను, మఱియొకటి మ.రా వత్తలకూండు జి. ఎస్. కృష్ణయ్యగారివలనను లభించినవి. పరిషత్పుస్తక భాండాగారమున మొదటిది 142-వది. రెండవది 308-వది. ఈరెండును దప్ప మూఁడవప్రతి యెక్కడ నున్నట్లు కనఁబడదు.

అచ్చులో నేమేమి మార్పులు జరిగినవో తెలుపుటకై 7-వ పుటకు సరియైన భాగ మెక్కవ్రాతప్రతిలో నున్నది యున్నట్లీగ్రంథమున కనుబంధముగ ముద్రింపఁబడినది

మధురజిల్లాలోని వడగరై, దొడ్డప్పనాయఁకనూరు జమీందారు లగు ఆనరబుల్ దివాన్‌బహదరు వి. రామభద్రనాయఁడుగారి ధనసహాయ్యమున నీగ్రంథము ప్రకటింపఁబడినది. శ్రీనాయఁడుగారి యౌదార్యము, మాతృభాషాభిమానమును బ్రశంసనీయములు.

జయంతిరామయ్య.

పరిషత్కార్యనిర్వాహకసభాధ్యక్షుఁడు.

ద్వితీయముద్రణవిషయము :— ప్రథమ ముద్రణ ప్రతులన్నియు వ్యయమగుటచే మరల నీ గ్రంథమును ముద్రింపించితిమి. ప్రథమముద్రణమునకును దీనికిని పాఠభేదము లేవియు లేవు. జ॥ రా॥

శ్రీరస్తు.

జైమినిభారతము.

# పీఠిక.

---

జైమినిభారత మను నీవచనకావ్యమును సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు రచియించెను.

—: కవివంశము, కాలము :—

ఇతఁడు తనవంశకర్తయయిన కేశవప్పనాయనిఁగూర్చి యహల్యాసంక్రందనసారంగధరచరిత్రల యవతారికలలో నిట్లు వర్ణించికొనెను.

క. శరణంబులు జగముల కా
   భరణంబులు వేదములకుఁ బంకజలక్ష్మీ
   కరణంబులు నారాయణ
   చరణంబు లెసంగు శూద్రజాతికి నిరవై.

క. నాలవవర్ణం బనియెడి
   పాలసముద్రంబునందు భావుకలక్ష్మీ
   లోలుఁడు లోకావనకరు
   ణాలీలుఁడు కేశవప్పనాయఁడు వెలసెన్.

జైమినిభారతమునందుఁ గూడ నీతనివంశావతార మభివర్ణింపఁబడియుండునుగాని పరిషత్తునకు దొరకిన రెండు

ప్రతులయందు నవతారికాభాగము పోయినది. శేషము వేంకటపతికవి తనవంశావతారమును వర్ణించినట్లుగానొక్క రీతిగా సారంగధరచరిత్రయందు నహల్యాసంక్రందనము నందును వర్ణించికొనిన యాతని వంశక్రమ మిట్లని తెలియుచున్నది.

"ఈకవివంశమందు మూలపురుషుఁడు కేశవప్పనాయఁడు; ఆతనిపుత్రుఁడు వేంకటనాయఁడు; ఆతనికుమారుఁడు పెదగురువప్పనాయఁడు; అతనిసుతుఁడు ఎల్లిసెట్టినాయఁడు; అతనితనూజుఁడు వేంకటనాయఁడు. ఈవేంకటనాయనికి వేంకటాంబయందు మీనాక్షీనాయఁ డుదయించెను. ఈమీనాక్షీనాయఁకునకు నలమేలమాంబయందు జైమినిభారతాదికర్తయగుసీవేంకటకృష్ణప్పనాయఁకుఁ డుద్భవిల్లెను."

ఈతఁడు తనతాత నీక్రిందివిధముగా నయ్యవతారికలయందు వర్ణించికొనెను.

సీ. ధన్యుఁడై నృపతిమూర్ధన్యుఁడై నిర్ధూత
దైన్యుఁడై నృపసంఘమాన్యుఁడగుచు
గేయుఁడై సుజనావిగేయుఁడై దానరా
ధేయుఁడై విద్వద్విధేయుఁ డగుచు
ధీరుఁడై కదనహంవీరుఁడై కనకాద్రి
ధీరుఁడై సద్గుణాహారుఁ డగుచు
శీలుఁడై హరిభక్తిశీలుఁడై సంగీత
లోలుఁడై కవిబృందపాలుఁ డగుచు

గీ. సకలబాంధవసంతోషి సత్యభాషి
స్వామిహితకారి స్వజనరక్షణవిహారి
వెలయు బుధసంపదలచేత విబుధభాగ్య
దాయకుండైన వేంకటనాయకుండు.

ఇక్కవి జైమినిభారతవచనకావ్యమునే కాక సారంగధరచరిత్ర మను మూఁడాశ్వాసముల వచన గ్రంథమును, అహల్యాసంక్రందన మను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును, రాధికాసాంత్వన మనెడి యేకాశ్వాసశృంగార ప్రబంధమును రచియించెను. ఇందు మొదటిది పాండ్యమండలాధీశ్వరుఁ డగువిజయరంగచొక్కనాథునకంకిత మొనర్చి మిగిలినవానిని శ్రీరంగస్వామికిఁ గృతియొసంగెను.

ఇందు జైమినిభారతము నైదాశ్వాసముల యాద్యంతములయందును :—

క. శ్రీరాధావరచరణాం
భోరుహభృంగాయమాన భుజకరవీరా
ధారాఖండితశాత్రవ
శూరా శ్రీవిజయరంగచొక్కవజీరా.

ఇత్యాదిగాఁ గృతినాయకవర్ణనపద్యంబులును, ప్రత్యాశ్వాసాంతమునను—

"ఇది శ్రీపాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగచొక్కనాథమహీనాథకరుణాకటాక్షసంపాదిత గజతురంగమాందోళికాప్రముఖనిఖిలసంపత్పారంపరీసమేధమాన సముఖమీనాక్షీనాయకతనూభవ" ఇత్యాదిగా గద్యములునుండుటం

బట్టి యితఁడు విజయరంగచొక్కభూపాలునకుసమకాలికుఁడై యాతనికిఁ గృతినిచ్చిన కేవలకవి యనియే కాక యుహల్యా సంక్రందనములో శేషము వేంకటపతికవి చెప్పినట్లుగాఁ దన్నువర్ణించికొనిన.—

సీ. ధైర్యమా శౌర్యమా దాక్షిణ్యమా పుణ్య
 మా నయమా జయమా ప్రతాప
మా శుభరూపమా మహితవిజ్ఞానమా
 దానమా భోగమా శ్రీనిరూఢ
యోగమా యాశ్రితవ్యూహమా రక్షణ
 రాజద్విలాసమా రమ్యమంద
హాసమా మహితసౌహార్దస్వభావమా
 భావమా భూరిప్రభావమాస్య

గీ. నీకె తగు నంచుఁ బాండ్యభూనేత విజయ
రంగచొక్కేంద్రుఁ డత్యంతరంగసబహు
మానసామాజకత్వ మింపూన నొసఁగె
సముఖవేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర.

అనుపద్యముంబట్టి యితఁడు పాండ్యభూనాథునియాస్థానమండలి ముఖ్యసామాజికులలో (ముఖ్యమంత్రులలో) నొకఁ డైనట్లును దెలియుచున్నది. మఱియు—

గీ. .. రంగధరపతి నేను సారంగధర చ
రిత్ర వచనము చేసి తత్కృతిని నాకు
నంకితము సేయుము శుభంబు లగును నీకు.

శా. వాసిన్ రంగవిభుండ నేనుధరణిన్ వాక్రొప్ఢిమన్నీవహా
ల్యాసంక్రందనమన్ ప్రబంధమురసోల్లాసంబుగాఁ జేయనే
నాసం గోరి వినంగవచ్చితిఁ బ్రియంబౌనట్లునాపేరిటన్
భాసిల్లం దగ నంకితంబునొనఁగూర్పన్ నీకు మేలౌ నిఁకన్.

అని (శ్రీరంగనాయకుఁడు) యానతిచ్చుటయు నేనును దోడన మేల్కాంచి ... పురోహితభృత్యామాత్యసామాజికవర్గంబులు గొలువం గూర్చుండి యుభయభాషాకవితావిశేషు లైన శేషము వేంకటపతి, బుణి శ్రీకృష్ణకవీంద్రులు మాకాప్తసఖులు గావునం బిలిపించి యాశుభస్వప్నంబు వినిపించుటయు" అని సారంగధరచరిత్రమునందు నహల్యాసంక్రందనమునందును దనకుఁ గూడ భృత్యామాత్యసామాజికవర్గము గల దని వ్రాసికొనుటంబట్టి పూర్వగద్యములో వ్రాయఁబడినట్లుగా నితఁడు విజయరంగచొక్కనాథుని దయచే సామంతరా జై కొన్నిగ్రామముల కధిపతి యై నట్లు కూడఁ దెలియుచున్నది.

శ్రీవిజయరంగచొక్కనాథుఁడు క్రీ. శ. 1704—1731 నడుమఁ బాండ్యమండల మేలినవాఁ డగుటచే (చూ. ఆ. సా. పత్రిక, సంపుటము 2.220) మనకవికూడ నక్కాలము ననే యుండె ననుట స్పష్టము.

ఇవ్విధముగా నీకవి నీతనికాలమును దెలిసికొనిన పిదప నీతని ప్రకృతకృతిని గూర్చి యాక్రిందివిధముగాఁ దెలియ నగును.

## జైమినిభారతము.

ఇది యయిదాశ్వాసముల వచనకావ్యము. ఇది సంస్కృతమున జైమినిభారత మనిపిలువఁబడు నశ్వమేధపర్వమునకుఁ దెలుఁగు సంస్కృతమున నశ్వమేధపర్వమొక్కటియే మిగిలినట్లును, దక్కినపర్వములన్నియు నశించినట్లును, గాకున్నచో జైమిన్యశ్వమేధపర్వ మనియేకాక జైమినిభారత మని పేరేల వచ్చుననియుఁ గొందఱు తలంచెదరు. గాని యది యెంతవఱకు సత్యమో యూహింపరాదు. జైమినిభారతములో మిగిలినపర్వములు గొన్ని కల వని గాని, యవి నశించిన వని గాని యశ్వమేధపర్వముఁ దెలిఁగించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి గాని, యీవేంకటకృష్ణప్పనాయఁకుఁడు గాని, యెందును జెప్పియుండలేదు. అశ్వమేధపర్వమునఁగొన్నివిశేషాంశములను జెప్పఁదలఁచి వ్యాసునియశ్వమేధపర్వము కంటె వేఱుగా నతనిశిష్యుఁ డగు జైమిని యీయశ్వమేధపర్వ మొక్కటియే రచియించి యుండు నని మఱికొందఱు తలంచెదరు. ఏమయిన నేమి జైమినిభారత మనుపేర నీయశ్వమేధపర్వ మొకటియే లోకమున విఖ్యాతిం గాంచుచున్నది.

ఈకవి యీయశ్వమేధపర్వమును వచనముగా రచియించునపుడు "ఇది శ్రీసముఖమీనాక్షీనాయఁకతనూభవవేంకటకృష్ణప్పనాయఁకప్రణీతంబయిన జైమినిభారతంబునందశ్వమేధపర్వంబునందుఁ బదునాల్గవయధ్యాయము" అనునట్లు

గా నధ్యాయక్రమమున గద్యములు వ్రాయుటంబట్టి సంస్కృతాశ్వమేధపర్వమునుగూడ జూచినాఁడని చెప్పవలసి వచ్చినది. కాని వచనరచనమంతయుఁ బదములు, వాక్యములు, సమాసములు, ప్రయోగించుటలోఁ గూడఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రుని పద్యకావ్యమునే వచనశైలిలో వ్రాసెనని చెప్పఁగలదు. కాని, కవి యం దందు, విశేషముగా శృంగారవర్ణనా సందర్భములయందును, సామాన్యముగా యుద్ధవర్ణనములయందు, నాసంస్కృతాంధ్రకావ్యములను రెంటినిగూడ మీఱి యథేచ్ఛముగాఁ గల్పనము గావించి స్వకవిత్వమునుగూడఁ గొంతవఱ కిందుఁ జొనిపెను. మఱియు మూలమును నాంధ్రజైమినిభారతపద్యకావ్యమును గూడ మీఱివర్ణనాతిరేకంబునను గథితకథనంబునను గ్రంథమామూలాగ్రముగాఁ బెంచి వ్రాసెను. ఈపై విషయంబుల కిక్రింద నుదాహరణంబు లిచ్చెదను.

గీ. పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకునిమాడ్కి
ముదముమైవాఱ నుద్ధరింపుదువు గాక
పంకనిర్మగ్ను నన్ను, గోపాలతిలక.—వీరభద్రుఁడు.

పంకనిర్మగ్నంబైనధేనువును గోపాలకుచందంబున శోకమగ్నుల మైన మమ్ము నీ వుద్ధరింపుము.

వేం. కృ. నాయకుఁడు.

చ. పుడిసెఁడునీటిచేనడఁగిపోయెడుధూళికిఁగాలమేఘముల్
దొడరునెతెప్పవేయఁ జెడుదోమలమీఁదసుపర్ణుఁడెత్తిపోఁ
గడఁగునెయీసుధన్వరథికప్రభుఁడెన్నఁగ మీకు నీడుగాఁ
డుడుగుఁడు సంభ్రమం బితని నోర్చెదఁ దెచ్చెద నధ్వరా
శ్వమున్. వీర.

పుడిసెండునీళ్ళు చల్లిన నడంగిపోయెడు ధూళికిఁ గాల మేఘంబులు వర్షింపవలెనే? తెప్ప వేసినం బడిపోవు దోమల మీఁద గరుత్మంతుం డెత్తి రావలయునె? ఈరాజు మీకు సమానుండు గాఁడు. మీ రితనమీఁదఁ జేయిచేసికొనం బనిలేదు. నేనె యీతనింగెల్చి యధ్వరాశ్వంబుఁ దెచ్చెద.
వేం. కృ. నాయకుఁడు.

మఱియు వీరభద్రకవి యుపయోగించిన లోకోక్తులు జాతీయపదములు, నిందు సరిగాఁ గనఁబడుచున్నవి.

క. కలనఁ మనవారెల్లను
బొలిసిరి నీదుర్నయమునఁ బోయినయవి పె
ద్దలె నాకును "స్త్రీబుద్ధిః
ప్రలయాంతక" యనెడిపలుకబద్ధంబగునే. వీరభద్రుఁడు
నీదుర్నయంపుబోధనచే యుద్ధంబునకుంబోయిన
నాకుం గలవారెల్లను సమసిపోయిరి. "స్త్రీబుద్ధిః ప్రలయాంతక" యనెడు పలుకే యథార్థం బయ్యె. వేం. కృ. నాయ.

క. అతిమించి చొచ్చినిల్లటు
చెఱిచితి వీఁకఁ బుట్టినిల్లు చెఱిచెద ననియే
పఱతెంచితి రెండిడ్లకుఁ
'జెఱుపనచేట'వయి తేమిచేసెడిదనుచున్. వీరభద్రు

పాపాత్మురాలా చొచ్చిన యిల్లు చెఱిచినదియుంగాక పుట్టినయిల్లునుం జెఱుప వచ్చితివే? నీవంటి చెఱుపనచేఁట మాయింట నుండం దగదు. వేం. కృ. నాయఁకుఁడు.

క. చిలువదళవాయు లప్పుడు
"తలబీకనకాయ" లై "యథాయథలై" కూ
కులువత్తులు నై మొనతల
నిలువక శేషాహికడకునెఱిచెడి పాఱన్-వీరభద్రుఁడు

చిలువదళంబులు తలబీకనకాయలు యథాయథలు కకాపికలు నై మొనగట్టంజాలక శేషాహిచెంగటికింబఱచిన, వేం. కృ. నాయఁకుఁడు.

క. సొరిది ననాచారంబుల
మురు వగుచున్ బ్రథమపాదమునఁ గలిమహిమం
బెరుఁగును వడ్డునుగలిపిన
కరణిన్ వర్ణాశ్రమములు కత్తెరి గలయున్.

వీరభద్రుఁడు.

అందులోనఁ బ్రథమపాదంబున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై పెరుఁగువడ్లు గలిపిన కరణి వర్ణాశ్రమధర్మంబులుసంకరంబులగు. వేం.కృ. నాయఁకుఁడు

వీరభద్రకవి 19 పద్యములలో వర్ణించినస్త్రీమండల వృత్తాంత మిందు 19 పుటలకు సరిపడునంతగావివరింపఁబడినది. ఇందుఁ బ్రమీల యర్జునునిరాక విని యాతని మదిలోఁగామించుటయు యుద్ధముఁజేసి యతనినివశపఱిచికొని యింటికిఁ దీసికొనివచ్చి యాతనితోఁ గ్రీడించుటయు

మిక్కిలి పెంచి వ్రాయఁబడినది. ఆభాగ మిప్పటిలోకము నకు రుచింపదని యిందు ముద్రించుట మానివేసినారము. ఇదిగాక పరిషత్తునకువచ్చిన రెండుప్రతులలో నొక్కప్రతి యందుమాత్రమెయట్టి విశేషవర్ణనము కనంబడుచున్నది.

## వచనశైలి.

దాదాపు రెండువందలసంవత్సరములక్రిందట మన భాషలో వచనకావ్యములే మిక్కిలి యరుదుగా నున్నట్లు కనఁబడుచున్నది. అక్కాలమునందుఁ బండితులను గవులను బోషించి యాంధ్రగ్రంథములు వ్రాయించుటయే కాక తానుఁగూడ శ్రీరంగమాహాత్మ్యమాఘమాహాత్మ్యము లనెడి పెద్దవచన గ్రంథములను రచియించిన కవిరాజై భాషకుఁ జేయూఁత యొసంగిన మహాత్ముఁడు విజయరంగచొక్కనాథుండు. ఈతఁడు వచనకావ్యములను రచియించుటఁ గనియే "యథా రాజా తథా ప్రజా" యనునట్లాతని యాశ్రితులును వచనరచనకుఁ గడంగి యుందురని తోఁచుచున్నది. అట్టివారిలో నక్కాలమున విజయరంగచొక్కనాథునివలె నీ వచనరచన గావించినవారి గ్రంథములలో నీకవి వచనకావ్యములే ప్రధానములై కనఁబడుచున్నవి. కొంచె మెచ్చుతక్కువగా వచనకవిత్వమంకురించిన యక్కాలమునకు నిక్కాలమునకు వచనరచనయందును, దానిశైలి యందును, నేవోకొంచెము భేదము గన్పట్టుట యాశ్చర్యకరముగాదు. చక్కఁగఁ బరిశీలించినచోఁ జిన్నయసూరి

తిచంద్రిక శైలివంటి ప్రౌఢశైలి యిప్పుడు నిప్పుడుఁగూడ వెందును గానరాదు, గాని సామాన్యదృష్టితోఁ బరికించిన నో నిప్పటివచనశైలి కీగ్రంథశైలి తీసిపో దని నాయభిప్రాయము. కాని, కథాసందర్భమునుబట్టి కథాపాత్రములనామములకు సర్వనామవాచకపదము లుపయోగించుటచే సరిపోవుచుండఁగా మరల మరల నాయాపాత్రముల నామములనే తఱుచుగా నుపయోగించుటయు, యమకవృత్త్యనుప్రాసాదిశబ్దాలంకారములకై కథాప్రసక్తికభ్యంతరముగా విశేషణబాహుళ్యమును గల్పించుటయు, గ్రంథమూమూలాగ్రముగా నెఱసున్నలే కాని యరసున్న లుపయోగింపకుండుటయు, మొదలుగా నీతనివచనరచనశైలియందుఁ గొన్ని విశేషాంశములు గన్పట్టును.

ఇందలి ప్రయోగవిశేషములు.

'నేను' అనఁదగినచోటఁ "తా" ననుటయు; 'చెప్పెను' అనఁదగినచోట్లఁ 'బలుకరించె' ననుటయు, 'వానితోడ' అనుటకు "వానితోడంగూడ" ననుటయు నీకావ్యంబున సర్వత్రకనుపట్టును. కాని, యిందు "నేను" అనుటకు బదులుగాఁ "దా" నని యుపయోగించినస్థలముల 'నే' నని సవరింపఁబడినది "నేను" అనుటకు బదులుగా "తాను" ప్రయోగ మాకాలమునఁ బుట్టిన వచనగ్రంథములలోఁ దఱచు కనఁబడును.

మాకు లభించిన రెండు ప్రతులును గూడ దక్షిణదేశమందే వ్రాయఁబడిన వగుటచే సామాన్యముగాఁ దాటాకులపుస్తకములలోనుండు లేఖనదోషములకన్న నిందుమఱికొన్ని వ్రాఁతతప్పులు* మాత్రమే కలవు, గాని, కవి దాక్షిణాత్యుఁడగుటఁచే గలిగినయపప్రయోగములు విశేషముగా లేవు. అట్టి చిన్న చిన్న దోషము లిందుసవరింపఁబడినవి. 'పెట్టుక' మొదలగు నసాధు ప్రయోగములు కొన్ని ప్రాచీనగ్రంథములయందువలె నిందును గలవు.

## కావ్యప్రశంస.

ఇందలికథ మిక్కిలి పవిత్రమయినదగుటచేతను, భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు ధర్మరాజునశ్వమేధంబునకుసంరక్షకుఁడై కథ కామూలాగ్రముగాసంబంధించి వర్ణింపఁబడుటచేతను జెక్కండ్రు పుణ్యపురుషు లగురాజుల పావనజీవితము లిం దుదహరింపఁబడుటచేతను, భక్తిజ్ఞానవైరాగ్యంబులను బోధించు పెక్కువిషయంబు లిందు వర్ణింపఁబడుటచేతను సర్వజనసుబోధక మగుశైలిలో నున్న యీగ్రంథమాంధ్రదేశమందలి యెల్లరకుఁ బఠనీయముగానుండునని నాయభిప్రాయము.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

* అనుబంధము చూడుఁడు.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.

ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# జైమిని భారతము

—:o:—

## ప్రథమాశ్వాసము.

—:కథా ప్రారంభము:—

* అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన జైమినిభారతంబునం దశ్వమేధపర్వవచన కావ్యంబునకుఁ గథావిధానం బెట్టి దనిన:—శ్రీమంతుండును సామ్రాజ్యలక్ష్మీమఘవంతుండు నైన జనమేజయమహీకాంతుండు, వేదవ్యాసమహామునీంద్రశిష్యుండును సకలపురాణేతిహాస వ్యాఖ్యానవిఖ్యాతుండును మేధాసాంద్రుండు నైన జైమినిమహామునీంద్రునిం గనుంగొని, మహాత్మ! సకలపాపహారంబును బవిత్రంబు నైన కురుక్షేత్రంబునందు శత్రుసంహారకుండు శరధిగంభీరుండును గురువంశకర్తయు ధర్మయుండు నైనపాండవాగ్రజుండు కపటవర్తను లగు ధృతరాష్ట్రకుమారులఁ జతురంగబలసమేతంబుగఁ బదునెనిమిదిదినంబుల

---

* మంగళాచరణాది కృత్యాదిపద్యములు పరిషత్పుస్తకములు రెంటిలోను లేవు.

తోన రణాంగణంబున గీటడఁగించి చతుస్సముద్రముద్రితం బైనభూమండలంబు నేకచ్ఛత్రంబుగనేలుచు నశ్వమేధయాగం బొనరించె నని యెఱింగించితివి. ఆకథ సవిస్తరంబుగ నెఱింగింపవలయు ననిన జైమినిమునీంద్రుండు జనమేజయ నరేంద్రున్ గనవలోకించి, రాజేంద్రా! భవదీయపితామహుం డైన ధర్మనందనుండు విశ్వవిఖ్యాతంబుగా నశ్వమేధంబు గావించిన క్రమంబు వివరించెద వినుము. సకలశాస్త్రపారీణుండు సంగరధురీణుండు సర్వజ్ఞుండు నైనభీష్ముండుస్వర్గలోకంబున కరిగినయనంతరంబ యుధిష్ఠిరుండు శోకవ్యాకులిత

—: ధర్మరాజునొద్దకు వేదవ్యాసుఁడు వచ్చుట. :—

మానసుండై చింత నొందుచున్న సమయంబున వేదశాస్త్రపురాణేతిహాసవిద్యావిశారదుండును ననుప్రభావిజితసూనుండును త్రైలోక్యపూజితుండు నైన వేదవ్యాసమునీంద్రుండు విజయంబు సేయుటయు ధర్మనందనుం డెదురొ్కని సాష్టాంగంబుగా నమస్కరించియర్ఘ్యపాద్యాదిపూజావిధానంబు లొనరించి కనకపీఠంబున నునిచి యిట్లనియె. మహాత్మా! మేము రాజ్యంబుకొఱకుఁ గ్రూరత్వంబున కొడిగట్టి పితామహుం డైనభీష్ముని ధనురాచార్యుం డగుద్రోణుని నగ్రజుం డైన కర్ణుని వధించితిమి. ఈపాపం బేమిటం దీఱు? అక్కటా! భూవలయంబునం గలభూసురులు మాయన్న యైనకర్ణునిచే వలసిన వస్తువ్రాతంబులు గైకొని హర్షబాష్పంబులుగురియ బహువిధంబులుగా స్తోత్రంబులు సేయుచు నున్న వారలకు

ఱిప్పుడు శోకజనితంబైనకన్నీరు గురియ రోదనంబులు సేసెదరు.

భీష్మద్రోణకర్ణాదు లైనగురుజనులు చూడనిరాజ్య భోగంబు కన్నులు లేనికాయంబుకరణి సౌఖ్యావహంబు గానేరదు. పిన్ననాఁటనుండి మమ్ముఁ బెంచి పెద్దలఁ జేసిన భీష్మాదులం జంపి చేకొన్నరాజ్యంబు నేనొల్ల. భీమునిం బట్టంబు గట్టి, కానలకుంజని తపం బొనరించి పాపంబునం బెడఁబాసెద. మునీంద్రా! ఏతపంబుల నేజపంబుల నేతీర్థయాత్రల నేయాగంబుల జ్ఞాతివధం బొనర్చినపాతకంబు దీఱు? శుభంబు చేకూఱు? అనిన విని సాత్యవతేయుండు

— వ్యాసుఁడు ధర్మరాజు నశ్వమేధంబొనర్పుమనుట —

కౌంతేయుఁ గనుంగొని, ధర్మనందనా! నీవు బంధువధం బొనర్చినపాపంబు దీఱ నశ్వమేధయాగంబుఁ జేయుము. సుగుణసాంద్రుండైనరామచంద్రుండు పులస్త్యవంశంబునం బుట్టినరావణునిం ద్రుంచినపాతకంబు దీఱ హయమేధంబు గావించె. సంగరంబువలనఁ గలుగుజయంబు క్షత్రియునకు విడువందగదు. నీతమ్ములొక్కొక్కరుండుం బెక్కుసమరంబులం గెల్పులు గన్నవారలు. యాదవు లందఱునీకుం గైవసంబు గావునఁ దక్కినతలఁపులు మాని నియమముద్రం బూని యశ్వమేధంబున కారంభంబు సేయుము. అనిన విని ధర్మనందనుండు డెందంబున దైన్యంబుదోఁపఁ గృష్ణద్వైపాయనుం గనుంగొని, “మునీంద్రా! నిన్నటిసమరంబున రాజవీరు

ల్లను సమయుటం జేసి వారలకుమారులు తల్లిదండ్రులం బెడఁబాసినవారలు కావున దయసేయం దగినవారలు. తక్కిన ప్రజ లందఱు సుయోధనున కప్పనంబు లొసంగి నొచ్చి యున్నవారలు. నేను నూతనంబుగఁ బట్టంబుగట్టు కొన్నాఁడ. కావున నిమ్మహాయాగం బొనరింప రొక్కం బెక్కడ నున్నయది? రాజవంశంబుల నెల్ల సమూలంబుగాఁ బెల్లగించి కులంబు నీఱుసేసిన యట్టిదోసంబునంగాక ప్రజ లం బాధించి ధనంబులు దండుగలుం గొనం దలంచితిమేని గోరుచుట్టుపై రోఁకటిపోటు చందంబున జనులు నొవ్వ డరి నన్నుంజూచి నవ్వుదురు. కావున బహుద్రవ్యసాధ్యంబైన యశ్వమేధంబుఁ గావింపశక్తి లే" దనిన విని పారాశర్యుండు భరత కులధురీణుం జూచి "తొల్లి మరుత్తుండనుమహీపా లుండు బహుసువర్ణకం బనుయాగంబు గావించి యపారంబు గా దక్షిణ లొసంగిన బ్రాహ్మణులు తమ మోపినకొలంది యెత్తుకొని తక్కిన ద్రవ్యంబులు హిమశైలంబుచేరువం బాఱ వైచి పోయిరి. కావున నాధనంబు నీకుం దొరకెనేని యధ్వ రంబుఁ జేయవచ్చు" ననిన విని ధర్మనందనుండు "మునివ రేణ్యా! తొల్లి మరుత్తుండు బహుసువర్ణయాగంబుం జేసిభూసు రుల కొసంగినద్రవ్యంబు వారలసొమ్ము కావునఁ దద్ద్రవ్యంబు దానంబుసేసి తిరింపంగోరుట గొప్పతప్పు యి దెప్పగా వైచి కొని సముద్రంబు నీఁదఁ దలంచినచందం బగు. కులంబు ద్రుంచుటయు గురువులయెడఁ గల్లలాడుటయుం గాక

బ్రాహ్మణద్రవ్యం బపహరించితిమేని పాతకంబునకుం గొ
అంతే యేమి?" అనిన విని మునికులతిలకుండు కురుకులతి
లకుం గాంచి మున్ను పరశురాముండు కశ్యపునకు దానంబు
సేసినభూమండలంబు రాజులెల్లం బరిత్యజించిరే! విప్రులకు
మోహం బరంబు గాక పరిత్యజించిన ధనంబు రాజులకుం
గాని తక్కినవారలకుఁ బనిలేదు. అదియునుం గాక మరు
త్తుండు యజ్ఞసమయంబున నుచితంబైన ధనంబు దక్షిణ
లిచ్చి మిగిలినద్రవ్యంబు కొల్లవిడిచిన బ్రాహ్మణులెల్లఁదనిసి
విడిచినయర్థంబుఁ గైకొనుటకై వెఱవం బనిలేదు. ఇందు
నిమిత్తంబుగా నీమనంబున నావంతయు వంతవలదు. అశ్వ

—: వ్యాసుఁ డశ్వమేధవిధానంబుఁ జెప్పుట :—

మేధ్వరంబు గావించువిధానంబు సావధానంబుగానాకర్ణిం
పుము. వేదశాస్త్రపురాణాదివిశారదులును, సత్కులప్ర
సూతులును, గోవిందపాదారవిందకందళితాంతరంగులును,
దేజోవిరాజితులు నైనబ్రాహ్మణు *లఱువదివేలు ఋత్వి
జులు గావలయు. అందు నొక్కొకరికి హాటకసమేతంబుగా
నొక్కఘోటకంబును, నొక్క† మదపుటేనుంగును,నొక్క
యరదంబును, బయఁడిసిరత్నంబులును, వెయ్యేసి యావు
లును, నావునకు నూటేసి గొఱ్ఱెలుంగా దక్షిణ యొసంగి
నియమంబునం దురంగమంబును బూజించి విడువవలయు.
ఇది మొదటిదినంబున నీయందగిన దక్షిణాప్రకారంబుదెలి

---

* లిరువదివేలు-పా. † మూలములో మదమునే
నుంగు అనియున్నది.

పితి. ఇంకనశ్వలక్షణంబువినుము. చంద్రచందనకుందకుసుమ సవర్ణం బైనవర్ణంబును నింద్రనీలంబునవియగు చెవియును, గనకగుచ్ఛంబుంబోలు పుచ్ఛంబును, గలిగి నిరాఘాట ధాటీపాటవం బైనయశ్వరత్నం బశ్వమేధయోగ్యం బగుం జిత్రాపౌర్ణమీదినంబునం జతురంగంబుల జతనంబు సేసి తమ్ముల నేనియుం గొడుకుల నేనియుం దద్రక్షణంబునకు నియోగించి కనకపట్టికయందుం దనబిరుదాంకంబులతో, "వీరుండు శూరుండు ధారణిం గలిగి రేని యీహయంబుం బట్టుం" డని వ్రాసి యాసువర్ణపట్టంబుం దేజినుదుటం గట్టి యథేచ్ఛంబుగావిడిచి, యాహయంబుమూత్రపురీషంబులు విసర్జించు తావుల గోసహస్రంబు దక్షిణగా హోమంబు సేయం బనిచి సంవత్సరంబు సంకల్పంబు సేసికొని యయ్యశ్వంబు మగుడవచ్చు పర్యంతంబు నియమంబుతోడంగూడ దీక్షించి భార్యయుం దానును బ్రహ్మచర్యంబు నధశ్శయనంబునుం జేయుచు నసిధారావ్రతంబుగా నుండవలయు. మున్ను దేవేంద్రుండు నూఱశ్వమేధంబులు సేసెం గాని నియమంబు సలుపనేరం డయ్యె. పాండునందనా! నీవునన్నియమంబుతోడ నొక్కయాగంబు గావించితి వేని సకల పాపహరం బగు. వలరాజువలలకుం దగులని భీష్ముండొక్కరుండు దక్కం దక్కినవారలకుం గూడదు. కావుననిమ్మహాధ్వరంబు రాజు లెవ్వరుం జేయ నోపరు. నీకుశక్యం బేని శ్రేయము.

అనినవిని ధర్మనందనుండు కృష్ణద్వైపాయనుం గనుంగొని, మహాత్మా! నాతమ్ములు భీమార్జున నకులసహదేవులు యుద్ధంబున మిగులడస్సియున్నవారలు. మహాబలుండును, గర్గసూనుండునగు వృషకేతుండు బాలుండు. ఘటోత్కచుండు మాకార్యంబున హతుండయ్యె. అతని తనయుండగు మేఘవర్ణుండత్యంత బాలుండు, గావున వారల నిప్పు గయ్యంబునకుం బంపుట యయుక్తంబు. ఎవ్వాని ప్రాపునం గవ్వాడి వైరిరాజులం బరాజయంబు నొందించె నాగోపాల దేవుండు దూరంబున నున్నవాఁడు. కావున నీయాగంబే విధంబునం జేయఁగలవారము. అనిన విని భీమసేనుం డగ్రజునవలోకించి "శ్రీకృష్ణదేవుండు సర్వత్ర పరిపూర్ణుండు. ఇచ్చట లేఁడన నేటికి; అద్దేవుం దలంచిన మాత్రంబునం బాపంబులు హా పడంగు. సుకృతంబులు లభించు. అదియునుం గాక యొక్క రహస్యంబు వినుము. శ్రీవాసుదేవుని యానతి ప్రకారంబున మనము కయ్యంబొనర్చి జ్ఞాతివధం బొనర్చితిమి యంతియ కాని స్వాతంత్ర్యంబుగఁ జేసినవారము కాము. కావున మనకు లేశమాత్రంబును దోషంబు లేదు. అశ్వమేధంబు సేసిన నేమి చేయకున్న నేమి! శ్రీకృష్ణదేవుని పాదాంబుజంబులు నమ్మియున్న మోక్షంబునకుం గొఱఁత లేదు. ఎట్టయినను రాజలోకంబులోఁ గీర్తి కలుగుటకు నై యీయాగంబు సేయ నుద్యోగింపుము. హయమేధయోగ్యంబైన గుఱ్ఱం బీలోకంబున నున్నం జాలదు. ...

—వ్యాసుఁ డశ్వమేధహయంబున్న తావుం జెప్పుట—

తవారెదిరించినను జయించి తెచ్చెద* ననిన వ్యాసమునీంద్రుండు ధర్మరాజుతోనిట్లనియె. మహీపాలకా! భీముని వాక్యంబు నిజంబు. భద్రావతీ పురంబున యౌవనాశ్వుం డనురాజు రాజ్యంబు సేయుచున్నవాఁడు. అతనిలాయంబున నేఁజెప్పిన లక్షణంబులుగల గుఱ్ఱం బొక్కటియున్నయది. పదియక్షౌహిణులసైన్యంబు తేయునంబనలు తప్ప వేయక దానిం గాపాడుచునుండుఁగావునఁ బోతుటీఁగ కేనియుం బోలయుఁగూడదు. అత్తురంగంబు నీకుం దక్కు నేని జన్నంబు నెఱవేఱు. అనినవిని భీమసేనుం డిట్లనియె.

—: భీముఁ డశ్వముం దెత్తునని ప్రతినవట్టుట :—

అన్నా! దేవాసురులడ్డమై రేనియు జయించి యౌవనాశ్వునింటనున్న యశ్వమేధాశ్వంబుం దెచ్చెద. మీపాదంబులాన. అట్లుసేయనైతినేని, వేదఘోషంబు లేని గ్రామంబునందును శివాలయంబు విష్ణుదేవుని దేవళంబును లేని స్థలంబునందును వాసంబుచేయువాఁడును, దల్లిదండ్రులకు *రెండు దలంచిన దుర్జనుండును, జనంబువాడని బావిలోని జలంబు గ్రోలినవాఁడును, బ్రాహ్మణులతోడ ససత్యంబు వలికినవాఁడును, సప్పుదీసికొని యటమటించినయధముండును, విశ్వాసపాతకియుఁబోవుగతులకుఁ బోవంగలవాఁడ. అనిపలికి యూరకున్న తమ్మునిం జూచి, యయ్యా! యౌవ

* రెండు=భేదము.

తోడంగూడం జని మర్గమం బైన యావనాశ్వ పురంబు ప్రవేశించి నాభుజాబలంబులచే శత్రుసైన్యంబుల గెలిచి యాశ్వమేధాశ్వంబుఁ దెచ్చి మీకు సమర్పణంబు గావించి మాతండ్రి పాపంబులం బోఁజేసి సద్గతికిం బనిచెద నుత్తరువు దయసేయవలయు.

అనిన ధర్మనందనుండు కర్ణపుత్రునిఁ గౌఁగిలించుకొని యన్నా! మీపినతండ్రి తోడఁగూడఁజని శత్రుసంహారంబు గావించి జయంబుఁ జేకొని హయంబుఁ దెమ్మని పంచిన నమ్మాటలు విని ఘటోత్కచకుమారుండైన మేఘవర్ణుండు కయ్యంపు వేడుక మొగంబునఁ జెంగలింప ధర్మనందనుం గనుఁగొనిన యభిప్రాయం బెఱింగి భీమసేనుండు, వత్స మీతండ్రి యగు ఘటోత్కచుండు మేము వనవాసంబు చేయునప్పుడు గంధమాదనపర్వతంబున మమ్ము రక్షించి మానిమిత్తంబుగా రణంబునఁ బ్రాణంబు విడిచె. అతండు చేసినయుపకారంబులఁ దలఁచికొనిన మనంబు గరఁగుచు నున్నయది. కావున నిన్ను జగడంబునకుం దోడ్కొని పోవనోప. మేము వచ్చుపర్యంతంబు ధర్మనందనుం గొలిచి యుండుము. అనినవిని మేఘవర్ణుండు తాతయగు భీమునిం జూచి తొల్లి శ్రీరామభద్రునిపాదారవింద రేణువులచేఁ బాషాణంబు పావనంబైన తెఱంగున గంగానదితోఁ గూడి యడవివాఁకె యోగ్యంబైన కైవడి మాతండ్రి మీకు జనిఝుంచుటవలన ధన్యుం డయ్యెఁ గావున నేను మిమ్ముఁ గొ

లిచి భద్రావతీపురంబునకు వచ్చెద అగస్త్యుండు సము ద్రంబుఁ గ్రోలిన చందంబున వైరి సేనా సముదయంబుల నీవు బింకంబు లణంప నీవృషకేతనుండుపగతురసైన్యంబుల నడ్డగించి యాహవంబు సేయుసమయంబున మేఁకపిల్లను బోలె నాయశ్వరత్నంబు నెత్తికొని యతివేగంబునం జను దెంచెద నని పలికినఁ బరమానందంబు డెందంబునఁ గ్రందుకొన సమీరనందనుండు ఘటోత్కచతనయుంగౌఁగి లించుకొని, పౌత్త్రకా! నీభాషణంబులు మాకుం గర్ణభూష ణంబు లయ్యె. నీవు నేను వృషకేతనుండును గూడితిమేని మనమువ్వురితోఁ బ్రమథగణసమేతుం డైనత్రినేత్రుండు నెదిరింపఁ జాలఁడు. అని పలికి యుద్ధసన్నద్ధు లైయున్న సహోదరపుత్త్రపౌత్త్రులం గనుంగొని ధర్మపుత్త్రుం డానంద బాష్పాకులితనేత్రుండును బులకాంకితగాత్రుండును నై త్రేతాగ్నులచందంబునం దేజరిల్లు నమ్మువ్వురం జూచి లోక త్రయంబున వీరల కసాధ్యంబు లేదని యుత్సహించె. అంతఁ బడమటిదిక్కనియెడుపడంతికొప్పునం జెక్కినచెంగ లువచందంబున రవిబింబంబు కెంపెక్కినగుకాంతితోఁ గూడ నస్తగిరిప్రాంతంబునకుం జనియె. అప్పుడు వివిధవిద్యావిలా సుండును జ్ఞానకలావాసుండును బ్రహ్మధ్యానమహోల్లాసుం డును నైన వేదవ్యాసుండు ధర్మనందను నాశీర్వదించి యతం డొనర్చు పూజ లంగీకరించి తనయాశ్రమంబునకు విజ యంబు సేసిన ధర్మతనయుండు సంధ్యావందనాదికృత్యంబు

లాచరించి తమ్ములు సమీపమ్మునం గొలువ రత్నసింహాసనమ్మునం గూర్చుండె. తదనంతరంబు కౌంతేయాగ్రజుండు క్రమ్మఱఁ జింతాక్రాంతుండై, భద్రావతీపురంబున కెవ్విధంబునం జనువారము! గుఱ్ఱంబు నెట్లు దెచ్చువారము! దక్షిణలకు ధనం బెక్కడ నున్నయది! యాగంబునకు నిర్వాహకుం డెవ్వండు! కృష్ణద్వైపాయనుం డాడినమాటల కేల యియ్యకొంటి. త్రిలోకాధిపతియైన శ్రీకృష్ణుండు నిర్వ్యాజకరుణాకటాక్షంబునఁ దనకుఁ దానవచ్చి యీయాగంబు నెఱవేర్చినం గాని యెవరికి శక్యంబు! శ్రీకృష్ణా! వృష్ణికులభూషణా! కమలాక్షా! త్రిలోకాధ్యక్షా! భక్తసంకటవిమోచనా! శోకార్ణవంబున మునింగి యున్నవాఁడ. నీకృపయను నోడచే నన్నుం దరింపం జేయుము. మున్ను కౌరవసభలో మానభంగంబు గాకుండఁ బాంచాలిని రక్షించినక్రమంబున నన్ను రక్షింపుము. అనిబహువిధంబులఁ బ్రస్తుతింపుచు ఫాలతలంబున మోడ్పుంగేలు గీలించి శ్రీకృష్ణదేవా! నీవె దిక్కని వేఁడుకొను నవసరంబునసర్వభూతాంతర్యామియు

—: శ్రీకృష్ణుండు హస్తినాపురంబునకు వచ్చుట: —

విశ్వరూపియు నగుగోపికావల్లభుండు నయ్యర్ధరాత్రంబున హస్తినాపురంబునకువచ్చి ధర్మనందనునగరుసొచ్చి ప్రతీహారిం గనుంగొని మారాక ధర్మనందనున కెఱింగింపుము. ఎంతవాని కేనియు మహీకాంతుని సమయంబు దెలియక చనవు గల దని యంతిపురంబునకుం బోవుట యుచితంబు గా

దనినఁ బణిహారి గోవిందునకు వందనంబు గావించి దేవర యేసమయంబున విజయంబు సేయుదు రదియ సమయం బని మొదల నాతోడ మహారాజుగా రుత్తరు విచ్చియున్నవారు. కాన నవసరంబుఁ జూడం బనిలేదు. పరస్త్రీపరధనంబులు గోరుదురాత్మకులును, బరుల దూషించు దుర్మతులును నీ కరుణ వడయలేరు. ధర్మనందనునకు కీదుర్గుణంబు లెవ్వియు లేవు. తానుం దమ్ములు నహోరాత్రంబు దేవరపాదార విందంబులు ధ్యానంబు సేయుచు నున్నవారని పలికి యతి శీఘ్రంబుగఁ బఱతెంచి, రాజేంద్రా! శ్రీకృష్ణదేవుండునగరి వాకటికి విజయంబుసేసె ననుటయుఁ బాండవాగ్రజుండా శ్చర్యభరితమానసుండై మొగంబు చెంగలింపఁ దమ్ములుం దానుఁ నెదుర్కొనుటయు వసుదేవనందనుండు ధర్మజాపనం బులకు వందనం బాచరించిన నతండు గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొని యానందబాష్పంబులుకపోలతలంబులంగురియ రోమాంచంబు ముంచికొన నద్దేవుదివ్యరూపంబుసందర్శిం పుచు నానందసముద్రంబునం దేలియాడుచునుండె. అంత భీముండు నర్జునుండును శ్రీకృష్ణదేవుని చరణారవిందంబు లకుఁ బ్రణామంబులు సేసిరి. నకులసహదేవులునట్లు కావిం చిరి. అంత సత్యభామాకాంతు నంతఃపురంబునకుఁ దోడు కొనిపోయియర్ఘ్యపాద్యాదివిధానంబులం బూజించి హర్షిం చి కనకాసనంబున నునిచి తాము నుచితాసనంబులం గూ ర్చున్నయెడఁ బాంచాలరాజనందన ముకుందునకువందనం

బొనరించి మందస్మితంబు వదనారవిందంబునం జెలువొంద ధర్మజుమొగంబు గనుంగొని యర్ధరాత్రంబున నచ్యుతుం డిచ్చటికి వచ్చెనని యచ్చెరు వొందనేల? తనభక్తు లెచ్చట నెచ్చట నుపద్రవంబు నొందుదు రచ్చటికివచ్చి రక్షించుట యద్దేవునకు సహజగుణంబు. ఆకౌరవసభలోన దుశ్శాస నుండు మీర లేవురుం జూచుచుండ వలువలొలుచునప్పుడు హా! గోవిందా! పుండరీకాక్షా! శ్రీకృష్ణా! యని డెందం బునం దలంచిన యంత నక్షయవస్త్రంబు లిచ్చి మానసం రక్షణంబు సేసె, మన మర్జునుని ద్వారకానగరంబునకుం బంపి పిలిపింపవలయు నని తలంచుచు నుండఁ దనకుం దానె వేంచేసె. ఇద్దేవుని భక్తవాత్సల్యం బెంతని కొనియాడం గలదాన ననినఁ బాంచాలి నవలోకించి కించిదంకురితహాస భాసురముఖారవిందుండై గోవిందుండు చాల నాదరించె.

అంతఁ గొంతేయాగ్రజుండు రుక్మిణీకాంతుంజూచి మేఘ గంభీరస్వనంబున నిట్లనియె. కమలనాభ! నాదు మనస్తా పంబు నుపశమనంబు నొందింపం గోరి దేవరఁ దలంచితి. నాతలంపునకంటె మున్నుగా నీవు ప్రసన్నుండవైతివి. నా మనోరథంబులు ఫలియించె. వ్యాసమునీంద్రుననుమతి నశ్వ మేధంబుం జేయం దలంచితి. సకలకర్మంబులకుఁ గర్తవు భోక్తవు నీవ కావున నీయధ్వరంబు నిర్వహించుభారంబు నీయది యనిన విని దేవకీనందనుండు కుంతీనందనుం గనుం గొని శౌర్యవంతులకుఁ జేయంగూడనికార్యంబు లేదు. నీ

## —: శ్రీకృష్ణుఁడు భీముని తేజంబు వృద్ధినొందిప యత్నించుట: —

తలంపు సనుకూరుసని పలికి పవననందనుం జూచి నెమ్మొగంబునం దెలుపగవు తళుకొత్త, వృకోదరా! నీకు బుద్ధిమందంబు, ఆహారంబపారంబు, పొట్ట పెట్టించుచున్నది. రక్కసితతులకుం జొక్కినవాఁడవు, మాటల పోఁబడి యెఱుఁగవు. నీవంటివాఁడు మంత్రియై యున్నఁ గార్యంబు లగులకు సందియంబేమి! అంగహీనుని నిల్లటంపుటల్లుని బ్రల్లదంబుపలుకువానిని గామినీలోలునిమఱుగుజ్జువానిఁ జెవుడు గలిగినవానిం బందయగువాని మామగారిని వెళ్ళిపట్టిన వాని స్త్రీనశంవదుని నిర్దయునిఁ బ్రచండకోపనునిఁ బ్రమత్తునిఁ మంత్రిఁ జేసినఁ గార్యభాగంబులు సిద్ధినొంద నేరవు. నీవు బాహాబల గర్వంబునఁ గార్యపద్ధతు లెఱుంగవు. గర్వాంధులుఁ బాపస్వభావులు నగు బక హిడింబ కిమ్మీర జరాసంధాదులం జంపినయట్లు సులంభంబుగాఁదలంపకుము. సత్యసంధులును భుజాబలధురంధరులును జితేంద్రియులు దానశీలురు నగు రాజశ్రేష్ఠులు పెక్కండ్రు గలరు. ఒక్కొక్కని జయించుట కక్కసంబు. సూర్యుం డస్తంగతుండు గాకమున్న సైంధవుని వధియింతు నని నాఁడు గాండీవి గావించినప్రతిన నెఱవేఱుట దైవయత్నంబు. మారుతనందనా! నీ వంతకంటె సాహసంబుగాఁ బ్రతిన సేసితివి. ఇది నెఱవేఱుట యెట్లు! యజ్ఞఘోటంబు నిరాఘాటంబుగా దిక్కులం జరించునెడ శౌర్యవంతులైన మహీనాథులు దేవ

గంధర్వ కిన్నర యక్షరక్షోగణ నాథులచేఁ బహువిధస్తవం బులు గావింతురు. మున్ను దశరథనందనుం డశ్వమేధంబు సేయుచు వానరబలంబులను భల్లూకసేనల నశ్వరక్షణార్థ ముగా నంపిన శుక్తిమతీపురంబున సురథుం డను మహా రథుండు తురంగంబుతోఁ గూడ వానరసేనల నెల్లం గట్టివేసి న యెడ శ్రీరామభద్రుండు తానె చని యశ్వంబును మరల్చికొని వచ్చెఁ గాని నీవు సహాయంబుగా నున్నం దోడ్కొనిపోవుట కర్జంబు. అనిన నా సమయంబునను బక మర్దనుం డిట్లనియె. బావా! నేను నీ వానతిచ్చిన గుణం బులు గలవాఁడ నగుదు. నీకు సాటివంటిగుణంబు లెవ్వి యు లేవు గద! నీకామాంతురత్వంబునకు గొల్లయిల్లాండ్ర గుబ్బపాలిండ్లు సాక్షి. నీచస్త్రీసంగమంబునకు నీమత్స్య కూర్మవరాహావతారంబులె సాక్షి. బహుభక్షకుండ వగు టకు బ్రహ్మాండకోటిపరిపూరితం బైననీకుక్షి సాక్షి. నీస్త్రీ లోలత్వంబునకు సత్యభామానిమిత్తంబుగా భూమికిం ద చ్చిన పారిజాతవృక్షంబు సాక్షి. నీమాయాచరితంబులు ప్రకటింప నెవ్వరితరంబు? దేవరకటాక్షంబు తోడుగఁ దొల్లి బకహిడింబకిమ్మీరజరాసంధులఁ గెలిచితి నిప్పుడును నీవలెనె యౌవనాశ్వవిశ్వంభరావల్లభుని గెలిచి యశ్వమేధాశ్వం బుం దెచ్చెద. నాహృదయంబులో దేవరదివ్యశ్రీపాదపద్మం బులు కుదురుగ నున్నం జాలు. తద్బలంబున గదాదం డంబు కేలం గొని కులపర్వతంబులఁ బెకలింతును. శ్లో॥

భద్రావతీపురంబునకుఁ జని తద్రాజవర్యుని గెలిచి హయం బు దెచ్చుపర్యంతంబు సవ్యసాచి ధర్మరాజుసముఖంబునం గాచికొని యుండు నని మాటలాడుసమయంబున ద్రుపద రాజపుత్రి వచ్చి యారగింప సమయం బయ్యె విజయంబుచే యుఁ డనుటయు ధర్మనందనుండును వసుదేవనందనుండును గృతమజ్జనులై ధౌతపరిధానంబులు ధరియించియిష్టాన్నపా నంబులం బరితుష్టి నొంది యుచితప్రకారంబుల నారాత్రి సు ఖనిద్రం జెంది మఱునాఁడు వందిమాగధబృందంబుల బిరుద గద్యపద్యంబులు గాయక వైణికుల యంత్రగాత్రగానంబులు నాలకించుచు నిదుర మేల్కొని స్నానసంధ్యావందనాది నిత్యకృత్యంబులు నిర్వర్తించి సంతోషభరితాంతరంగులై సభాస్థలంబునకు వచ్చిరి.

—:భీముఁ డశ్వమునకై భద్రావతి కేఁగుట.:—

అంత భీమసేనుండును యుద్ధసన్నద్ధుఁ డై ధర్మతనయు పాదంబులకుఁ బంకజాక్షుని పదపంకజంబులకు వందనంబు లొనరించి కుంతికిం బ్రణమిల్లి వివ్వచ్చుం గ్రుచ్చి కౌఁగిటం జేర్చుకొని తాను వచ్చుపర్యంతంబు ధర్మతనయుం గాచి యుండుమని నియమించి మాద్రీనందనుల నుపచరించి ద్రు పదికింజెప్పిమఱియు మురవైరిచరణాంబురుహంబులకుఁ బ్రణమిల్లి ప్రమోదభరితమానసుండై వృషకేతుమేఘవర్ణు లు సంగరోత్సాహపరిపూర్ణులై తోడం జనుదేర యౌవనా శ్వుం డేలు భద్రావతీపురంబునకుం గతిపయప్రయాణంబు

లం జనిచని బంగరుమెఱుంగులం దుఱంగలించు నుత్తుం
గంబులైనశృంగంబులం గీలుకొలిపిన కెంపులగుంపుల సొం
పులుగులుకు ప్రకాశంబుల రాత్రులం బగళ్ళు సేయుచు నమ
రావతీపురసమానంబును స్ఫటికమణిమయంబులు నంబరతల
చుంబితంబులు నైనకోటలును, పాతాళతలగంభీరంబులు
నుల్లోలకల్లోలసముల్లసితంబులుఁగమలకువలయగంధబంధు
రంబులు నైనయగడితలును, కనకమయశిఖరంబులం దా
పిన గుత్తంపు ముత్తియంబులదండంబులచేఁదారాగణంబులవిడం
బించు సౌధంబులును, గోపురాగ్రంబులం గీలితంబు లైన
యింద్రనీలంబులకాంతుల సకాలతిమిరములం గలుగఁజే
యు గవనివాకిండ్లును గలిగి వేదఘోషంబుల మట్టు
పడంజేయుచు హోమధూమంబులచే మార్గంబులం గాన
రానీయక యాగయూపసంఘంబులచే నహనంగూడక సాధు
జనసంతోషణంబును నైనసభామణంబు నైనయాపురంబు
చేరం జని పూచి కాచి ఫలించి కైవ్రాలిన మావులు
మోవులుఁ బొన్నలుఁ బోగడలుఁ దాళ హింతాల తమాల
నారికేళ పనస క్రముక ప్రముఖ తరువులు నల్లిబిల్లిగా నల్లికొ
నిన మల్లెలు మొల్లలు సన్నజాజులు విరవాజులు మొద
లైన తీవలం బొలుపొందుచు, చిలుకలుఁ గోయిలలు శారి
కలుఁ జకోరికలు నాదిగాఁ గల పక్షికులంబులకలకలంబు
లును, జింకలు దుప్పులు వీహామృగంబులుఁ దక్కినమృగ
విశేషంబులచే భూషితంబులు నైనపువ్వుంబోదలం బొలు

పొందు హృద్యం బైనయుద్యానంబునందు నిలిచి సమీర కుమారుండు వృషకేతుం జూచి, కుమారకా! యీవనం బునం జెంగలువలు నల్లగలువలుఁ దెలిగలువలుఁ జెందా మరలు వెలిదమ్ములుం దొరంగినపుష్పాదులం దేనియలం బొంది చిత్రవర్ణంబు లైన తరంగమాలికలం జెన్నుమెఱసిన తటాకంబుఁ గనుంగొనుము. ఇచ్చటి కీరాజునగరి వాజి సంఘంబులు నీళ్లుద్రావం జనుదెంచు నందశ్వమేధయోగ్యం బైనయశ్వంబును వచ్చుఁ గావున, దానిం గాపాడికొనవచ్చు సైనికానీకంబుం బాఱఁ ద్రోలి హయంబు రయంబునం గొని పోవుద మని పలుకుచు నొక్కపొదరింటం బొంచి యుండె.

అప్పుడు కర్ణసూనుండు పినతండ్రి యగుభీమసేనుం జూచి, యీరాజునకుంగల సేన యంతయుం బదియక్షౌహి ణులు. వానిలోఁ గొంతకొంత తురంగంబు వెంబడిం జను దెంచుఁ గాని యెల్లసైన్యంబుఁ బెల్లగిలి రాదు. కావునమన కీయశ్వంబును గ్రహించుట సులభంబు. గంగాతీరంబునం జేరిన జనులపాతకంబులుం బలె, లలాటలోచనుం డాసిన కాలకూటంబుకరణి, శ్రీవాసుదేవపాదారవింద చింతనంబు వలన మానవుని జన్మంబునుంబలె, గయావర్జనంబు చేసిన వాని పితృవర్గంబుల దుర్గతింబలె, నిమిషమాత్రంబులో శీఘ దాఘాతంబున యౌవనాశ్వుని సైన్యంబు లయంబునొందు నని సల్లాపంబు లాడుచు నుండుసమయంబున దండిమెఱయు

డిండిమవాద్యఘోషంబులును గాంచనమణిమయంబు లైన ఘంటల ఘణంఘణారవంబులును, నంకుశాఘాతంబులం బొడము ఘీంకారంబులును, గండస్థలంబులం దొరఁగు మదజలంబుల పరిమళంబులకై ప్రోయు తుమ్మెదలఝుంకారంబులునుం జెలంగ నేనుంగులు గుంపుగుంపులుగా వచ్చి యాసరోవరంబు సొచ్చి మచ్చికలు హెచ్చఁ దుండాగ్రంబుల నుదకంబులం బూరించి పెంటియేనుంగులమీఁదం జల్లుచు వానిచేఁ జల్లఁబడిన సలిలంబులచే మేనులు దడిసి మెల్ల మెల్లన దద్గాత్రంబులు నిమురుచుఁ బుండరీకముకుళంబులం బెఱికి యొండొంటితో నేటులాడుచు నన్యోన్యముఖసౌరభంబుల నాస్వాదించు సంతోషంబున ఘోషించుచు నక్క నక్కనుం జెక్కఁ జెక్కును దోడఁ దోడయునుం జెవిఁ జెవియుబరిబఱియు సరినొరయఁ గరాగ్రంబుల జలంబులం బీల్చి చిమ్మనగ్రోవులంబలెఁ జిమ్ముచుఁ బెద్దయుం దడవు తద్దయుం గ్రీడించి మావంతులబలవంతంబున జలవిహారంబులు చాలించి యమ్మదగజంబులు పురంబునకుం జనియె.

తదనంతరంబ క్రొమ్మించులమించు తేరిగండ్లయంచుల వలనం బొడమిన భూరేణువులకాలతిమిరంబు సంపాదింప గాలరుద్ర ఢక్కాఢమఢమాత్కారంబులం ధిక్కరించు వాద్యఘోషంబులు మెఱయ మృత్యువునాలిక పోలికఁ జదలం గదలు బిరుదకేతనంబులు మెఱయఁ బట్టపగలింటి మార్తాండకిరణంబులకు ననుకరణంబు లైన ప్రహరణంబులం బోలు

పొందు భటసమూహంబులు సందడింపనేల యీనిన తెఱం
గున సముద్రంబు పొరలినచందంబున వచ్చుసైన్యముంగనుం
గొని యౌవనాశ్వభూపాలుండు వచ్చెనో యనుతలంపున
దిగ్గన లేచి కర్ణకుమారుం డాసైన్యముం గలయంజూచి నీరు
గ్రోలఁ జనుదెంచు తురంగబృందంబులసందడి గాని రాజు
కాఁడని తెలిసి యనిలనందనుం జూచి, అయ్యా! కయ్యం
బునకుం గాలుద్రవ్వుచందంబున ఖురంబుల భూతలంబు
ద్రవ్వుచు నూరఁబిచ్చుకలు ముంగిసలు నొంటెలు నడచిన
కైవడి బెడంగునడలు మెఱయం బరిచారకులు వాగెలం
గుదియంబట్ట నిట్టట్టు గెరలుచు వేనవేలు తురంగంబులు
జలతరంగంబులకరణిఁ ద్రొక్కినచోటుం ద్రొక్కక యిక్కొల
నికిం జనుదెంచి నీరు ద్రావుచుం బోవుచు నున్నయవి గాని
యశ్వమేధాశ్వంబు గనంబడదు. దాని కున్నచోటన గడ్డి
యుం గవణంబు నీరు నమరించి బయలువుచ్చరుగాఁబోలు
ననిన వృషకేతుం జూచి యనిలసూతి, కుమారకా! మన
ము ధర్మజునిసమ్ముఖమున నానావిధంబులైన ప్రతినలు గావిం
చితిమి. పవనహయంబు లేకయ రిత్తచేతులతో మగిడి పోవం
జనదు. పుత్త్రులు లేనివానికిం గతి గలుగనేరని వితంబున,
నంగనావశుం డైనయజ్ఞానికి బంధుమర్యాదలు మాలిన
కరణిఁ, గార్యాలోచనము సేయునిమనుజనాథునకు రా
జ్యంబు సిద్ధింపని తెఱంగున, శ్రీవిష్ణుదేవునిచరణకమలం
బులం దలంపనివానికి శుభంబులులభింపనిచందంబున, శంక

రునిం బూజింపని వంకరకస్త్రైకు సంపదలు సంభవింపని కైపడి, హయంబునుం గైకొనకయ విఫలప్రతిజ్ఞులమైతిమేని మనకీర్తి హానిం జెందు నని మాటలాడుచుండె.

—:అశ్వమేధాశ్వము నీసుద్రావ వచ్చుట:—

ఆసమయంబున ద్విరదంబులు నరదంబులు ఘోటకంబులు భటసమూహంబులు వాద్యఘోషంబులు మ్రోయ నిచ్చలంపు ముత్యాలకుచ్చుల గచ్చులు మెఱయు ధవళాతపత్రంబు పున్నమచందురుచందంబునఁ గాంతిచంద్రికలు వెదచల్ల నుభయచామరంబులు ధవళశంఖంబులు సాంబ్రాణి ధూపంబులుఁ జంద్రకావిపావడలు దీపింప మహామండలేంద్రుని చందంబున నతిశయితవైభవంబుతోఁ బద్మాకరంబునకు నయ్యాగీయహయంబు రా నాలోకించి పట్టం దమకించు కుమారుని నివారించి మనుమనిం గనుంగొన్న సమ్మేఘవర్ణుండు సమరవిజయనేత యగుతాతకు నమస్కరించి మహాబలనందనా! లెక్కకు మిక్కుటం బైనకక్కసంపుజోదులు పెక్కండ్రు చుట్టునుం బరివేష్టింప వచ్చుచున్నట్టి యిత్తేజిం జెవివట్టికొని లేఁగదూడ నీడ్చి తెచ్చినవిధంబునఁబట్టి తెచ్చెద. యౌవనాశ్వుని నాతని కుమారుని మూటకట్టుగాఁ గట్టి మీముందఱం దెచ్చిపెట్టెద. ఇంతయేల! తురంగంబె చాలునంటిరేని యత్తెఱంగునం జేసెద నని సంగరోత్సాహంబున నంగంబు పొంగుచుండ శైలశృంగంబునుండి చంగున దుముకు సింగంపుంగొదమకరణి ధరణికిం జను

డెంచి మాయాప్రభావంబునఁ గాలకంఠకంఠకుహాళీకరాళ కాలకూటంబు కరణి గాటంబైన యంధకారంబు గల్పించి దిక్కులు విదిక్కులుం దళుక్కున మెఱుపుటొఱపులు మిగుల బ్రహ్మాండకుహరంబు విరియింపంజాలు గర్జితంబు లూర్జితం బులై యెల్లెడల వినంబడ బలుపిడుగులు వడంజేసి దేవ మానవాదులకు భయంకరంబుగ మేఘనాదునిచందంబున సింహనాదంబు సేసి యద్దనుజసింహుండు పరాక్రమంబు మెఱయించుటయు దేవేంద్రుండు చారులవలనఁ దద్వృ త్తాంతంబు విని యారక్కసుం డెక్కడివాఁడు? ఏల విజృం భించినాఁడు? తెలిసి రమ్మని యొక్కదూత నంపించిన వాఁ డునుం ద్వరితంబుగా వచ్చి యంబరంబున నాడంబరంబులు సేయు హిడింబాపౌత్త్రునిం గాంచి నీవెవ్వండవు? ఏమిటి కిట్లు విపరీతంబులు సేసెదవు? దీన నీకేమి ఫలంబు? ని న్నెవ్వ రంపించినారు? త్రైలోక్యవల్లభుం డైనదివిజనాథుండు తెలిసి రమ్మనియె, ననిన విని యాఘటోత్కచపుత్త్రుండు, నేను బాండుపుత్త్రుం డైనభీమసేను పౌత్త్రుండ. మాపెద్దతాత యగు ధర్మరాజు హయమేధంబు గావింపంగోరి యావనా శ్వుని నగరంబున యాగీయతురంగంబున్న దని విని నన్నుం బంపిన నేను దానిం బట్టికొన వచ్చి మాయలం బన్ను చున్నవాఁడం గాని దేవతలకు విరోధంబుసేయం దలంచిన వాఁడఁ గాను. అనిన విని యా దూత దేవేంద్రున కత్తె ఱం గెఱింగించిన నతండు సంతోషంబు నొందె. అంత

సంతకాలకాలునిచందంబున నద్దనుజుం - డొక్కెడం బిడుగులు గురియించుచునొక్కదిక్కున వాళ్ళులువ్వుచునొక్కచోట మిడుంగుఱులు నింగి కెగయ నిప్పులు గుప్పలించుచు నొక్కదెస ఝంఝామారుతంబుల విసరించుచు, నొక్కచక్కి మిక్కుటంబైన దుమ్ము గ్రమ్మంజేయుచు,నొక్కచోట గాటంబులైన చీఁకటుల నుత్పాదించుచు, నొక్కతావునఁ బెళపెళ మని యుఱుము లుఱుమం జేయుచు, నొక్కొక్క దిక్కునం దళుక్కు మను మెఱుంగులచే దృష్టులు మిఱుమిట్లు వడం జేయుచు సేనలనెల్లం జీకాకుపఱిచి పొట్టేటి

—: మేఘవర్ణుఁడు గుఱ్ఱము నపహరించుట :—

పిల్లం బట్టిన తెఱంగున నశ్వంబు నాలుగుకాళ్ళుం బట్టి మూఁపునం బెట్టుకొని గగనమార్గంబున కెగసిన వియచ్చరు లచ్చెరువొంది యదెయదె దానవుండు హయంబుం బట్టికొనిపోయెఁ బోయె ననియెడు నెలుంగులు నింగిముట్టఁ బ్రశంసించి కృపాయత్తచిత్తులై మేఘవర్ణుని పయిం బుష్పవర్షంబులు వర్షించిరి.

ఇవ్విధంబున భీమసేనపౌత్రుండు మాయాబలంబున యాగతురంగంబు నపహరించి కొనిపోయిన తెఱంగు హతశేషు లయినభటులు *పలుకరించుటయు యౌవనాశ్వవిశ్వంభరాధీశ్వరుండు విని యులికిపడి నిప్పు లుప్పతిల దశదిశ

*పలుకరించుట=చెప్పుట యనునర్థమున నిందు వాడఁబడుచున్నది.

లుం జూచుచు దురాపప్రతాపదీపితుండై యంబరతలం బున కెగయుంజాలు రథికుల నాలుగువేలకుం బనుపుటయు వారలు క్రోధంబున యూథంబు లగుచు విక్రమంబునఁ జక్రగదాకుంతకరవాలభిందిపాలముసలముసుండికాపరిఘ పట్టిసాది సాధనంబులు సారించుచు సవ్వీరుం జుట్టిముట్టిన నాబిరుదుమగండు బెట్టుగా నట్టహాసంబు సేసి యశ్వంబు నమరావతీపురంబునననునిచి తానుం బెట్టిదంబైన చెట్టు వెఱికికొని చుట్టుకొనిన మూఁకలం గనుపుగొట్టి యిట్టటు వడం జేసి యాగీయహయంబును మగుడం గొని తెచ్చి భీమసేను ముందఱం బెట్టి నిలిచిన నతండు పౌత్రుం గౌఁగి లించికొని దీవించె. ఆసమయంబున యౌవనాశ్వునిసైన్యం బులు క్రమ్మఱం జుట్టుముట్టిన మేఘవర్ణుండు మహార్ణవంబు నం దిరుగు మందరనగంబుచందంబునం దచ్చమూసముద యంబు గలగుండువడం జేయుచుఁ బరాక్రమించుసమయం బున వృషకేతుఁడు తనమనంబున "హయంబుం బట్టికొని వచ్చినప్పటికయ్యంబున మేఘవర్ణుండు మిగుల నలసి యు న్నవాఁడు, పెక్కండ్ర నొక్కనికి గెలువశక్యంబు గా" దని యూహించి, యనిలసుతునకు మ్రొక్కి శస్త్రాస్త్రభీకరంబైన వైరిసైన్యనికరంబు సొచ్చి యరుణారవిందచైత్రంబులైన నేత్రంబులం జుఱచుఱం జూచుచు లయకాలహుంకారశం కాకరం బైనశింజినీటంకారంబు దిశావిటంకంబులకు సంక్ర మింపం గోపాటోపంబునం దత్సైన్యంబుం జొచ్చి మేఘవర్ణు

నకుం గౌతూహలంబు సంపాదింపుచు, ‘వత్సా!నీవుకయ్యం బున మిగుల నలసినాఁడవు. తలంచినకార్యంబు నెఱవేర్చి తిమి. ముహూర్తమాత్రంబు బడలికదీర్చుకొమ్ము.” అని భీము చెంతకుం బంచి కంఠీరవంబు గంధగజయూథంబుపై నుఱుకుచందంబున నుఱికి క్రొవ్వాఁడి మెఱుంగుఁదూపు లనియెడుగోళ్లచే భద్రగజకుంభస్థలంబులు పెకలించి, తురంగ సంఘంబులం దెగటార్చి,యరదంబులం జెక్కులుసేసి,కాలు బంట్లఁ గాలునిప్రోలి కనిచి, రోదసీకుహరమేదురం బైనసింహనాదంబు సెలంగఁ ద్రిపురంబులపయిం గడంగు త్రిలోచనుఁనిచందంబున నిరర్గళంబుగ మార్గణవర్షంబులు వర్షించిన విదళితమాతంగంబును, విధ్వస్తతురంగంబును, విశీర్ణ శతాంగంబును, విఖండితభటాంగంబునై యాసైన్యంబు చచ్చియు నొచ్చియు విచ్చియుఁ జీకాకుపడుటయు నందొక్కరుండు బలుగాయంబుల నెత్తురు జొత్తిల్లుగాత్రంబుతోఁ బురంబునకుం బరువెత్తి భద్రావతీశ్వరునకుం బ్రణమిల్లి సైన్యంబు సమసిన తెఱంగును యాగీయవాజిం గొనిపోయినచందంబును విన్నవించిన యౌవనాశ్వుండు రోషారుణితలోచనుండై, యెట్టెట్టురా! వింతలు వింటిమి! పరదళం బెంత వచ్చె! గుఱ్ఱం బెటువలెం బట్టువడియె! వివరంబుగా నెఱుంగంబలుకు మనిన, దేవా! యెవ్వరో యెఱుంగము. మువ్వురు వచ్చిరి. వారిలో నల్లనిబాలకుం డొక్కరుండు గగనంబున కెగసి డేగతూఱినవిధంబునం దూఱి సేనామధ్యం

ఋన నున్న తురంగంబు నెత్తి మూఁపున నుంచుకొని విూ రంపించిన యంబరచరుల నాలుగువేలరథికులనంబరమున నె

—:యౌవనాశ్వుఁడు భీమాదులపై యుద్ధమునకు లేచుట.—

సంహరించి వెండియు నాబలంబుతో భండనంబు సేయుచు నుండఁ బెద్దనిట్టతాటిచెట్టుచందంబున లోకభీకరం బైనయి నుపగుదియ కేలంబూని యొకండు నిలిచియున్నాఁడు. వాని చెంగట సింగంపుఁ గోదమ తెఱంగున గర్జిల్లుచు నొక్క చక్కని రాచకొమరుండు కొలుచుచున్నవాఁడు. అనివిన్న వించిన యౌవనాశ్వుంపు దనయిచ్చలో మచ్చరంబు నచ్చె రువు విచ్చలవిడిం బెచ్చుపెరుఁగ, వారు మానవసామాన్యు లు గారు, కారణజన్ములు. నాకుం జూడఁ ద్రిమూర్తులునర మూర్తులై వచ్చిరని తోఁచుచున్నది. ఒక్కండుగుఱ్ఱంబును బట్టుకొని పోవుట యేమి! వేఱొక్కండు లెక్కకు మిక్కుటం బైన సైన్యంబు నుక్కడంచుట యెట్టు! ఒక్కరుండు వేడుక చూచుచు నూరకెయుండుటయేమి? ఐననశ్వమేధంబు సేయ వలయునని యతిప్రయాసంబుగా నశ్వంబు సంపాదించితినది యిత్తెఱంగునం బోయినఁ బోవనిమ్ము. ఇమ్మువ్వురితోఁ గయ్యం బనుజన్నం బొనర్చి దేవతల నెల్లం దృప్తినొందిం చెద నని యాహవోత్సాహకౌతూహలంబున సమ్మహీవల్ల భుండు దిక్కులు పిక్కటిల్ల రణభేరి మ్రోయించి మదపుటే నుంగులు, మనోజవతురంగంబులు, మణిమయరథంబులు, మహాసాహసికవీరభటులు లెక్కకుమిక్కుటంబుగా దిశలు

గ్రక్కతిల నార్చుచు, వీరాలాపంబులం బేర్చుచు, నలుఁగె లంకులం బలసి చనుదేఱఁ బురంబు వెడలి సమీపంబునకు వచ్చియుగాంతకాల కాలుండునుంబోలెఁ బ్రచండగదాదండంబు భుజాగ్రంబునం గీలించి భండనంబు గనుంగొనుచున్న వృకోదరువిలోకించి లోకోత్తరం బైనతదీయదివ్యతేజోవిలాసంబున కచ్చెరువందును నాయోధనంబున నాయోధుల నెల్ల సమయించి వింటికొప్పునం జేయూఁది యున్న వృషకేతునింజూచి శిరఃకంపంబు సేయుచు యౌవనాశ్వుండు తనమనంబున "సాగరంబు మేఱమీఱినచందంబున నపార చతురంగ బలంబుతో భూనభోంతరంబులుకంపింపఁ జేయుచు నెత్తివచ్చిన నన్ను సడ్డసేయక యనాదరంబుగఁజూచుచు సింహకిశోరంబుకరణి శంకారహితుండై కర్మపాశవినిర్ముక్తుండైన యోగిచందంబున మరణభయంబు లేక యిక్కుమారుం డున్నవాఁడు." అని సంతసంబు రోషంబు నగ్గలింప బలంబునకుఁ జేయి వీచుటయు వానిపయింగడంగువృషకేతనుం జూచి మారుతసుతుండు రోషతామ్రాక్షుండై గదాదండంబు నంకించి కదలుటయుఁ గర్ణకుమారుం డెదురుగాఁబఱతెంచి, "అయ్యా! యీరెండులోకంబులెత్తివచ్చినను మీకు

—:వృషకేతుండు భీముని నిలిచిపోరాడు మనికోరుట:—

నీడు గాదనిన యెడ నీయల్పసైన్యం బేమి లక్ష్యము? నీ పుత్త్రుం డగునన్నుం దయచేసి చూచుచుండుము. నే నీ తృణంబ కార్చిచ్చుచందంబునం బేర్చి [illegible]బులభస్మీకరిం

చెద. తండ్రీ! కాయంబులు బుద్బుదప్రాయంబులు. జవ్వనంబులు చంచలంబులు. బలంబు లస్థిరంబులు. ఇంతయుం గలిగినపుడె త్రైలోక్యవర్తిని యైనకీర్తినార్జింపవలయుం గాని వ్యర్థంబుగా బ్రదుకం జనదు. గజగమనంబు లనియెడిగమనవిలాసంబులును బాణంబు లనియెడి భుజంబులును జక్రంబు లనియెడి స్తనంబులును, శంఖంబు లనియెడి కంఠంబును గలిగిన శత్రుసేనారమణీమణిని మున్నుగా నేను వరించినాఁడ. దానితోడం గ్రీడించి కీర్తి యనియెడు సంతానంబు గాంచెద. మీకుఁ జేర వాపి గాదు. కోడ లయిన సేనావధూటి మిమ్ముం జూచి వ్రాలుపతాక లనియెడివ్యాజంబున మొగంబు వాంచుచున్నయది" అనిన వాయుసూనుండు "కుమారకా! సేనావధూటి నీకుం గైవసంబైన మిగుల లెస్స. అటుగాక నన్నుం దలమీఱునేని దౌదవ్వులనస్మదీయగదాప్రహారంబులఁ జేవ యణంచి శిక్షించెద. మామగారు కోడలిని శిక్షించుట యుచితంబుగదా! యని పలికి, నీవుపాదచారివి వారు రథికులు, నిన్ను నొంటిగఁ బనుపఁజాల ననిన వృషకేతుండు మారుతసూతిం జూచి మీకటాక్షం బనువజ్రాంగిజోడు గలిగియుండ నాకు భయం బేమిటికి? చింతవలదు. నన్నుం బంపుమని భీమునకుం బ్రదక్షిణంబు సేసి యుబ్బునం గబ్బుమీఱిన దేహంబుతోఁ గన్నులం గెంపు దొలంకఁ గాముకుండు కామినిం గదియుచందంబునఁ గెందమ్మి యనియెడు కుంకుమరసంబు నలంది, సింగిణీవిండ్లను కనుబొమ్మ

లల్లాడ్చుచు, మెఱుంగుఁదూపు లనుచూపులఁ దళుక్కొత్తు
చుఁ గరికుంభంబు లనియెడు కఠినస్తనంబుల నొఱపు మిగి
లిన వైరిసేన యనుచానం గదిసి వృషకేతుండు కౌతుకంబు
నెమ్మొగమ్మునం జిగురొత్త మున్ను దనచేతం గూలినచతు
రంగబలంబుల నెత్తురు లనియెడిసలిలపూరంబులచే సాగరం
బు తెఱంగునఁ గన్పట్టుచు రుద్రవిహారస్థానం బగుటం జేసి
కైలాసంబుకరణి నొప్పుచు, విదళితసైంధవం బగుటకతనఁ
బార్థునిప్రతినచందంబునం దోఁచుచు, శంఖచక్రసమన్వితం
బగుటకతన శౌరిహస్తంబులంబోలెఁ జెలువొందుచు, నిజ
నిశితవిశిఖంబులచే శకలితంబు లైన రథగజతురగపదాతి.గా
త్రఖండంబులచేత మిఱ్ఱుపల్లంబు లైనసంగరాంగణంబు
సొచ్చి కార్ముకజ్యారావంబును, ఘోరసింహనాదంబును,
గనకపుంఖచిత్రితంబు లగుకంకపత్రంబు లుల్లసిల్లఁగోదండ
పాండిత్యంబు మెఱయ వింట బాణంబు దొడుగుట తివి
యుట యేయుటయు నెఱుంగ రాకుండ శరపరంపర లను
వర్షంబు వర్షించుచు సమున్నిద్రంబైనరౌద్రరసంబుమూర్తీ
భవించిన చందంబునఁ గనుపట్టి కుంభికుంభస్థలంబులు పెక
లించి ముత్యంబుల జలజల రాల్చుచు నశ్వగాత్రంబులశక
లంబులు వికలంబులు సేయుచుఁ బరాక్రమించుచునుండె.

—: యౌవనాశ్వవృషకేతులయుద్ధము :—

ఇవ్విధంబునం జాపవిద్యానైపుణంబు సూపుచు నున్నవృష
కేతుం గాంచి యౌవనాశ్వుండు దంతావళంబు నెక్కి ధవళ

చ్ఛత్రచామరంబులు మెఱయ దగ్గఱవచ్చి "కుమారకా! ఆదివిష్ణుదేవుండునుం బోలెఁ బ్రకాశించుచున్నవాఁడవు. నీకులంబు గోత్రంబు నామధేయంబు నెయ్యది? నీతండ్రి తాత లెవ్వరు? నీరాకకు నేమి కారణంబు? నీచరిత్రంబు దెలియక యుద్ధము సేయరాదు. కాన నెఱింగింపు" మనిన, వృషకేతుండు, "కశ్యపమహామునీంద్రుఁడు మావంశకర్త, వేదమయుండైన సూర్యుండు మాతాత, త్రైలోక్యవిఖ్యాతదానలక్ష్మీసముదీర్ణుం డైనకర్ణుండు మాతండ్రి, నాపేరు వృషకేతుండు, మాపినతండ్రి ధర్మనందనుం డశ్వమేధంబు సేయం దలంచి నీవశంబున యాగీయాశ్వమున్న దని విని భీమసేనున్ను ఘటోత్కచపుత్త్రుం డగు మేఘవర్ణునిం బనిచె. అమ్మేఘవర్ణుండు తురంగంబు నపహరించె. నేను బలంబులం బొలియించితి. మాయయ్య వేడుక చూచుచు నున్నవాఁడు." అనిన నమ్మహీకాంతుండు సంతసంబు నంది "రాజనందనా! ముహూర్తమాత్రంబు బడలిక దీర్చుకొనుము. చేయలసినవానితోఁ గయ్యము సేయరాదు. నీవు పాదచారివి. నేనే నుంగునెక్కి యున్నవాఁడ నగుట నీతోడఁ గయ్యం బొనర్చుట పాడిగాదు. కనకమయం బైనయరదంబు నొసంగెదఁ గైకొని యుద్ధమునకు ర" మ్మనిన వేవెలుంగులదొరమనుమండు మొగంబునఁ జిఱునగవుదళుకొత్త "నెవ్వానిపట్టణంబునఁ జెట్లు రాళ్లు పసులు సైతె మఖిలార్థంబు లొసంగి యాచకులం బ్రోచు నట్టి యమరవల్లభుం డర్థియై వచ్చి వేఁ

డినఁ గవచకుండలంబు లొసంగె నట్టిదానశూరుం డైన కర్ణునకుం గుమారుండ నైననేను నీవలన నరదంబుఁబుచ్చి కొందునె! నీవాడెడుమాటలు వినిన సంధికి వచ్చినయట్టు లున్నయది కాని సమరంబునకుఁగాఁ దోఁపదు." అనిన నారాజు "నీవు బాలుండవు, మేము చాపవిద్యాప్రవీణుల ము. మున్నుగ నీపరాక్రమంబుఁ జూపుము నీసామర్థ్యంబుఁ జూచి తరువాత మేము యుద్ధము సేసెద"మనిన వృషకే తుండు నవ్వుచు మున్నుగఁ దురంగంబుఁ బట్టితి మని చెప్పిన న్వాని కోపాటోపంబున గృహంబు వెలువడి సకల దళంబులం గూర్చుకొని ప్రతిజ్ఞలు వలుకుచు యుద్ధంబునకై బయలు మెఱసినవారలు తమపరాక్రమంబులు మెఱయింప వలయుం గాని ముందుగ నాప్రతాపంబుఁ జూపితినేని మఱి నన్ను మెచ్చి యుద్ధంబు సేయువా రెవ్వరు? కాలమృత్యు ముఖంబునఁ బడినపిమ్మటఁ గ్రమ్మఱ వచ్చుట యెట్లు? నీవు పుత్రులు పౌత్రులు మిత్రులు బంధువులు సింధురంబులు హయంబులు రథంబులు నధిరోహించి భేరులు బిరుదకాహ ళంబులు మొదలైనవాద్యంబులును మొరయ బిరుదధ్వజం బులు మెఱయ పలువగలకైదువులు సారించుచుఁగయ్యం బునకుం గాలుద్రవ్వుచు మెందుకొని యున్నవారలు. నీవు వృద్ధుండవు, నేను బిన్నప్రాయంబువాఁడ. నన్నొంటి గాఁడని యనవలదు. కమలాక్షుని కృపాకటాక్షంబె నా కక్షయబలంబు. పెక్కుమాట లేమిటికి! తొలుదొలుత నీగు

త్రంబుఁ బట్టి తెచ్చితిమి. నీచతురంగబలంబులో సగముసమయించితిమి. తొలుపోటు మాదె కావున నీవె మార్కొనుమనుటయు నాయౌవనాశ్వుం డలిగి యేనుంగు డిగి రథారూఢుండై గుణంబు మ్రోయించి యిరువదియైదుసాయకంబులు దొడిగి యేయుటయు నక్కుమారుం డొక్క బాణంబున ఖండించి యర్ధచంద్రబాణంబు నిగిడించుటయుఁ గుటిలవర్తులం గూడిన సజ్జనునిగుణంబు సమసినకరణి యౌవనాశ్వుని ధవళచ్ఛత్త్రచామరంబులు తుమురయ్యె. అంతటం బోక మూఁడువాఁడితూపులు వింట సంధించి యొక్క బాణంబునఁ జాపంబును వేఱొక్కశరంబున గుఱ్ఱంబులను నొప్పించి మఱియొక్కమార్గణంబున యౌవనాశ్వువక్షస్స్థలంబు నేయుటయు నదియతనినడిఱొమ్ము వ్రక్కలించుకొని వెన్నున డుస్సి దబ్బఱసాక్ష్యముపలికినవాఁడు ఘోరనరకంబునం గూలు తెఱంగున భూతలంబునం బడియెఁ (మరలఁ దెలివొంది యరదంబెక్కి) యమ్మహీకాంతుండు వేఱొండు కార్ముకంబు కరంబునం బూని సజ్యంబు గావించి గుణస్వనంబున దిక్కులు గ్రక్కదలం జేయుచు నఱువదిబాణంబు లొక్క పిడికిటఁబట్టి వృషకేతుని భుజమధ్యంబునఁ గాటంబుగ నాటించుటయుఁ జిమ్మనగ్రోవులం జిమ్మినచందంబునం గ్రొత్త నెత్తురు లెగసిన నక్కుమారుండు తరుణకిరణమాలికరణిం బ్రకాశించుచుఁ గోలచేఁ గొట్టువడిన బెబ్బులికరణి బిట్టురోఁజుచు నాలుగువాలుతూపుల రథ్యంబులం గీటడంగించి

యొక్కమార్గణంబున సారథిశిరోధిం ద్రుంచి బహుముఖంబులైన శిలీముఖంబుల నజ్జననాథు మునుంగ నేసి పందిరి వెట్టినకరణి శరకదంబకంబుల నంబరంబుఁ గప్పి రవికిరణంబుల మఱుంగుపఱిచి సింహనాదంబు సేసి "భూనాథుండు సొలిసెఁ బొలిసె" నని సైనికులెల్లఁ దల్లడంబంద నాగ్నేయాస్త్రంబు వింటఁ దొడిగి యేయుటయుఁ బొగలు సెగలు మిఱుంగుఱులు మంటలు మింటికి నంటఁ గడంగిన నద్ధారణీరమణుండు వారుణాస్త్రంబున దాని నివారణంబు గావించినఁ బంకజమిత్రపౌత్రుం డంతటం బోక వాయవ్యాస్త్రంబును సంధించిన నమ్మేదినీనాథుండు పర్వతాస్త్రంబుఁ బ్రయోగించుటయు నేనుంగులం బోలిన ఱాలు ఱువ్వుచు వచ్చు నయ్యస్త్రంబు మీఁద వజ్రాస్త్రంబుఁ బ్రయోగించి తత్పాషాణంబులం జూర్ణంబు సేసి హాలహలవిషజ్వాలలం

—: వృషసేనుండు మూర్ఛిల్లుట. :—

గ్రక్కువాలు మెఱుంగుఁదూపు లపారంబుగా నిగిడించిన నమ్మహీనాథుం డొక్కభల్లంబునఁ దన వక్షంబు వెల్లగించిన రవికిరణసంకాశంబైన యొక్కమెఱుఁగుటమ్ము రాజభుజమధ్యంబున నాటించి తాను మూర్ఛిల్లిన భీమసేనుండు రణరంగంబునం బడియున్న కుమారుం గాంచి కనుఁగవ జేవుఱింప నవుడుగఱచి యాలంబున యౌవనాశ్వనృపాలునిఁ బుత్రమిత్రబంధు సేనాసమేతంబుగఁ గాలునిపురంబునకంపక యే యీబాలుని కొదవ దీఱ దనుచు నుద్దండగదాదండంబు

సారించి రెండవదండధరుండునుం బలె భండనంబునకుం గడంగి నితాంతకోపంబునం గొండలంబోని యేనుంగు తుండంబులం గనుపుగొట్టిన నప్పట్టున వెడలు నెత్తురుటేఱులపారంబులై పాఱినం బారవశ్యంబున నవ్వాఱదవెంబడిం బోవు వాహనంబులు నానెత్తురుటేటి యుభయతీరంబులందును జొత్తుపాపలుంబలె నెమ్ములతిత్తులై పడిన రాహుత్తులును బ్రవాహవేగంబునం దలక్రిందుగా దుల్లిన రథంబులును రథంబులచెంగట యమపురంబునకుం బథికులైనరథికులును కాలుం గాలుం బెనంచికొని తేలి యాడు కాల్బలంబును గలిగి యాలంబును త్రిజగద్భీలం బయ్యె నప్పుడు భీముని యూరువేగంబునం బొడమినచండమారుతంబులు బిసబిస విసరినం జతురంగబలంబు బొందెతో స్వర్గమునకుం బోవుకై వడిసూర్యమండల పర్యంతంబు నెగసి యందుండికాలుం గేలుం గీలువీడి పడునట్లుగ విష్ణుద్రోహులు నరకంబునం గూలుకై వడి భూతలంబునంబడియె. మఱియు నవ్వడముడి మోంకాలివేగంబునం బిక్కలవలనంబుట్టిన ఝంఝూమారుతంబు విసరినం బెల్లగిల్లిన దంతంబులు భగ్నంబులైనకుంభస్థలంబులు విఱిగినచరణంబులుం గలిగి పీనుంగులైన యేనుంగులును దునిసిన గళంబులు చెగిన ప్రేవులుం జెక్కలైనడొక్కలుంగలిగి చాంపకట్టుగాంబడిన తురంగంబులును జక్కులైన చక్రంబులును నుగ్గునూచము లైననొగలును విఱిగిన కేతనంబులును విటతాటంబు లైన యవయవంబు

లునుం గలిగి శకలంబులైన యరదంబులును సడుగులువీడి కత్తులం బడి వెడరూపంబులంబడిన వీరభటులునుం గలిగి సంగరాంగణంబు ఘోరంబయ్యె.

—: సువేగభీమసేనుల గదాయుద్ధము. :—

అప్పుడు యౌవనాశ్వకుమారుం డగుసువేగుండురథ ముడిగ్గి మహోగ్రగదాదండంబు సారించుచు భీమునిం డాసి వాసి మెఱయ శిరంబు నురంబుం బ్రక్కలుం జెక్కులునొప్పించి యల్లటంబోక నుడిగాలితీరునం బేరెంబులు వాఱి యతనిగదాప్రహారంబుల మైమెలంకువచేం దప్పించుకొని యుప్పరంబున కెగసియు దిక్కులరికట్టియు విచిత్రవిహారంబులు సలిపిన నవ్వడముడి గడపొదలికలు మెఱయం గుడి యెడమలం జడియుచు నొడలు దగులం గొట్టుచు మండల ప్రచారంబుల గోమూత్రికాబంధంబుల సంచరించుచుం గోలాట లాడుచందంబునం గీలుబొమ్మలు నటించువైఖరి నానావిధంబులైన విన్నాణంబులం బ్రాణాలు మెఱయించుచు గద లమర్చుకొని గగనము గదల నార్చుచు నొకరొకరిని మెదలనీయక పొదలికలుం గదలికలు మెరయం బెద్దయుం బ్రొద్దు గదాయుద్ధంబు సేసియుం గసిదీఱక గదలు దిగువ వైచి యాత్రైలోక్యమల్లులు మల్లయుద్ధంబునకుం జొచ్చి పాయుచున్ డాయుచుం జుట్టుకొనుచు వదనవక్షో బాహు దేశంబులం దగులం బొడుచుచు "మేలు మేలు మా యన్న హేయిరే!" యని మెచ్చుచు బాహాబాహి గచాక

చిం దొడరి ప్రాబల్యదౌర్బల్యంబులు లేక తుల్యంబుగా మెలంగిరి. అప్పుడు భీమసేనుండు సువేగునిం జొచ్చి పడ వైచి చరణంబు లొడిసి పట్టి బిఱబిఱం ద్రిప్పి వేసిన భూత లంబు సోఁకి సోఁకకమున్న బంతిచందంబున నెగసి వాయు తనూభవు నట్ల చొచ్చి పట్టి వ్రేసిన నవ్వడముడియు భూత లంబునం బడక నెగసి దట్టంబు లై పడియున్న ఘోటక గజకళేబరధట్టంబుల వైచిన నవ్వీరుండు ముంజేత నొడ్డుచు దండెవెట్టి కఠోరముష్టిఘాతంబుల నొప్పించిన సమీర కుమారుండు వానిపెట్టుతప్పించి కర్ణకంఠగండప్రదేశంబులం బిడుగులంబోని పిడికిళ్ళం బొడిచిన వాఁడునుం బొలివోవని బంటుతనంబున నొడ్డుకొని యఱచేతిపెట్టులఁ బెడచేతి దెబ్బల ముష్టిప్రహారంబుల జానుఘాతంబుల నొప్పించిన నాజగజెట్టు లొండొరులపెట్లవలన మూర్ఛల మునింగి పు డమిం బడిరి.

అంత వృషకేతనుండు కొంతవడికిం దెప్పిరి వదలిన కేశపాశంబు బిగియించి యెప్పటియట్ల కిరీటంబు ఘటి యించి నుదుటిపయిం గనుపట్టు చెమటబిందువులు చేలాంచ లంబున నార్చుకొని బలువిల్లు పిడికిటం బదిలంబుగాఁ బట్టి యెదుట నున్నవిరోధి నీక్షించిఱెక్కలతోడి పెనుఁబాముల చందంబునఁ గుంటనంపుఁబింజల రంజిల్లు నైదుబాణంబు లొకపిడికిట నాకర్ణాంతంబుగాఁ దిగిచి యయిదుప్రాణం బులం గొనుతెఱంగున నమ్మండలేంద్రుని వక్షస్థలంబుఁ

దూఱనేసిన నతండు నెత్తురు గ్రక్కుచు మూర్ఛ మునింగి మరణంబు నొందినకరణి మేను మఱచి నిశ్చేష్టితుండై రథంబుమీఁద జొరగిలం బడుటయు వృషకేతుండు కరుణాకలితమానసుండై 'యక్కటా! క్షత్త్రధర్మం బింత క్రూరం బగునే' యని గర్హించుచు నతనిరథంబుమీఁది కరిగి గాయంబులం దొరఁగు నెత్తురు కేలం దుడుచుచు వృద్ధుండైన యమ్మహీధవుని శిరంబునకు దాపుగాఁ దనయూరు కాండంబు నునిచి తనువున నాటియున్న బాణంబులు తివిచి వైచి యుత్తరీయంబున గాయంబులొత్తి యొత్తి తనబంగరు దట్టి ముంగొంగుచే నెమ్మొగంబున విసరి యుచ్ఛ్వాస నిశ్వాసంబులును హృదయంబునుం బట్టి చూచి శ్రీహరీ! నిర్వ్యాజకృపాలహరీ! ప్రత్యహంబును నీపాదారవిందంబులే భజియింపుచు దేవతాంతరంబు నెఱుంగ కుండితి నేని సుకృతశాలియుఁ బరాక్రమవిజితశూలియు సుగుణహారుండును మహాశూరుండును నైనయీరాజేంద్రుండు బ్రతుకుం గాక! యని శ్రీకృష్ణచరణారవిందయుగళంబు మనంబునం దలంచి తలంచి యగ్గాయంబు లభిమంత్రించిన నెత్తురు లణంగి ప్రాణంబులు కుదురుపడి యుచ్ఛ్వాసనిశ్వాసంబులు యథాపూర్వంబుగా నిగుడ ఱెప్పలల్లార్చి లోచనంబులు విచ్చి కర్ణసుతుని మొగంబు సూచి లేచి కూర్చుండుటయు వృషకేతుండు చివ్వననతనిరథంబు డిగ్గ నుఱికి తొంటి దిక్కునకు వచ్చి విల్లు గైకొని గుణధ్వని గావించిన యావ

నాశ్వమహీశ్వరుం డక్కుమారుని శౌర్య ధైర్యంబులుఁ గరు ణాపరత్వంబునుం గాంచి సంతోషభరితమానసుండై శరశ రాసనంబులు వైచి రథంబు దిగివచ్చి కౌఁగిలించుకొని కర్ణ నందనా! నందనందనుండు నరవిందసంభవుండు నిందుశేఖ రుండును సాక్షిగా నన్ను రక్షించితివి. ప్రాణదానంబు సేసిన నీతోడ సమరంబునకుం గడంగితినేనినాకంటె వెఱ్ఱియెవ్వఁ డున్నాఁడు! మీతండ్రి యయినకర్ణుండు నిఖిలదానంబులు సేసెఁ గాని పోయినప్రాణంబులం దెచ్చి యిచ్చినవాఁడు కాఁడు. జయలక్ష్మీవల్లభుండ వైననీకు నాసామ్రాజ్యభా గంబు లన్నియు నర్పించి కమలపత్రాక్షుండును గౌస్తుభ వనమాలికాకలితవక్షుండునుయాదవకులోత్తంసుండునువేద శాస్త్ర కృతప్రశంసుండును నైనకంసారిం గొలుచుచు సం సారబంధంబుల నిరసించెద నని పలుకుచు నాతనిస ఖ్యంబు సేసికొని సువేగుండును భీమసేనుండునున్నచోటికి వచ్చి వృషకేతనుండు తన్ను రక్షించిన చందంబువారలతో వివరించి "యనిలనందనా! యీశిరంబు మీరిచ్చిన యది. ఈక్రతుహయంబువెంట నన్నుం బనుపుము. నేనె దిక్పా లరాజుల నెల్ల జయించి ధర్మజు సముఖంబునకు వచ్చెద, అదియుంగాక యైరావతకులసంభవంబు లైన పదివేలవే నుంగులు ధర్మజునకు నర్పించెద. దయాసముద్రుండు ననం తకల్యాణగుణసముద్రుండును బురుషోత్తముండునైన య దూత్తముని చరణారవిందంబుల నత్తమిల్లి పుత్త్రమిత్త్రకళత్త్రాది

బంధుసమేతంబుగా నాసర్వస్వంబు సమర్పణంబొనరించెద విశేషించి యును ప్రాణప్రదానంబు సేసినవారితోడి యుద్ధం బసంబద్ధంబు గావున మీకు నేను మాన్యుండను." అనియెడి రాజన్యుని సౌజన్యవాక్యంబులకుం బరితోషంబు నొందిన పవననందనుసమీపంబునకు మేఘవర్ణుండును సవనహయంబునుం గొనివచ్చె.

—:యౌవనాశ్వుఁడు భీమాదులతో భద్రావతి కేగుట :—

తదనంతరంబ చిత్రవర్ణంబులును రత్నపరిస్తీర్ణంబులు నైనమెత్తలు ఘణంఘణితదిగంతరాళంబు లైన కాంచనఘంటికాజాలంబులును శరచ్చంద్రచంద్రికాడంబరంబు లైన కర్ణచామరంబులును జారసుందరీమందగమనసమానంబు లైన గంభీరయానంబులును గ్రమ్ముతుమ్మెదలకు సమ్మోదప్రదంబు లైన యష్టమదంబులును వజ్రవలయప్రభాధవళితదిగంతంబు లైనదంతంబులును గైరికాదిధాతురసకల్పిత చిత్రతిలకంబు లైనగంధఫలకంబులునుం గలిగి ధవళవర్ణబంధురంబు లైన గంధసింధురంబుల మావంతులు బంతులుగాఁ దెచ్చి నిలిపిన యౌవనాశ్వపృథివీశ్వరుండు భీముండు దాను నొక్కొక్క వేదండంబును, రెండుశుండాలంబుల మార్తాండపౌత్రుం డును ఘటోత్కచపుత్రుండు గానెక్కి తెక్క[illegible] [illegible]ని సేనలు క్రిక్కిఱిసి నలుదిక్కులం గొలువ వందిమా[illegible]నంబులు బిరుదావళులు వంశావళులుం జదువ భేరులు [illegible]ములు ఢక్కలు హుడుక్కలు దమ్మటలు గుమ్మెటలు [illegible]బులు

నరగజంబులు కాహళంబులు జయదోహలంబు లైనశం ఖంబులు నసంఖ్యంబులుగా మొరయఁ గదళీకాస్తంభం బులు పోఁకమ్రాఁకులు చూతపల్లవసముల్లసితతోరణంబులు కాలాగురుసాంబ్రాణికాధూపంబులు మొదలైన యలంకా రంబులం బొలుపారు గోపురద్వారంబు సొచ్చి యచ్చటఁ బచ్చవిలుకాని తేజీకూనలంబోని చానల వలకారిచూపు లనియెడువలలం దగిలి యిట్టట్టు గదలనేరక జిట్టలచందం బునఁ జిట్టకంబులం బొదలు చిట్టివిటులచేతిహారువులైననెఱి తెరువులును మొత్తంబులైన ముత్తియంబులుసొంపులైనకెం పులు పచ్చికలం దచ్చన గాడుపచ్చలు నిగరాల మగఱా లును జగడంబు లైనపగడంబులును ముంగిళ్ల నత్తమిల్లిన యంగళ్లనునిచిన మంగళద్రవ్యంబులును నంతరిక్షంబునఁ గాంతులు వింతలు పొంతలుగ సంచరించువైజయంతికలును భూసురాశీర్వాదపురస్సరంబుగా సువాసినీజనంబులుసల్లు తెల్లనిపూవుల నక్షతలం దేజరిల్లు రాజమార్గంబునంజని నవ రత్నరచితం బైనహజారంబు సేరంబోయి మదదంతావళం బుఁను డిగ్గి హితులుఁ బురోహితుల మంత్రుల సామంతుల నండ్ల కనిచి యౌవనాశ్వవిశ్వంభరాధీశ్వరుండు భీమ వృష కేతు మేఘవర్ణులతోడంగూడ నంతిపురంబునకుంజని కూట కమయలగాక కొలువుకూటంబున సింహాసనంబునందుసుఖా సీనుడై [illegible]. అప్పుడు యౌవనాశ్వునిభార్యయైనప్ర భావతి [illegible]నులుఁ దానును బంగరుమెఱుంగుంబళ్లెరంబున

ము త్తియంబులుఁ బగడంబులుఁ గూర్చిన రంగవల్లికలు రం గమరఁ గర్పూరదీపంబులు వెలుంగఁ జెలంగుచుం జను దెంచి "సంగరంబునఁ దనదుమంగళసూత్రంబు సంగతిగ నిలిపినసదయునకు జయమంగళం శుభమంగళ" మ్మనెడు పాటలు పాడుచుఁ గర్ణకుమారుని కీర్తి లోకవిఖ్యాతం బగుం గాక యని దీవించి వారలకు నివాళి దీసి యప్పరమసాధ్వి యంతిపురంబునకుం జనియె.

తరువాత వరుణకాంతలు జలకంబు లాడుచు సన్నె కంటిమీఁద నునిచిన పసుపుముద్ద చందంబున నరవింద మిత్రుం డపగిరిశిఖరంబు నలంకరింపఁ గాటుకపోడి చల్లిన తెఱంగునఁ జీఁకటులు నలుగడల నల్లుకొనియె. క్రేపులఁ దలంచి మందలనున్న యావులు తిరుగంబడియె. పక్షులు గూండ్లకుం బంతులుగట్టె. కమలవనంబులు సొగసె. కలు వలు విరిసె. అవ్వేళ గబ్బిగుబ్బెతలు తెచ్చినబంగరుకుం డల సలిలంబుల సంధ్యావందనాదికృత్యంబులు నిర్వర్తించి యానవాశ్వుఁడు భీమసేన వృషకేతు మేఘవర్ణులును దక్కుంగల బాంధవులును బంతిగూర్చుంకి బంగరుపళ్లెరం బులు పటికపుఁగోరలు మగఱాలగిన్నెలు కుందనపుగిండ్లు నునిచి చలువపరకాళకుచ్చెళ్ల పెళపెళలు మగఱాలకమ్మల ధళధళలు మొలనూలిచిఱుగంటలఘుణంఘుణలు కంకణం బుల ఝణంఝణలు కిలందియల ఝళంఝళలు మట్టియల గిలుకుగిలుకులం గులుకులు మెఱయఁ గోమరుఁబ్రాయంపు

బడంతులు చతుర్విధాన్నంబులు నింపుతో వడ్డింప రుచుల నుతియింపుచు భోజనంబు గావించి గంధోదకంబులఁ గర పదప్రక్షాళనంబు చేసి గంధపాళ్లం జేతులార్చ్చకొని యూ డిగంబులు కపురంపువీడియంబు లందీయఁ గొలువునంగూ ర్చుండి పవననందనుని కోపప్రసాదంబులు వృష కేతనువిక్ర మంబును మేఘవర్ణు నేర్పును వినుతించి ధర్మనందనవసుదేవ నందనుల సందర్శనంబు సేయఁ గలిగెఁ గదా యని తన పూర్వపుణ్యపరిపాకంబునకు మెచ్చుచుఁ బట్టణంబునఁ జా టంబనిచి యగసాలె పట్టుసాలె కుమ్మరి కమ్మరి చిత్రకార కలాదప్రముఖులు రజకక్షౌరకశిల్పాచార్యప్రభృతులునైన పదునెనిమిదిజాతులవారిం బయనము సేసి తనయొద్ద నున్న మన్నీల వజీరుల రాజులం జూచి మీమీయంతిపురంపుటిం తులతో దంతిపురంబునకుం జనుండు. కుంతీ ద్రౌపదీప్రము ఖకాంతాజనంబులం గనుంగొని ముకుందచరణారవిందంబు లకు మ్రొక్కి గంగాతరంగిణిలో నశ్వమేధావభృథస్నానం బులు సేసి పావనమూర్తులరై వత్తురుగాక యని యాజ్ఞా పించి సుతుం డగునువేగునిం జూచి నీవు సకలదళంబులఁ దోడ్కొని మున్నుగా హస్తినాపురంబునకు నీజనని యగు

## —: ప్రభావతి మాహాత్మ్యము. :—

ప్రభావతితోడంగూడ నీపల్లకుల మున్నిడుకొని పొమ్మని యాజ్ఞాపించిన నతఁ డంతిపురంబునకుం జని తల్లికి మ్రొక్కి "అమ్మా! ధర్మనందనుని యాగంబుఁ గనుఁగొనుటకుఁ గరినగ

రంబునకుం బోవలెఁ బయనంబు గమ్మనవుడు నవ్వనిత కోపించి "పుత్రకా! నీకేమిటికి వెఱ్ఱిపట్టె. ఈధనంబులు నీధాన్యంబులు నీరూకలు నీకోకలు నీయిండ్లు మొదలగు సంపదలు వీటిఁబుచ్చి నన్నెందులకు వెడలి రమ్మనియెదు, మదిమదినుండి రాజ్యంబు విడిచి పోవుటకు నీకేల బుద్ధి పుట్టె? పురజనులు మీరలు నెచ్చటి కేనియుం బొండు నీ వేమి చెప్పిన నే నచ్చటికి రాను. నే నెచ్చటికిని రాను. నే వచ్చుదానం గాను." అనిన సువేగుఁ డమ్మా! యింతమూఢత్వంబు నింతసంసారభ్రాంతియు నీ కేల వచ్చె? ధర్మజుని యశ్వమేధంబున వేదవ్యాసప్రముఖు లైనమహామునులును నింద్రాదిదేవతలును దేవదేవుం డైన వాసుదేవుండును రుక్మిణీసత్యభామాప్రముఖ లైనయద్దేవుని పట్టమహిషులును జనుదెంతురు. వారల సందర్శనంబువల నఁ బంచమహాపాతకంబులు బంచబంగాళంబు లై పాఱిపో వుంగావున మఱుమాట లాడక లేచి రమ్మనిన "నోరి మాతాతతరంబున మాతండ్రితరంబున నాతరంబున నణు మాత్రంబేని పుణ్యంబు సేసి యెఱుంగము. ఈముదుసలి వయసున నీతోడుసులు నాకు వలదు. ధర్మనందన వసుదేవ నందనులను దర్శింపకున్న నాకు గోరంత కొఱంత లేదు. ధర్మజునకు యాగంబుమీఁదవిశ్వాసంబు శౌరికిధర్మరక్షణం బునఁ బ్రేమ నాకు సంసారంబుమీఁద భ్రాంతి. ఇది యెవ్వ రికిం దప్పింప శక్యంబుగాదు. వే యేటికి? నేను యాగం బునకు వచ్చుదానం గాను. వలయునేని మీరు సనుండు".

అనిన సువేగుఁడు యౌవనాశ్వ భీమసేనులకు నాయమ్మ పల్కులు పల్కరించి కొంతతడవు నవ్వించి యంతటం బరిచారికాజనంబులచే నయ్యంబం బట్టి తెప్పించి మొట్టో యని కూఁతలువెట్టుచు నీడిగిలం బడ నెట్టకేలకుం దిగిచి యందలంబుపై నిడికొని కరిపురంబునకుం* బయనమయ్యె. పల్లకులందలంబులు భద్రగజంబులు కొలారుబండ్లు గుఱ్ఱపు మోటులు వేసడములు మహోష్ట్రములు మొదలైనవాహనంబు లెక్కి పురంబులోనం గలుగు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదిపౌరజనంబులు రాజుకంటె నయిదుదినంబులుమున్నుగా హస్తిపురంబునకుం జనిరి. కరితురగస్యందనంబులు వీరభటసమూహంబు లిరువంకలఁ గొలువఁ జలువలువెదచల్లువెల్లగొడుగులనీడ యువనాశ్వవృషధశ్వేతనూజులును గుఱ్ఱముతో వృషకేతు మేఘవర్ణులును గతిపయప్రయాణంబుల హస్తినాపురంబునకుఁ జేరవచ్చుచుండ నిరువదియామడదూరంబున నిలిచి *భీముఁడు యౌవనాశ్వుం గాంచి "కాంచనాహ్యరథై ర్యా; మీరువిజయంబు నేయువిధంబు మున్నుగా మాయన్నతో నెఱింగించి యెదురుగఁ దోడితెచ్చెద. వృషకేతుండు మిమ్ముం గొలిచి వచ్చు" నని పలికి శీఘ్రంబుగఁ గరిపురంబునకుం జని యందు నవరత్నఖచితంబైన సభామందిరంబున బంగరు సింగంపు మోము గద్దె

---

* మాతృకలోఁ దాఱుమాఱుగానున్న యీవాక్యములిం దర్థసందర్భోచితముగా సవరింపఁబడినవి.

యందుఁ దమ్ములు గొలువ రెండవయాఖండలుం డన
నిండోలగం బైనయగ్రజుం గాంచి స వి న యంబుగా సా
ష్టాంగనమస్కారము గావించిన నతండు దీవించి దిగ్గనలేచి
కౌఁగిటంజేర్చుడు నర్జునుండును మాద్రీనందనులును దనకు
వందనములు సేసిన వారల నభినందించె. అంతఁ గొంతే
యాగ్రజుండు 'సమీరకుమారకా! సేమమే' యని యడి
గినఁ గరకమలంబులు ఫాలతలంబునం గీలించి రాజోత్త
మా! యుత్తమం బైననీకరుణ గలిగి యుండ సేమంబు
నకుఁ గొఱంత యేమి! భద్రావతీశ్వరుం డగుయావనా
శ్వుం డశ్వమేధాశ్వంబుం గొని వచ్చె. విశ్వంబున నీకీర్తి
శాశ్వతంబుగా వర్తించు. అతనిసతి ప్రభావతి సఖీసహస్రం
బుతోఁ బాంచాలిని గనుఁగొన వచ్చుచున్నయది. వృష
కేతుండు భండనమున నప్పుడమితేని మెప్పించె. మేఘ
వర్ణుండు సావహేళంబుగా నధ్వరాశ్వంబుఁ బట్టికొని వచ్చె
ననిన ధర్మనందనుం డానందకందళితాంతరంగుఁడై మనవిజ
యంబు యాజ్ఞసేనికి నెఱిఁగించి రమ్మనిన నతండు నంతి
పురంబునకుఁ జనినఁ గనకపీఠంబునం గమలకర్ణికాసీన
యగు కమలాదేవికరణిం గూర్చున్న ద్రౌపది దిగ్గన
గద్దియ డిగ్గి యెదురు వచ్చి వాయుతనూభవుం గనక
పీఠంబున నునిచి విజయంబు గలుగ విజయంచేసితి రే?
కర్ణనందనుండును నామనుమఁడు మేఘవర్ణుఁడును సేమంబున
నున్నవారే? యని యడుగుచు నతని కడిందిఱొమ్మునఁ

గనుపట్టు వెడందగాయంబులు కరకమలంబున నిముడుచుఁ
గుశలప్రశ్నంబు సేసిన "భద్రేభయానా! భద్రావతీశ్వరు
రాణి యగు ప్రభావతీమంజువాణి వేవురు చెలులతోడం గూడ
నిన్నుఁ జూడవచ్చుచున్నయది. కావున నీవు నలంకరించు
కొని యమ్మించుఁబోఁడికి నెదురుగ రమ్ము. మనకు రక్షకుఁడుఁ
డైనపుండరీకాక్షుండు ద్వారకానగరంబునకు నరిగెనో యి
చ్చట నున్నవాఁడో" యని యడిగినఁ గృష్ణ యిట్లనియె.
ఆశ్రీకృష్ణుండు నల్లదె నీలంపుటుప్పరిగలో నున్నవాఁడనిన
సంతోషభరితాంతరంగుఁడై నీమందిరంబున నిందిరా
కాంతుం డున్నవాఁడు గావున నీవు ధన్యవు. తామసించక
శృంగారంబు సేసికొని యంగనాజనులు నీవునుం బ్రభావతికి
నెదురుగా రండని పలికి యనిలనందనుండు చనినఁ బాం
చాలియుఁ బన్నీట జలకంబులాడి వెన్నెల నిరసించు సన్న
హొన్నంచువలువపరిధానంబుగాఁ గట్టి నెత్తిగురుల విరులు
దుఱిమి సిస్తుగాఁ గస్తూరిరేఖ ఫాలతలంబునం దీర్చి తార
హారంబులు హీరకంకణంబులును జారుకాంచీమంజీరంబులు
మొదలగుసొమ్ములు ధరించి యలంకృత లైనసఖీసహస్రంబు
లతోఁగూడ జీవరత్నంపు గుంపుల నుల్లసిల్లుపల్లకిపై నెక్కి
హల్లకపాణులు వింజామరంబులు వీవ నంతఃపురసంచారు
లగుకంచుకులు సందడి యెడగలుగం జడియ వెడలునప్పుడు
యుధిష్ఠిరుండును నచ్యుతుండును శృంగారితంబు లైనయే
నుఁగులపై నెక్కి శంఖకాహళదుందుభిమృదంగపటహాము

రజఝల్లరీజర్ఝరీడిండిమప్రముఖవాద్యంబులు భూనభోంతరమున బోరుకలంగ మ్రోయ నెదురు వచ్చిన యౌవనాశ్వుం డధ్వరాశ్వంబు గానుకగా నునిచి దండప్రణామంబు సేసినం బాండవాగ్రజుం డేనుంగు డిగ్గి యానృపాలునిం గౌఁగిటం బొదివి నరవరేణ్యా! భీమార్జునసకలసహదేవులట్లు నీవును నాకు నొక్కసహోదరుండవు. ద్రౌపదితోఁ గూడఁ బ్రభావతి నంతిపురంబునకుఁ బంపు మనుటయు నంతడు నట్లుకావించె.

తదనంతరంబ యౌవనాశ్వమహీశ్వరుండు గోవిందుని పదారవిదంబులు తనశిరంబున సోఁకం బ్రణమిల్లి "ముకుందా! నందనందనా! అరవిందనయనా! ఇంద్రాదివందితా! భవదీయపాదారవిందంబులు దర్శింపఁ గంటిఁ గావున నా జీవనంబు సఫలంబు. భవదీయభక్తులైనభీమవృషకేతుమేఘవర్ణులు మెట్టిరి గావున మాపురంబు సిరులకుం గాఁపురంబు. ధర్మజుని జన్మంబున కొదవెం గావున నీతురంగమంబును జనహృదయంగమంబు. ఇన్నిటికి శేఖరంబుగ నీకు జోడుకోడైన యర్జునిం జూడఁ గలిగె" నని పలుకునవసరంబున సవ్యసాచి యవ్విశ్వంభరాధీశ్వరుఁ బరిరంభణం బొనర్చి "నీవు నాకుధర్మనందనునట్ల పూజ్యుండవు. నాచేసిన పురాకృతపుణ్యంబున నీసందర్శనము గలిగె" నని కొనియాడె. అప్పుడు పాంచాలికిఁ గుంతిదేవికిఁ బ్రభావతి చాఁగిలి మ్రొక్కిన వారలక్కోమలి నక్కునం గదియించి మిక్కిలి

గారవించిరి. అంత భద్రావతీశ్వరపుత్త్రుం డైన సువేగుండు ధర్మజప్రముఖులకు వందనంబు సేసి “కర్ణనందనునికతంబున శ్రీవాసుదేవచరణారవిందంబులు సేవింపం గలిగె. మాభాగ్యంబు నెంతని వినుతింతుము. ఇంక సర్వకాలంబులందును నద్దేవుని చరణకమలంబులు స్మరియింపుచు నుండఁగలవారము. శ్రీకృష్ణునకు నర్పితంబు గాని రాజ్యంబు ధనంబును వ్యర్థంబులు. మఖతురంగంబు వెంట నన్నుఁ బనుపుము. ఎదిరించు మేదినీపతుల నెల్లఁ జెల్లాచెదరుగాఁ బాఱంద్రోలి నేన యశ్వంబు రక్షించుకొని వచ్చెద” నని పలికిన సువేగునిఁ గౌఁగిటం జేర్చి శ్రీహరి కరుణాకటాక్షంబులవీక్షించె. వృషకేతుండును నందనందనపురందరనందనులకు వందనంబు గావించిన నంతయుం బ్రమోదకందళితమానసులై కరిపురంబునకుం జనుదెంచిరి. అంత రుక్మిణీకాంతుండు దంతిపురంబున నొక్క నెల వసియించి ధర్మతనయునింజూచి యిందునకుఁ బదునొకండవనెల చైత్రశుద్ధపౌర్ణమాసినాఁడు జన్నంబొనర్చుట ముఖ్యంబు గావున నిప్పుడుగ్రసేనభూపాలకునిచే సంరక్షితంబైన ద్వారకాపురంబునకుం జనియెద. యౌవనాశ్వ, నర్జున, భీమునిం దక్కిన యోధులను దురగంబుఁ గావం బంపవలయు. నీవు ద్రౌపదీసమేతంబుగా యాగదీక్షఁ గైకొని సావధానమ్ముగా నుండందగినయది. యాగదీక్షాకాలంబున మమ్ముం బిలిపించిన నేని బంధుమిత్రసమేతంబుగా వచ్చెద' నని పలికిన గోవిందునికందువయె

జెంగి కుంతీనందనుండు బహువిధము లగు బహుమాన ములు గావించి వీడ్కొలిపిన సంపత్పారంపరీనిర్జితాలకా పురం బైనద్వారకాపురంబునకు వనజాక్షుండు విజయంబు సేసె.

—: వ్యాసుఁడు మరలవచ్చుట. :—

తదనంతరంబ కృష్ణద్వైపాయనమహామునీంద్రుండు సన్నిహితుం డగుటయు ధర్మతనయుండు వినయంబునవంద నంబు సేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి నవరత్నపీఠ మున నునిచి కృతాంజలియై మహాత్మా! మున్ను మరుత్తుం డనుమహారాజు యాగం బెవ్విధమునం జేసె? నానతి యొ సంగవలయు ననిన వ్యాసమునీంద్రుండు నరేంద్రునిం జూచి, "తొల్లి హరిధ్యానసమాయత్తచిత్తుండై నమరుత్తుం డశ్వమేధం బొనర్పం గోరి బృహస్పతి నాచార్యునిఁగా వరించిన నింద్రుం డసూయచే నతనిం బోవల దని నివా రింప నతనితమ్ముం డైన సంవర్తుని గురువుగా వరియించియా గంబొనర్చునపు డింద్రాగ్నులు విఘ్నము సేయందలంచిన వారల నిరాకరించి యాగంబు నెఱవేర్చి యామరుత్తునకు వరంబులొసంగి సంవర్తుండు యథేచ్ఛంబుగాఁ జనియె. అన్న రేంద్రుండు సర్వభూతనివాసుండైన శ్రీనివాసదేవునిసాయు జ్యంబు వడసె" ననిన విని ధర్మతనయుం "డేధర్మమువలన నరుండుభవబంధంబులం దరించు నాధర్మం బానతీయవలయు ననుటయు సాత్యవతేయుండు, కౌంతేయునిం గాంచి "వేద

శాస్త్రంబులు సదివి తదర్థంబుల నెఱింగి తాను నాచరించిన బ్రాహ్మణుండును, నయమార్గంబున భూమండలింబరిపాలించినక్షత్రియుండును, వంచనలేక క్రయవిక్రయాదులుగావించినవైశ్యుండును, శ్రీమన్నారాయణస్మరణయుబ్రాహ్మణపూజయుం గావించిన శూద్రుండును నైహికాముష్మికంబుల సుఖంబుం గాంతురు. ఇంక స్త్రీజనుల లక్షణంబునువినుము. చక్కనిపురుషునిం గన్నఁ గూడఁ జనుటయు బిత్తరంపుఁ జూపున జెప్పలల్లార్చుటయు, సంకేతంబుగ మాటలాడుటయుఁ, జెలికత్తెం బిలుచువిధంబున నుచ్చైస్స్వనమునంగూయుటయుఁ, బలుమాఱు నవ్వుటయుఁ, బొరుగిరుగులకుఁ బోవుటయు, మేర మీఱి పలుకుటయు సారెసారెకుంబైఁట జార్చుటయు మిగుల సిగ్గరికత్తెయుం బలె మెలఁగుటయుఁ బరపురుషులచంక నున్నపసిబిడ్డల ముద్దాడుటయు, గోడ నెక్కిచూచుటయు, గొప్పు దిద్దుకొనుటయు, సత్తమామలకు మగలకు మాఱుమలయుటయు నివి మొదలగు వికారంబులు జారకాంతాలక్షణంబులు. మఱియుఁ బువ్వులమ్ము పువ్వుఁబోఁడితోడ, దాసీజనులతోడ, సైరంధ్రులతోడ, దాదులతోడ, మగలు విడిచిన సతులతోడ, మంత్రసానులతోడ, దూతికలతోడ, జోగురాలితోడ, నాకులమ్మెడియుంగనతోడ వితంతువుతోడం గూడి చెలిమిచేయుదానిరగులటయని యెఱుంగవలయు.-ఈచెప్పినదుష్టసతులలో దూతియు దాదియు నను నిరువురు జారిణికి సాహసమునద్రించు.

గడవం దెప్పలు. కావున మానధను లగుపురుషులు చానల కిం జనవీయంజనదు. జననంబు మొదలుమరణపర్యంతంబు వాండ్ల నమ్మంగూడదు; గావున, నత్తయు మామయు మగండును గత్తులబోనులవలె మత్తకాశినులం గదలమెదలకుండం గాపాడందగు. కామరుం బ్రాయంపుటింతులచిత్తము సదాపర పురుషభోగాయత్తంబై యుండు నని యెఱుంగుము. విధ వయగు వెలంది యుపవాసంబులచే మేను గృశింపఁజేయక పాలు పెరుఁగు ఘృతంబు మొద లగురసద్రవ్యంబులచే దేహంబుఁ బోషించుచు మలినవస్త్రంబులు గట్టక మడుంగు లుగట్టుకొని మైపూఁతలు బెట్టుకొని దానధర్మంబులు సేయక వడ్డికిచ్చి కూడఁబెట్టుచు తల్లిదండ్రులక్రింద నడంగక పొరు గిరుగిండ్లం దిరుగుచు హరిస్మరణంబు లేక దుర్భాషణం గూయుచు నుండెనేని పనిమిటితోడంగూడ దానునుగల్పాం తరంబులు నరకకూపంబునంగూలు. నాలుక యుం దాలువులు నధరంబులు నీలవర్ణంబులై యెవ్వతెకుండు నేతరుణిపాద ములు నేలమోవక యుండు నత్తరుణిశీఘ్రంబుగ వైధవ్యంబు వహించు. విధవాసంగమంబు చేసినయధముండు దాను జేసిన పుణ్యంబులెల్లఁగోల్పడి నరకంబునం బడు. బాల్యం బునఁ దల్లిదండ్రుల మఱుంగునఁ, బ్రాయంబున మగని యొద్ద వార్ధకమునఁ దనయునికడ నుండవలయుం గాని స్త్రీలకు స్వాతంత్ర్యం బెన్నటికిం జెల్లదు. ఇది నీయడిగిన ప్రశ్నంబునకు నుత్తరంబు. నీవు జూదరుల నాస్తికుల నసూ

యాపరులఁ గొండెంబు పలుకువారలం జెంతం జేర్పక ప్రజలం బాలింపుము. పోషింపఁబడిన జనులచేత ధనంబును ధనంబుచే ధర్మంబును ధర్మంబునఁ గీర్తియుఁ జేకుఱుఁ గావున రాజులకుం బ్రజాపరిపాలనం బవశ్యంబును జేయవలయు. తనకీర్తి మర్త్యులకుఁ గీర్తనీయంబై యుండ నారాయణచరణారవిందసంస్మరణశీలుండై యున్న భూపాలుం డిహంబున భోగంబును గీర్తిని బరంబునఁ గైవల్యంబును గాంచు. శమదమనదాచారసంపన్నుండైన బ్రాహ్మణుండేనియు శ్రీవిష్ణుభక్తివిరహితుండయ్యెనేని చండాలుండని యెన్నుము. చండాలుండేనియు శ్రీహరిపదాయత్తచిత్తుండైనఁ ద్రైలోక్యపూజ్యుండగుం గావున నీవు శ్రీవాసుదేవచరణారవిందంబులు త్రికరణంబుగ నమ్మి సుఖంబుననుండు" మన ధర్మనందనుండు, మహానుభావా! ఆభక్తి యెవ్విధమున వచ్చు లక్ష్మీవల్లభుం డెవ్వారలగృహంబుల నిలుచు నని యడిగిన నమ్మునీంద్రుండు, "తన శక్తివంచనచేయక పితృదినంబులు నెఱవేర్చునతండును దీర్థయాత్రాపరుండును దానశీలుండయ్యు వినయపరుండగువాఁడును బరకాంతాసంగమంబు గోరనివాఁడును, శూరుండును సత్యము శుచిత్వమునుం గలుగువాఁడును జననీజనకుల బాంధవులం బోషించువాఁడును బాపభీరువును సప్తసంతానములం బడసినవాఁడు, దయాపరుండు చేసిన మేలు మఱవనివాఁడు తక్కుంగల పుణ్యపురుషుల గృహంబుల మహాలక్ష్మి వాసంబు సేయు నచ్చటనే శ్రీమన్నారాయణుండు నెలకొని

యుండు. జూదగాని దుష్టుని దుర్వ్యసనశీలునిం జోరునిం జారుని సజ్జనదూషకుని దబ్బఱకాని నిర్దయు గృహదాహకు లుబ్ధుని స్వోదరపోషకుని గర్వోద్ధతుం బెడఁబాసి లక్ష్మి పరాన్నభోజనశీలుండగుబ్రాహ్మణుని వేదాదివిద్యలువిడిచిన తెఱంగునఁ దొలంగిపోవు. ధర్మనందనా! తొల్లి నీవు దుర్వ్యసనాసక్తుండవై జూదంబాడితి వదికారణంబుగానింతయనర్థంబు సంభవించె. ఇంక నెన్నం డట్టు లాచరింపకుము. కృష్ణపదభక్తిపరాయణుండ వయి యుండుము. వ్యతీపాత వైధృతి సంక్రాంతి యమావాస్య మొదలగు పితృదినంబులఁ దీర్థయాత్రావ్రతచర్యాదినంబుల వనితాసమాగమం బొనర్చిన వానియొద్ద లక్ష్మి నేర వెఱచు. నీకుం దెలియవలయు నర్థంబులు దేటపఱిచితి. ఇంకఁ దామసింపక జన్నం బొనర్పవలయు. కావున సకలశ్రేయంబులకు హేతు వయిన శ్రీకృష్ణదేవుం బిలిపింపు" మని యానతిచ్చె.

—: ధర్మజుపనుపున భీముఁడు ద్వారక కేగుట. :—

అంత నజాతశత్రుండు వైరిసేనాభీముం డైనభీముం బిలిచి నీవు ద్వారవతికింజని యాగయోగ్యంబైన చైత్రమాసంబు నేర వచ్చెం గావున మంత్రి పురోహిత సామంత దండనాథ బంధుమిత్ర పుత్ర కళత్ర సమేతంబుగా రుక్మిణీకాంతునిం దోడ్కొని రమ్మని పంచిన నన్నపాదంబులకు మ్రొక్కి వృకోదరుండు సత్వరంబుగా ద్వారకానగరంబునకుంజని దేదీప్యమానదివ్యరత్నప్రభాధగధగితనిజారరంబైనహజారంబుసొ

చ్చి చిరత్నరత్నమయంబులును గాంచనసమంచితంబులును కలధౌతనిర్మితంబులు నైనజోడుపక్కెరపల్లంబు జానంబు నం

—: శ్రీకృష్ణుని భోజనసమయము :—

కవన్నెలుమున్నగుముస్తీదులతోఁ గైజామోాఱులల్లార్చుచు రాజిల్లు వేనవేలు పడివాగె తేజీలును నడగొండలు సిల యేఱులం బోలుపొందుకైవడిమదధారాధూసరితగండస్థలంబులైన వేదండతండంబులును వివిధాయుధసంపన్నంబైన వీరభటవ్రాతంబును బోలుపొందు కక్ష్యాంతరంబులు గడచి ఫణిహారిం గనుంగొని తనరాక లోకరక్షకుండైన పుండరీకాక్షునితో విన్నవింపు మని పంచుటయు వాఁడునుం జని దివ్యరత్నప్రభానికరంబులచే నంధకారంబు దూరంబునం ద్రోయుచుఁ గాలాగరు సాంబ్రాణిగంధసారకర్పూరధూపంబులపరిమళంబుచే భూనభోఽంతరంబులువాసింపం జేయుచు బంగరుచెఱుంగుల రంగుమెఱయు చీనిచీనాంబరంబుల తెరలును గ్రొత్తముత్తియంపుజల్లుల నుల్లసిల్లుచుఁ గందోవలకు విందులుసేయు చెందొవలచందువలును రత్నప్రభాడంబరంబులైనరత్నకంబళంబులును జిలుకలుఁ గోయిలలు గోరువంకలుఁ జకోరంబులు *శతపత్రంబులుఁ బావురంబులు మయూరంబులు లేళ్లు దుప్పులు జింకలు మొదలగుసకలవిషదోషపరిహారక్రియానిపుణచాతురీధుర్యంబులగుమృగపక్షిసమూహంబులచే నభిరామంబును మల్లెలు మొల్లలు జాజు

---

* శతపత్రము=బెగ్గురుపిట్ట.

లు విరవాజులు పొన్నలు పొగడలు సంపంగులు గోరంటలు చేమంతులు చెందామరలు చెంగలువలుమొదలగు పూవు లతోరణంబులచే నేత్రానందకారణంబును నైనభోజనాగా రంబున మృగమదంబున నలికిన ఘనసారరజంబున రంగవల్లి కలం దీర్చిన చతురస్ర వేదికయందుబాలభానుప్రభాభాస మానరత్నపీఠమున సుఖాసీనుండై నవరత్నమయంబగుపళ్లె రంబున దేవకీదేవి వడ్డింపఁ దుమ్మిపూవులచందంబునఁ దెల్ల నగు రాజాన్నంబులును సువర్ణచ్ఛాయారూపంబులగుసూపం బులును సద్యోఘృతంబులును నప్పడంబులు వడియంబులుఁ దాలింపులు సంభారపరిమళ గంభీరంబులై నులివెచ్చ నగు పడిదెంబులు గలవంటకంబులుఁ దియ్యచేరులు మోరుఁజే రులుఁ ఖంచదారలు బానకంబు లానవాలుఁ జక్కెరపొం గలి దధ్యోదనంబు పులిహోరయెళ్ళోగిరంబుసకిరసంబులు వడలు నప్పంబులు దోసె లిడ్డెనలు లడ్డుకంబులుఁ బేణీలు సుకియలుఁ గుడుములు మణుంగుబూలు సారెసత్తులు మనోహరంబులు నతిసెలు సమృతఫలంబులు మండెగలు మొద లగుభక్ష్యవిశేషంబులును బాయసంబులు శిఖరి ణిలు * ఫలరసాయనంబులుఁ బచ్చళ్లుఁ బెరుఁగు లూరుఁ గాయలు వరుగులు నాది యాభక్ష్యభోజ్య లేహ్యచోష్య పానీయంబులును గుందేలు, ఉడుము, ఆలువ, లేడి, యడవి పంది మొదలైనభూచరంబులును గండెవాలుగ జెల్లమలు

* శిఖరిణులు=సిగరులు, మజ్జిగపులుసు.

గు క్రొత్తమారువాయిబొమ్మిడాయ యిసుకదొందు ఉలచ
తిజికి చేఁప తాఁబేలు మొదలగుజలచరంబులును గాఁజు
పూరేడు పొట్టిపిట్ట పొన్నంగి వెలిచె బెడిచె లావుక కేర
జము బెళవ పాడబెళవ పచ్చబెళవ కాటిగాఁడు ఉల్లంకి
చింతవంకలు లకుముకి వంగపండు మొదలగుఖేచరంబు
లునుం దెచ్చి లవణామ్ల మరీచికాజీరకకర్పూరమృగమదాది
పరిమళసంభారసంభృతంబులుగాఁ బాకం బొనర్చి బంగరు
గిన్నెలఁ బటికంపుదొన్నెలనుంచి యమర్చియుండ రుక్మిణీ
సత్యభామ లిరుకెలంకులఁ గంకణఝుణఝుణాత్కారంబులు
తోరంబులుగా సురటులు వీవ జాంబవతీమిత్రవిందలు చేపా
వడలువీవ లక్షణాసుదంతలు బంగారుగిండ్లతో గంధోదకం
బులు పూనియాయత్తముగానిలువ భద్రయుఁ గాళిందియుఁ
జెలికత్తెలంబంపి యయ్యైవస్తువులు వేవేగఁ దెమ్మని తీవరిం
చుచునుండ నారగించుచునుండినసమయంబున నప్పుండరీ
కాక్షునితో దౌవారికుండు భీమసేనురాక నెఱింగించిన
నవ్వి యీశ్వరించిగురుండు వాకిటనిలుప నేల వేగంబతోడు
కొని రమ్మని పంచిన వాయునందనుండు నందనందనుని
సన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబు సేసినశ్రీవాసు

—: శ్రీకృష్ణభీములసంభాషణము :—

దేవుండు, మందహాసభాసురవదనారవిందుండై "బావా
నీభావంబున నున్న కార్యంబు లన్నియుఁగుశలప్రశ్నంబును
వెనుక నొడువుదువు. ఇంతియకాని మున్నుగబుద్ధిమత్కాల

త్యం బగుభోజనంబు నాకంతపరిపూర్తిగఁ గావింపుము అట్లు గాక నీకెద్దియుం దోఁచదు. నాపలుకులకు శంక వలదు. నీకరణి బహుభక్షకు లగస్త్యకుంభకర్ణాదులుకొందఱు గలరు. నీవేమిటికి సిగ్గుపడియెదవు." అనిన ననిలనందనుండు మందస్మితంబు వదనంబునం గనుపట్ట, యాదవేంద్రా! నీవింత లెన్నెన్ని పల్కరింతు! కడుపారం దల్లిపాలు గ్రోలియుఁ జాలక పురిటింటిలోనఁ బూతనచనుఁబ్రాలు గ్రోలి దానిం బిలుకుమార్చితివి. జనని పెట్టిన యుగ్గునం దృప్తినొందక వ్రేపల్లెలో నున్న వెన్నలు పాలు నిచ్చ నిచ్చలు మ్రుచ్చిలించితివి. యశోదమ్మపొత్తున భుజియించియు నాఁకలి యడంగమి నింద్రయాగవిఘాతంబు సల్పి యతనికై యుంచిన యన్నరాసుల భక్షించితివి. మాత యొసంగు సేతికజ్జాయంబులు చాలక కుచేలుచేతి యడుకులు నాఁచికొని మెసవితివి. యుగాంతకాలమునఁ జరాచర పరిపూర్ణంబులైన బ్రహ్మాండకోటు లుదరంబులోఁ గూరికొని యుండిన నఱకొఱఁతయ గాని తృప్తుండవుంబోలె నుండలేదు. ఇట్టినీపొత్తున భుజింపు మనిన నాకుం బొసంగునె! నీవు మెండైనదీపనంబు గలవాఁడవు. అని పరిహాసంబు లాడుచుండ వాయునందనుని గనకాసనంబునఁ గూరుచుండనియమించి సరసాన్నపానంబులం దృప్తినొందించియొక్క, రమ్యస్థలంబున వసియించి యంగరాగంబులు కర్పూర, తాంబూలంబులుఁ గుసుమమాలికలు నవరత్నఖచిత భూషణంబులు

దుకూలంబులు వలయువస్తువాహనంబులు బహుమానంబు లొసఁగి, వచ్చినకార్యం బడిగి యతనివచనంబు లాలకించి కృతవర్మం బిలిపించి, "పౌరజనులనెల్ల నజాతశత్రుని యశ్వమేధాధ్వరంబుగనుఁగొనుటకుఁ బయనంబు గండని చాటింపఁ బనుపుముఁ నగరసంరక్షణంబునకు మాతండ్రి యగు -శ్రీకృష్ణుఁడుసకలజనులతోహస్తినాపురమునకువచ్చుట- వసుదేవుని నన్నయగు బలభద్రుని నియోగించువాఁడ" నని యానతిచ్చె. అపుడు భోజభూనాయకుండు కల్పాంతకాలతంతన్యమానధారాధరగర్జితానుకారిణియైన ప్రయాణభేరి వేయించినఁ బురజను లాబాలగోపాలంబుగాఁ బయనంబు వెడలిడిరి. అపుడుపుండరీకాక్షుండు వసుదేవునిచెంతకరుగుదెంచి నమస్కరించి తన పయనంబుం దెలుపుటయు నతండు కుమారుం జూచి, నీవు ధర్మజునశ్వమేధాధ్వరంబు నవలోకింపం బోవునప్పుడు హరికథావిముఖుండును నన్యాయవర్తనుండునుధర్మార్థకామరహితుండును దపోవర్జితుండును మిత్రవంచకుండు స్వామిద్రోహి పతితుండుఁ బందయుఁ బరదారనిరతుండు నల్లునిసొమ్ము భక్షించునధముండు ధర్మబాహ్యుండు విదూషకుండు దుర్వ్యసనాసక్తుండు బహుభాషియు విశ్వాసఘాతకియు ఋతుకాలపరిత్యాగియుఁ గష్టలోభియు ఖలుండు నాత్మస్తోత్రపరుండు గలహశీలుండును గృతఘ్నుండు భృత్యవంచకుండును క్షేత్రవిత్తాపహారకుండును నగువారలఁ దోడుకొని పోవలదు. నిను లంబాసి నిమిష

మాత్రం జేసియు నోరువం జాల నని తానును బయనం బైనఁ గమలలోచనుండు నగరసంరక్షణార్థంబుగ మీా కుం డక తీర దని యొడంబడఁ బలికి ప్రశస్తముహూర్తంబున నాప్తమంత్రి యోధభృత్యవర్గము పరివేష్టింపఁ బల్లకుల నుందరంబనిచియదువృష్ణిభోజాంధక వీరులతో నిరాఘాట ధాటీపాటవంబునం బటుతరం బైనతురంగంబు నెక్కి పురం బు వెడలి గండస్థలంబులఁ దొరఁగు మదాంబుధారావాసన లకుం గ్రమ్ముతుమ్మెదలకై శిరంబులు గదల్చుచు ఘీంకారం బులు సేయుసింధురంబులును సింధురంబులం జూచి కెరలి రావుత్తులు తత్తఱం బంద దాఁటుతురంగంబులును దురం గహేషారవంబులకు బెదరి గోనెలు దిగవైచి పాఱువృష భంబులును వృషభమ్ముల సందడి దండడిగొని మోవులు క్రిందఁ బడవైచి దైవంబును దూఱుభారవాహకులును గలిగి అొమ్ము అొమ్ముఁ దొలఁగఁ ద్రోయరాని సందడిలో మందమందగమనమ్మున గోవిందుండు చనుచు, జనుపనార లంబోలు తలవెండ్రుకలు గాలి కల్లాడ వెలిచినచెవ్వాకులు కర్ణంబుల వీడ రొంటిమీాఁద గట్టిన ముదుకచేలంబులూడ నాడాడ నల్లుండ్రఁజూచి యింటికి రావైతి వేమిః నాకూఁ తురు నిన్నుంజూడక రాతిరియెల్ల నిదురరాకవిరహవేదనం బొరలుచుండె, ననిపలికి బెల్లించి విటులచేతుల నున్నవక్క లాకులు జల్లించి కోలయూనికొనుచు మెల్లమెల్లనం జని యెవ్వారినిఁ గన్న నవ్విధంబుననె పలుకుచుఁ బయనంబు

ననుచున్న వృద్ధవారకాంతలం గనుంగొని చిఱునగవుద
క్కొత్త భీమసేనుదిక్కు మొగంబై, వాయునందనా! త్రొ
వయసుకాలంబున నాటిన గోటిమీటులు మోవికాటుల
గాయలుకాచి, నీమేని గాయంబులకరణి గనుపట్టు. బా
లం బోని పొట్టలు నీపొట్టకు సమానంబై చూపట్టు. అతి
స్థూలాకారంబుల నీకుసమానలై యున్న యీవృద్ధవేశ్యలం
బరిగ్రహింపు మనిన నవ్వి భీముఁడు, మున్ను మధురానగ
రంబున మువ్వంకగూనిదాని నొక్కఁతెం జక్కఁబెట్టితివి
పాదపద్మపరాగంబులచేఁ బాషాణంబును యోషారత్నంబుఁ
జేసితివి. ఇట్టికొఱమాలిన జంతువులనెల్ల దిద్దికొనుట నీభా
రంబు కాని మాకుం దరం బానె! ఎంత పాఱవేసినవార
లైనను నీకటాక్షంబున ధన్యులగుదు రని పలుకుచు నయ్యి
రువురుఁ బరిహాసంబు లాడికొనుచుఁ గొంతదూరంబు చనిరి.

రుక్మిణీకాంతుఁడందంబైనచెందొవలవలసం జెందిన
పుష్పాదులుగప్పి యొప్పులుగులుకు తరగంబులం జెలంగు
రాజహంస చక్రవాకబకక్రౌంచాది పక్షిగణంబుల కోలా
హలముచే మనోహరంబును బాపహరంబును, మాధురీజిత
సుధాసారంబునైన కాసారంబుఁ గాంచిదానితీరంబునఁ జం
దనమందారకుందకురవకాశోకకదళీప్రముఖతరువులనీడల
బాళెంబులు విడియ నియమించి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూ
ద్రులును నట నర్తక గాయక, వందిమాగధులును జిత్రకార
ఘటకార పటకార సూచీకారకులు మొదలైనజాతులవా

రును నయ్యోతావుల గుడారంబులు వైచికొని నిలిచి రంతఁ బ్రియకాంత యైనరుక్మిణీరమణిం జూచి రాజహంసములును వపుశేసుంగులు గండుఁదుమ్మెదలు మధురసంబులనాస్వాదింప సొంపు మెఱయునీపద్మినిం గంటివె! పురుషులకంటెఁ బొలఁతులకుఁ గామం బెనిమిదింత లధికము గదా యనిన నక్కాంత తనకాంతునితో, దేవా! నీవు సర్వభూతాంతర్యామివి, నీ వెఱుంగనియర్థం బేమి యున్నయది! నీ కుమారుం డగుబ్రహ్మకు వాహనంబు రాజహంస. నీ వాహనం బేసుంగు. తేఁటులు దానియొడం బుట్టినవి. అన్నియుఁ దనూజులకు సమానం బగుటం జేసి యిట్లు పలుకందగదని పరిహాసపల్లవితం బగుసల్లాపంబుఁ జేయుపల్లవాధరితో నా జగద్వల్లభుం డుల్లసిల్లుచున్నసమయంబునఁ దెల్లని పట్టెనామంబులును దీఁగెలయొడ్డాణంబులును బాదంబులం బెట్టిన బిల్లచెప్పులును జెవులం జెక్కిన నెమిలిఱెక్కలును గటితటంబునం దాల్చినకంబళ్లును బెరుఁగు పాలు నేతులు నించినకావళ్లును నుల్లసిల్ల వేలకొలఁది గొల్లలచ్చటికివచ్చి తెచ్చినద్రవ్యంబులు కానుకగా నిచ్చి గ్రుచ్చి కౌఁగిలించుకొని యచ్యుతునింజూచి, “ఓరి కిసనా! నీయప్పటికంబళి యేడ నేసితివి. కొండగోఁగులపువ్వులచాయ కంబళి యెవ్వా రిచ్చిరి. చుక్కలందెచ్చి గ్రుచ్చిన ట్లున్నయది. ఈ తెల్లగురిగింజ పేరు లేడ సంపాదించుకొంటివి? అప్పప్ప! చంద్రనిప్పుల యొప్పున నొప్పులూ గులకు నీగాజుపూస లేడఁ దెచ్చుకొంటివి?

గబ్బుకంపులం బొల్చిన నల్లనితిరునామంబేడ దొరకె! జల్లి తోఁకయేంది! మెడమీఁది జడలేంది? నిక్కుచెవులేంది! అప్పప్ప! ఈకోడెబోడియెద్దేడ నవరించుకొంటివి? వింతవింత వేసంబులతో నీచుట్టునుం జుట్టుకొన్న యీగొల్లలెచ్చట నుండువారలు?" అని పలుకు వారిమూఢవాక్యంబులకు సంత సించి వికసించిజనకుండు వారల నాదరించె. అప్పు డొక్క కుంభస్తని నవనీతకుంభంబును నొక్క మెఱుఁగుఁబోఁడి పెరుఁగువంటకంబును నొక్కబాలిక వనమాలికయు, బంగ రుకుండయుఁ దెచ్చి శౌరిం బొడఁగనిరి. ఒక్కవాలుఁగంటి జుంటితేనియఁ గానుక యొసగిన గోపాలచక్రవర్తి దాని యధరామృతంబు తొల్లి గ్రోలినవాఁ డగుటం జేసి తలంచు కొని నవ్వె. ఒక్కవేదండయాన పూదండ దండ నుంచు టయుఁ దదీయభుజాలతాలింగనంబు స్మరించి కనుగీఁటె. ఒక్క చెల్వ బిల్వఫలంబులు ముందఱ నునిచిన దాని కుచంబుల దృష్టి నిలిపె. మఱియొకతె నెమ్మిగరులకుంచె యెదుట నుంచిన నయ్యింతికుంతలంబులు మున్ను దాఁబట్టి యీడ్చినది తలంచి కనుమొగిచె. ఇవ్విధంబునం దొంటివల పులం దలఁపింప నాగోపకాంతలంజూచి గోపాలదేవుండు నర్మగర్భంబుగాఁ బలుకుచు వారల వీడుకొలిపి యారాత్రి యచట వసియించె. అని జైమినిమునీంద్రుం డానతిచ్చు టయు జనమేజయనరేంద్రుండు తదనంతరకథావృత్తాంత శ్రవణకౌతూహలాయత్తచిత్తుం డై యుండె.

చ. అవిరతదానశీల శరణాగతరక్షణలీల సత్కళా
కువలయమిత్ర సూనశరకోటిమనోహరగాత్ర సాహితీ
నవరసభోజ సూత్న దిననాథవిడంబకతేజ రాజమా
న్య విజయరంగచొక్కనరనాయకసజ్జనభాగ్యదాయకా!

క. శ్రీరంగ కృష్ణముద్దుల
వీరేంద్రకుమార సమరవితరణశూరా
శ్రీరంగపతిపదాంబుజ
సారంగా సమదశైలసమసారంగా!

మాలినీ. సనయహృదయపద్మా శాశ్వతైశ్వర్యసద్మా!
మదనవిమతశౌర్యా మందరాహార్యధైర్యా,
విదితవిభవసాంద్రా విశ్వనాథాన్వయేంద్రా!
ముదితకవిసమాజా ముద్దమాంబాతనూజా!

గద్య.

ఇది శ్రీ మత్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగచొక్కనాథ
మహీనాథకరుణాకటాక్షసంపాదిత గజతురంగమాందోళి
కాప్రముఖనిఖిల సంపత్పారంపరీ సమేధమాన సముఖ
మీనాక్షీనాయకతనూభవ మీనాక్షీదేవీకటాక్ష
లబ్ధకవితాసాంప్రదాయ వేంకటకృష్ణప్పనాయక
ప్రణీతంబైన జైమినిభారతంబున నశ్వమేధ
పర్వమ్మను వచనకావ్యంబునందుఁ
బ్రథమాశ్వాసము.

# శ్రీ ర స్తు.

# జైమిని భారతము.

——:o:——

## ద్వితీయాశ్వాసము.

—:o:—

క. శ్రీరాధావరచరణాం
భోరుహభృంగాయమాన భుజగరవీరా
ధారాఖండితశాత్రవ
శూరా శ్రీవిజయరంగచొక్కనవీరా!

అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయ నరేంద్రుం గనుంగొని యిట్లనియె. అమ్మఱునాఁటి వేకువజామున స్నానసంధ్యావందనాదినిత్యకర్మంబులు నిర్వర్తించి నందయశోదాదు లున్న తావునకుంబోయి కుంతీదేవి మామేనత్త గావున నద్దేవికి నమస్కరించి ధర్మజునియశ్వమేధంబు గనుంగొని వత్తురుగాక మీరలు ప్రద్యుమ్నాదికుమారకులం దోడ్కొని మెల్లన రండని యానతిచ్చి, కోడండ్రును దాసను దేవకీదేవి కుంతిదేవియొద్దను, నసపాకన్య సఖీజనంబులతోడఁ బాంచాలిసమీపంబునను, బ్రద్యుమ్నుని యాదవకుమారులతోడఁగూడ ధర్మజునిసమీపంబునఁ దనతో మున్న బాల్యంబున నాటలాడినగోపాలకుల నెల్ల గాండీవి

చెంత, నుండునట్లుగా నియమించి యాభీరవరులంజూచి సింహరాశియందుబృహస్పతి యుండుసమయంబునఁ బ్రశస్తతరంబైన గోదావరీప్రభావంబు గాంచి సకలతీర్థంబులు విస్మయంబుఁజెందినభంగి మీారలు కిరీటిపరాక్రమంబు గాంచి ఔచ్చ్యపడి యుండక తోఁచినసాటి పరాక్రమంబు గావించి యతని మెప్పింపుఁ డని యాజ్ఞాపించి కృతవర్మభీమసేనులం గాంచి, మీారిరువురు సకలదళంబులం దోడ్కొని మెల్లన రండు నేను మున్నుగాఁ గరినగరంబునకుం జనియెద నని పలికి పవనజవం బైనతురంగంబు నెక్కి మితపరిజన సమేతంబుగా హస్తినాపురంబునకు వచ్చి ధృతరాష్ట్రవిదురకృపసంజయసమేతుం డైనధర్మనందనుం గదిసి కంసారి సంసారిచందంబున సాష్టాంగదండ ప్రణామంబు గావించి తనకు మ్రొ

—: శ్రీకృష్ణుఁడు హస్తినాపురంబునకు వచ్చుట :—

క్కిన యర్జుననకులసహదేవుల నుచితసంభాషణంబుల నాదరించి స్వర్ణపీఠంబునం గూరుచున్నసమయంబున యుధిష్ఠిరుండు, దేవా! నీవు పుత్రమిత్రామాత్యసమేతంబుగా రాక యొంటిగ వచ్చిన దేమి యని యడిగిన నవ్వి యవ్వాసుదేవుండు వసుదేవబలదేవు లిరువురుం దక్కఁ దక్కినవార లందఱు వచ్చిరి. రేపకడ నిచ్చటికి వత్తు రనిన, సంతసించి కౌంతేయాగ్రజుండు పార్థునింగాంచి సకలదళసమేతంబుగా రేపకడఁ గదలి యాగతురంగంబు నడుమ నునిచికొని వారల కెదురుగాఁ జనవలయు నని పలికి మఱునాఁ

డరుణోదయంబున వనజోదరుండు సోదరుండు యౌవనా శ్వుండు మొదలగువారలు తోడ రా నధ్వరాశ్వంబు నలం కరించుకొని కుంతీద్రౌపదీప్రభావతులం బైలుమెఱయుండని నియమించుటయు వారలు రుటంపు సూర్యపటంపుఁగురా ళంబులం దులకించు కుందనంపుటాందోళికల నెక్కి యు భయపార్శ్వంబుల ఘోటికాసహస్రంబులపైఁ జేటికాసహ స్రంబులు కాంచనదండమండితంబు లగుఛత్రచామరకలా చికాపాదుకాప్రముఖ రాజచిహ్నంబులతోఁ గొలిచి నడువ దేవకీయశోదాదులకుం దగినకట్టనంబులు పెట్టియల నలవ రించి కట్టాయితంబై పట్టణంబువెడలి రెండవయాఖండలుం డునుంబలె నఖండిత వైభవంబునం గదలి కాళిందీతీరంబు జేరం జనియె అంతకమున్న భీమకృతవర్మాదులు సకల సన్నాహంబులు మెఱయ నెదుర్కొనునప్పుడు గంభీరభేరీ భాంకారంబులను గంటకులహేంకారంబులను మదగజ ఘీంకారంబులను జామరంబులు వేయుతోయజాతులకంక ణక్రేంకారంబులను భూనభోఽంతరంబులు ఘూర్ణిల్లె. ఆసమ యంబున శమననందనుండు సహోదరులుం దానును దేవకి కిం బ్రణమిల్లె. భీమసేనుం డేనుంగు డిగ్గి ప్రద్యుమ్నాది యాదవకుమారులుం దాను నన్నకు నమస్కరించె. దేవకి శోడంద్రతోఁగూడఁ గుంతికిఁ బ్రణామంబు సేసె. ద్రౌపది ప్రభావతియుం దానును దేవకీదేవి పాదంబులకు మ్రొక్కె. మఱియుఁ దారతమ్యంబు లెఱింగి వారు వారు తగుతెఱం

గున వందనాలింగనయోగక్షేమవాక్యాదివిధుల నొండొరు
లతో సంభాషించిరి.

—:అనుసాళ్వుఁడుసవనహయము నపహరించుట.—

అయ్యవసరంబున సౌంభపురాధీశ్వరుండునుయాదవ కులద్రోహియుఁ గృష్ణదూషకుఁడునై సంగరాంగణంబున మున్ను గోవిందునిచే హతుండైన సాల్వునికిం దమ్ముండను సాల్వుం డనువాఁడు వసుదేవనందనుం డగుముకుందునిం జంపి యన్నపగ దీర్చుకొందు నని సన్నద్ధుండై తనసైన్యంబుల నెల్ల గృధ్రవ్యూహంబుగాఁ బన్నించి సేనాపతులం జూచి నేను యాగీయఘోటకంబునుం బట్టి తెచ్చెద మీర లిచ్చట నిలువుం డని నియమించి సాళువంబు తూఱినచందంబున సేనలనడుమంజొచ్చి కిట్టినయోధావళి నట్టిట్టుపఱిచి యశ్వమేధాశ్వంబుఁ బట్టుకొని నిజసేనామధ్యంబునకుం జని సేనాపతియైన సుతారకునితో నేను యాగయోగ్యంబైనయీహరిం బట్టి తెచ్చుటయెల్ల హరితోడ సంగరంబు సేయుట కని యెఱుంగుము. ఆతండును బాండవేయులు దళసమేతంబుగా నిచ్చటికి వచ్చి తాఁకుదురు. వారితోడం దారసిల్లి కయ్యంబు సేయుండు. శౌరికంటెఁ బరుండు వేఱొక్కండు లేఁడు. అతని తెఱం గెఱింగి పట్టుకొనని వాఁడు నాకు హితుండును సుతుండును బాంధవుండును భటుండునుం గాఁడు. అవ్యాహితుండు నభేద్యుండు నవ్యయుండు నాద్యంతరహితుండు నచ్ఛిద్రుండును సకలలోక

వ్యాపకుండు నక్షరుండునైన యచ్యుతుండు మన మేయుబా ణంబులకుం దలఁగఁడు. ప్రహ్లాదుండు నారదుండు పరాశరుండు పుండరీకుండు వ్యాసుండు నంబరీషుండు శుకుండు శౌనకుండు భీష్ముండు దాల్భ్యుండు రుక్మాంగదుండు నర్జునుండు వసిష్ఠుండు విభీషణుండు వాయునందనుండు బలియు మొద లగువారలు కొందఱు భక్తివశంబున దేవకీనందనుని దమకైవసంబు చేసికొని యుందురు. ఇంతియ కాని తక్కిన వారలకుఁ జిక్కఁడు. అని పలికి తన యోధులం బదిలపఱిచి తానునుం గట్టాయితంబై సేనాముఖంబునకు వచ్చి నిలిచె.

ఇక్కడ హయంబు నపహరించుకొనిపోవుట యాలకించి శ్రీకృష్ణదేవుండు రాణివాసంబుఁ బౌరజనులఁ బాళెంబునుం గాచుటకుఁ బార్థునిం బుచ్చి మూలబలంబుతో ధర్మనందను నగరివాకిటనుండఁ గట్టడ సేసి భీముండును దానుయుద్ధసన్నద్ధులై ప్రద్యుమ్నవృషకేతులం బిలిచి మీరు మున్న గయ్యంబునకుఁ బొండని యనిపిన సూర్యపౌత్త్రుం డగు వృషకేతుండు కృష్ణుంజూచి, నేనుసాహసంబున బాహుగర్వంబు మెఱయ సవనహయంబుఁ గ్రమ్మఱంబట్టుకొని పగతుగెలిచివచ్చెద నట్లుసేయనైతినేని బ్రాహ్మణీగమనంబు నేసిన పాతకియు ఋతుకాలంబున నిజాంగనను బరిత్యజించినవాఁడునుంబోవుగతికిఁ బోవుదు నని ప్రతిజ్ఞచేసె. అంత నతండు సహాయుండుగా బ్రద్యుమ్నుండు సాహసోద్యోగంబున గృధ్రవ్యూహంబు

—: వృషకేతుఁ డనుసాళ్వునిఁ బట్టి తెచ్చుట :—

గాఁ బన్నియున్న విరోధిసైన్యంబుసొచ్చి కోదండంబు మండలాకారంబుగాఁ దిగిచి చండకాండంబులు గొండగొండ నిగిడించి సమద వేదండంబులఁ జెండాడియు ఘోటకంబుల గీటడఁగించియు మణిమయస్యందనంబులఁ జదఖండంబులు సేసియు వీరభటపరంపరల వెంపర లాడియు సంరంభంబున విజృంభించిన ననుసాల్వుండు ప్రద్యుమ్నుం గాంచి, మకరకేతనా! విరహిజనులం దరుణుల వెఱ్ఱితాపసులఁ గుసుమబాణంబులచే జయించితి నని గర్వింపకుము. ప్రళయకాల దండధరదండోపమానంబులును బ్రచండములునైన కాండంబులు గాఁడినం గాని తెలియ దనిన నవ్వి ప్రద్యుమ్నుఁడు, నాయమ్ములు పువ్వు లగుట సహజము. నిన్నుఁ దాఁకునెడఁ గల్పాగ్ని కీలాభీలంబు లగు నని పలికి యైదుశరంబులు వింటఁ దొడిగి యాకర్ణాంతంబుగాఁ దిగిచి యేయుటయు ననుసాల్వుఁ డయిదుబాణంబులచే వానిం దుత్తుమురు సేసి దంభోళిసన్నిభం బైన యొక్కసాయకంబు ఱొమ్మునం దుయ్యనేసిన నతండు మురవైరి యెదుటం బిల్లమెఱము వైచిన పగిదిం ద్రెళ్లె. అంత దనుజాంతకుండు మనంబున క్రోధశోకంబులు పెనంగొనఁ బ్రళయకాలరుద్ర ఢక్కాఢమాత్కారఘోరంబుగాఁ బాంచజన్యంబు పూరించి తటాలున నడిచిన పవననందనుండు ముందఱం దలకడచి యుద్దండగదా ప్రహారంబుల రథగజతురగపదాతి వర్గంబులం బీనుంగుపెంటలు

గావించినం గర్ణనందనుండు వాయుపుత్త్రునిం జూచి కంఠీర వంబు మదగజంబువిడిచి మఱియొక్క క్షుద్రమృగంబునకుం బోవునే? నీప్రతాపంబునకు నీయల్పబలంబులు సరియగునే. ఇంతమాత్రంబునకు మీరు గదాదండంబుం బూనందగదు. మరలుం డని పలుకునవసరంబున ననుసాల్వుండును మహోగ్రబాణంబు వింట సంధానంబు గావించి మారుతకుమారు మర్మంబులు లక్ష్యంబు గావించి యేయుటయు మంత్రించి పడవైచినకరణి మహీతలంబునం గూలె. అంత మురవైరి యనుసాల్వునిం గనుంగొని, యెందుం బోయెదవు నిలునిలు మని యదల్చిన నయ్యనుసాల్వుండు ‹కమలనాభా ! నీవు మాయగ్రజుం డగుసాల్వునిం గొని గగనమార్గంబునకుం గొనిపోయి బావిలోనం బడవైచి మృతినొందించితివి కావున నిన్ను గీటడంగింపక మానను. నీకొడుకును మఱింది యును బడినపాటు గన్నారం గనుంగొంటివి గదా? ఇంక నీవు పాతాళంబు సొచ్చితి వేనియు మహానిమానసంబునం డాఁగితి వేనియు నిన్నుఁ బోనిచ్చువాఁడను గాను. నీవు పురాణపురుషుండవు నేను బ్రాయంపువాఁడ నీకు నాకునం తరం బని భ్రూకుటీకుటిలంబును వికటంబు నగునాననం బునం గనుపట్టుచు నాలుగు తూపులు సంధించి రథ్యంబుల ప్రక్కలు వ్రక్కలించుటయు యుగ్యంబులు మొగ్గినదారు కుండు పగ్గంబులు పదిలంబుగాఁ బట్టి యరదంబు పిఱిందికిం దివియించి క్రమ్మరఁ దురంగంబుల సేదదీర్చి యెట్టకేలకు

రథంబు ముందఱకుం దెచ్చుటయు మురాంతకుఁ డతని వక్షంబునఁ బదుమూఁడు బాణంబులు గ్రుచ్చిన నతండును జిచ్చులు రాల్చుమెఱుంగుఁదూపు శింజినిం గూర్చి యా కర్ణాంతంబుగాఁ దివిచి మురవైరివక్షంబు లక్ష్యంబు సేసియే సిన నచ్యుతుండు పెనుమూర్ఛచేత ముచ్చముడింగి లీలా మానుషనటనంబున రథంబుపయిం బడియె. అంత ము రాంతకునిపాటు గనుంగొని చతురంగబలంబులు పటాపం చలై తండ్రి బిడ్డ యన్న తమ్ముఁ డనక విడిచి పాఱుటయు వృషకేతనుం డదలించి విఱిగినసైన్యంబు మగిడించి యను సాల్వుని నిలు మని గద్దించి సప్తసాయకంబులు నిగిడించిన వాఁడును దశనిశాతబాణంబులు కర్ణకుమారుని వక్షంబు వీక్షించి యేయుటయు నబ్భానుపౌత్రుండు తురంగంబులఁ ద్రుంచి సారథిం బడఁగెడపి రథంబు చెక్కులు సేసిన నుక్కు దక్కక యనుసాల్వుండు రథంబుమీఁదికి నుఱికి కర్ణజుని వక్షంబు తన్నినం బడక యతండు వానికిరీటంబువీడఁ బట్టి ముందలఁ బట్టి బిఱబిఱం ద్రిప్పి ధరణిం బడవైచి ఱో మ్మునం దుమికి తనవింటినారి వానికంఠంబునం దగిలించినఁ గన్నుల ముక్కుల నెత్తురులు గ్రమ్మ మ్మరించినమూర్ఛం గ్రమ్మి మే నెఱుంగక యున్నయెడ వేఁటకాఁడు లేడిం బట్టి యీడ్చి తెచ్చినతెఱంగునం బట్టి తెచ్చి "వీఁడెగుఱ్ఱంపుదొంగ వచ్చెఁ గనుంగొనవధరింపుము" అని విన్నవించుటయు యా దవేంద్రుండు కర్ణకుమారునిం జూచి వత్సా! నీవు ధన్యుం

డవు, వీరలోకమాన్యుండవు, నీకుం దక్క నన్యునకు నిమ్మహా
రథునిం బట్టి తేఁగూడునే?" యని గోపాలదేవుండు సూర్య
పౌత్రునిం గొనియాడ నతండును వానికంఠంబునం దగిలిం
చినగుణంబు వదలించుటయు ననుసాల్వుండు మూర్ఛదె
ప్పిఱి శ్రీకృష్ణదేవునిం గనుంగొని శాంతచిత్తుండై, స్వామి!
మీపాదంబులకుం బ్రణామంబు. కర్ణనందనునిసామర్థ్యంబు
వలన దేవరసందర్శనంబు లభించె నని యనేక ప్రకారం
బులం బ్రశంసించిన యనుసాల్వునింగృపాతరంగితంబులగు
నపాంగవిలోకనంబులం గనుంగొని గారవించి కౌఁగిలించి
యతనికరంబు నవలంబించి తోడ్కొనిపోయి ధర్మనందనుం
గానిపించి దండప్రణామంబు సేయించినఁ బాండవాగ్రజుం
డాదరించి నాకునీవు వృకోదరాదిసహోదరులట్ల గాదిలిసోద
రుండవు. క్రతురక్షణంబున సావధానుండవై యుండు మని
యానతిచ్చె.

అంత ధర్మనందనుండయ్యధ్వరాశ్వంబునుం గొని
తెచ్చినప్రద్యుమ్న వృషకేతనులం బ్రీతులం గావించి కరి
పురంబునకు వచ్చి యాదవుల విడియించి కృష్ణానుసాల్వ
యౌవనాశ్వమహీపతుల సబహుమానంబుగా నిజనివాసం
బులకుం బోవం బనిచి తా నభ్యంతరమందిరమునకు జని
యజ్ఞరక్షాసమయంబుఁ బ్రతీక్షింపుచుఁ బుణ్యకథా ప్రసం
గంబులం బ్రొద్దులు గడపుచుండఁ జైత్రశుద్ధపౌర్ణమి వచ్చు
టయు నప్పుణ్యదివసంబున ధర్మనందనుండు ద్రౌపదీసమేతం

బుగాఁగృతస్నానుండై నిత్యకృత్యంబులు నిర్వర్తించి యాగదీక్ష వహించి తురంగంబు దెప్పించి గంధపుష్పధూపదీపనైవేద్యాదిపూజలుగావించినిజబిరుదాక్షరసమేతంబుగాసువర్ణపట్టంబు దానిలలాటంబునం గట్టించి రత్నఖచితమంజీరంబులును గనత్కనకకింకిణీజాలంబులును బురుసాకురాశంబునుముత్యంబులజల్లులపైదండలు నీలాలదృష్టిదండలు హేమపద్మంబుల మెచ్చులు మీఱుదుమ్మెచ్చులుబంగరుతంగుపట్టియు వజ్రాలమోముట్టు సింగంపుమోముతలాటంబును జలచ్చామరంబులుగబ్బి మీఱువారబ్బికవికయుంజోకగావించి డవిణ మలహరి సాంబ్రాణిధూపంబులుపచ్చపావడలువిరాజిల్ల వేనవేలు తేజీలు గంధసింధురంబులు స్యందనసందోహంబులుం గూర్చి ధనంజయుని నశ్వసంరక్షణార్థంబు గానియమించి యాశీర్వదించి పంచిన నతండును ధర్మజునకు మ్రొక్కి శౌరిపాదాబ్జంబులకు వందనంబు గావించి దేవకీదేవికిం దన్నుఁగన్నతల్లికిగాంధారికిధృతరాష్ట్రునకునభివాదనంబులు గావించి కృష్ణానుమతంబునఁ బ్రద్యుమ్నుండును వృషకేతుండును యౌవనాశ్వుండు ననుసాల్వుండును మొదలగుమహారథికవరులు నిజచమూసమేతంబుగా వెంబడింజనుదేర వెడలె. అత్తురంగంబు నభిజిన్ముహూర్తంబునం గదలి గ్రామంబులు పల్లెలు నగరంబులు పేటలు కోటలు నదులు నదంబులు శైలంబులు కాననంబులు తటాకంబులు చెఱువులు దొరువులు గ్రమించుచు యథేచ్ఛ విహారంబు

గా వచ్చివచ్చిదక్షిణదిశామండలమండనంబైనమాహిష్మతీ పురంబు సేరం జనుదెంచె.

—: ప్రవీరుఁ డశ్వమును బట్టుట: —

అవ్విధంబునఁ దురగంబు మాహిష్మతిం జేరం జని హృద్యంబు లైనయుద్యానంబులం బూచినపూవులతావుల కుం దావలంబు లైనమందానిలంబులచే నందంద కదలెడు చిఱుతరంగంబులవలనం బొడమిన జలధూమ్రంపుసొంపు నం దెరువరుల బడలిక లపనయింపుచుఁ ద్రిలోకశర్మదంబైన నర్మదాతటంబు చేరం జని యం దొక్క శృంగారవనంబుఁ జొచ్చి యయ్యశ్వరాజంబు జంబూకదంబాదివృక్షజాతం బుల నీడ దూరంబు నడచివచ్చినబడలిక దీఱం జరియింపుచుఁ గోమలంబు లైనదూర్వాదళంబులు మేయుచు జలంబులు గ్రోలుటకై కొలంకులకడకుం డాయుచున్న సమయంబున నద్దేశాధీశ్వరుం డగునీలధ్వజునికూర్మితనయుం డైనప్రవీరుం డనువాఁడు నిజకళత్రం బైన మదనమంజరితోడం గూడ నయ్యుద్యానంబున విహరింపుచుండి కుందచందనమందార చంద్రశకలశరచ్చంద్రకిరణంబులంబలెఁ దెల్లనగు శరీరంబును సంపెంగపూవులచాయం బచ్చనైనపుచ్ఛంబును నింద్రనీల వర్ణం బైనకర్ణంబులును బాలసూర్యబింబంబునుంబోనియధ రంబును బగడంబులవలె గోరోజనంబుకై వడిఁ గుంకుమపం కంబుపోలిక నెఱ్ఱ నైనకంఠంబునుం గలయత్తురంగరత్నం బుం గనుంగొనియయ్యంగన తననాథునితోఁ గోటానఁగోటి

ఘోటకంబులలో మేటి యైన యీఘోటకంబు నీలాయం బున నుండెనేని నీవు చేయు రాజ్యంబు సఫలం బగు ననిన విని నీలధ్వజకుమారుం డైనప్రవీరుండు చేరం జని దానిను దుటం గట్టియున్నట్టి బిరుదుపట్టంబు గనుంగొని యందు "రాజాధిరాజ రాజపరమేశ్వరసకలసామంతరాజభయంకర వీరప్రతాపమూర్తి యైన యుధిష్ఠిరమహారాజేంద్రుం డధ్వ రంబు సేయం బూని విహరింపంబంపినయీయశ్వరాజంబు నీశ్వరునిం బోరిలో గెలిచిన నెఱయోధుం దుర్జనదండధరుం డైన యర్జునుండు రక్షింపం బూని వచ్చె ధారణీతలంబున వీరుండు శూరుండునుం గలిగెనేని పట్టికట్టుం" డనివ్రాసిన వక్కాణచదివి యాచక్కెరబొమ్మం జూచి యిత్తురంగంబు వెంబడి వచ్చినయర్జునున్ గెలిచి నే నీహయంబుం దెచ్చెద. నీవు సఖీజనంబులతోడం గూడం బట్టణంబునకుం బొమ్మని పంచిన నమ్మించుఁబోఁడి గడగడవడంకుచుగుబ్బ లింబు మీఁది వాంఛం జాలించి తనతనువల్లికి సమానం బైనపువ్వుఁదీఁగె లు వంచుట మాని కరపల్లవంబులసౌరు గలిగిన చివురు గిల్లుట లుడిగి గబ్బిగుబ్బలవలెనుబ్బు మీఱు కుసుమగుచ్ఛం బులు ద్రుంచుట వర్జించి పెదవి తేనియలకుం బదులైన పు వ్వుఁ దేనియ లానుట విడిచి వనంబు వెడలి ప్రాణేశ్వరు నెడఁబాయఁ జాలక కాళ్ళుతొట్రుపడ మెల్లనఁ బల్లకి నెక్కి సఖీజనంబులతోడఁ గూడ బట్టణమార్గంబు పట్టి చనియె.

అంత నరాతిభయంకరుం డైనప్రవీరుండు నేనుంగులుం దురంగంబులు నరదంబులు వీరభటపటలంబులు ధృఢవ్యూహంబు పన్ని వజ్రకవచంబుఁ జగ్గుమీఱు తేఁగొగ్గియు నుడుముచర్మంబునం బొదివిన కరతలత్రాణంబును మెఱయ దివ్యబాణతూణీరంబులు మూఁపునం గట్టి కనకరేఖాలంకృతం బైన కార్ముకంబు భూతలంబున నూఁదివింటికొప్పునం దనకిరీటంబు సేర్చి నరకు సేయక పరదళంబులం గనుంగొను చున్న సమయంబున నయ్యాజ్ఞికులు నెదురుగాఁ బఱచి పార్థునిం గనుంగొని తురంగంబుపట్టువడినవృత్తాంతంబుపల్కరించుటయు ముఖారవిందంబున మందస్మితంబు దళుకొత్తఁ గయ్యంపువేడుక మొగంబునం జెంగలింప దిగ్గజంబులకర్ణపుటంబులకుం గఠోరంబుగా గాండీవగుణారావంబు నెగడ నరదంబు త్వరితంబుగాఁ బోవని ప్పుని వచ్చువివ్వాచ్చుని ము

—: వృషకేతుప్రవీరులయుద్ధము :—

న్నాడి వృషకేతుండు, పట్టినహయంబుతో నడ్డపెట్టక దిట్టయై యున్నరాచపట్టిని విలోకించి, తురంగంబు విడిచెదో మాతోడం బోరి ప్రాణంబులు విడిచెదో రెంటిలో నొక్కటి, విడువక కర్ణసుతుండు నిన్ను విడువఁ డని పలికినం బ్రవీరుండు మొగంబునం జిఱునగవు దోలఁకఁ జిన్నయ్యకుం దలమీఱివచ్చిన నిన్ను సురనగరంబున కలంకారంబుగాఁ బంచి యేపిమ్మటఁ బరాక్రమోపార్జనుం డైనయర్జునుం దెగటార్చెద నని నాలుగుక్రొవ్వాఁడిబాణంబుల గుఱ్ఱం

బుల నొప్పించి యొక్క శిలీముఖంబున సారథిని మూర్ఛ
వుచ్చి యయిదుమెఱుంగుఁదూపుల వక్షస్స్థలంబుఁ బెకలిం
చినఁ గర్ణకుమారుండు నేఁడువాఁడిమెఱుంగుఁబమ్ములఁ దురం
గంబుల గీటడంగించి యొక్క బాణంబున సారథి నొ
ప్పించి నాలుగు వేలుబల్లెంబుల నా రాజకుమారునిఫాలంబు
దూయ నేసిన నా ప్రవీరుండు కంపంబు నొందక మహామే
ఘంబులు పిడుగులు వర్షించు వడువున నపారంబు లైనశర
వర్షంబులు గురియించి కర్ణనందనుని స్రుక్కించి వేఁడొక్క
తూపు వింటం గీలించి యాకర్ణాంతంబుగాఁ దీసి యనుసా
ల్వుని మూఁపు నాటించి యుద్ధంబునకు నిలిచిన, వాఁడును
సువర్ణపుంఖంబులుమనోమారుతరింఖంబులు నైనకంకపత్త్రం
బులు ననంఖ్యాతంబులును బుంఖానుపుంఖంబులు గాఁ గురి
సినఁ గాలు చే యాడక ప్రవీరుండాహవంబున కోహటించి
యుండుసమయంబున సేనలుకలంగంబాఱియాహాకారంబు
లొనర్పి నానుద్దియాలకించి మాహిష్మతీపురాధీశ్వరుండైన
నీలధ్వజుండు మూఁడక్షౌహిణులసైన్యంబుతోఁ దనయల్లుం
డైన యగ్నిదేవుని మున్నిడుకొని కదనంబునకుంగదిసి తన

—: నీలధ్వజుండు పరాక్రమించుట :—

కుమారుం డగుప్రవీరునియరదంబు నకుం దలకడచి చొచ్చి
విచ్చలవిడి నస్త్రవృష్టిచే ననుసాల్వుని ముంచి వచ్చినయో
ధవీరుల నెల్లం బదేసివిశిఖంబులం గ్రుచ్చుటయు, సేనాసం
దోహంబులు పటాపంచలై పలుఁగడలకుం బఱచిన ధనంజ

యుండు విరిసిన సైన్యంబుల మగుడం బురికొల్పికొని యా భూపాలునిం దాఁకి యయిదుబాణంబులు ప్రయోగించుటయు నీలధ్వజుం డు నైదమ్ములు దొడిగి త్రోవనేయ నబ్బాణంబులు మగిడించి సింహనాదంబు సేసిన యౌవనాశ్వుండును సువేగుండును ననుసాళ్వుండును నృపకేతుండును మొదలుగాఁగల యోధవర్గంబులనర్గళంబులగుమార్గణాసారంబులు గురిసిన నీలధ్వజుండు వెఱవక యందఱ కన్నిరూపులై తూపులసోనలు గురియుచుఁ దనయల్లుఁడై నయగ్ని దేవునిం బిలిచిన నతండు నస్త్రరూపం బై యెదుటం గనుపట్టిన నయ్యాగ్నేయాస్త్రంబు కార్ముకంబునం గదియించి మౌర్వీనాదంబున దశదిశలు ఘూర్ణిల్లం జేయుచుఁ బ్రయోగించిన నర్జునుండు వారుణాస్త్రంబుసంధించుటయుజలకణంబులునుం బోలె నయ్యస్త్రంబు నొక్కగ్రుక్కగాఁ బీల్చి చటచ్చటార్భటులు మింట నంట నొంటుకొను మంటలును మంటలకంటె మున్నుగా మిణుంగుఱుబూచులకై వడి మీఁటి నింగికెగయు మిణుంగుఱులును మిణుంగుఱులం దలకడచి ప్రలయకాలంబున గబ్బిమెఱయు మబ్బులవలె నుబ్బుమెఱయు పొగలును బొగలకంటె మున్నుగా గగనంబునం బఱచు దివ్యవిమానంబుల ధగధగ మని రగులుకొనం జేయు సెగలునుం గలిగి సాక్షాత్కారంబుగా నగ్ని దేవుం డర్జునుని సైన్యంబులం బొదివిన, భద్రగజకుంభంబులు పగిలి పెటపెటం జిటిలిన ముత్తియంబులరాసులును యుగ్యంబుల

పగ్గంబులు కేతనంబులు పతాకలు ఛత్త్రంబులు నివుఱులై పూడెలుకట్టిన కనకరథంబులును గిరీటంబులం దాపినరత్నంబులు చిటిలి పడఁ బెటిలిన దేహంబులతో నటునిటుం బొరలాడు వీరయోధులును గత్తులు కేడెంబులు జీరాగొగ్గిముసీదులు తరకసంబులు సింగిణులుం గమలి భస్మావశేషంబులై గాలికిం బోవఁ గమలిన దేహంబులతోఁ బీనుంగుపెంట లైనవీరభటులును దూకలపెటికలు క్రిందం బడవైచి మంటలు వెంటనంటఁ గుంటుచుం బొఱ నొంటెలును నొంటెలకం టెమున్నుగా అంకెలు వైచుచు మోపులు వైచి పరుగిడువృషభంబులునుం గలిగి పాండవబలంబులు ధూళిపటంబులై పఱచినం గని నీలధ్వజుండు సవ్యసాచిఁ దురంగంబుం బట్టికొని యాలంబు చాలించి పురంబునకుం జనియె.

— అర్జునుం డగ్ని దేవుని స్తుతించుట. —

అప్పు డర్జునుండు ధనుర్ధరుండై వహ్ని నుద్దేశించి యంజలి యొనర్చుచు "దేవా! వేదమయుండవు శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులు నిన్నుం గొనియాడు. నీవుసకల దేవతలకు ముఖంబవు. ఆహవనీయంబును దక్షిణాగ్నియునీయందుఁద్భవించె. సర్వసాక్షి వగునీకుం బ్రియంబును శ్రీకృష్ణ దేవునకు నారాధనాత్మకంబును బృందారకుల కానందకరంబునుంగా ధర్మనందనుం డశ్వమేధంబు సేయ నుద్యోగించె. క్రతుదీక్షా సంరక్షకుండ వైన నీవు దీనిం బక్షీకరించి రక్షింపవలయుం

గాని యుపేక్షింపం దగునే" యని ప్రస్తుతించినం గైకొనక మేరమీఱి మామగారి మీఁదికనికరంబునశిఖానికరంబులు పరఁగించుచుఁ బొగలు సెగలు మిగుల రగులుకొన దిగదిగ మని తగులుకొని మెరగలిపగిది మించి చనుదెంచు నచ్చిచ్చుఁగసుంగొని వివ్వచ్చుండు మనంబున నతనికామాతురత్వంబుగర్హించుచు శ్రీమన్నారాయణుని చరణంబుల స్మరణంబులు గావించి నారాయణాస్త్రంబు వేదోక్తప్రకారంబుగా వింట నొంటించి ప్రయోగింప నుద్యోగించుటయు సూర్యచంద్రాంగారకాదిగ్రహతారకాగణంబులు గతులు తప్పె. దిగ్గజంబులు మ్రొగ్గెం బంచభూతంబులు హాహాకారంబు లొనర్చె. వేదంబు మఱచి మోదంబు మాని చతుర్ముఖుండు తమ్మిగద్దియ విడిచి దిగ్గన లేచె. సప్తసముద్రంబులు కలంగె. కులపర్వతంబులు వణంకె, భూమి పెటపెటం బగిలె. బ్రహ్మాండభాండంబు దిగఁబడియె. ఇంద్రాదిదిక్పాలకులు సిద్ధసాధ్యకిన్నర కింపురుషగరుడోరగాదులు దిక్కామోకంబులై పాఱం జొచ్చిరి. అపుడు హవ్యవాహనుండు భయంబొంది వేండ్రంబు మాని యింద్రనందనుని చెంతకు బ్రాహ్మణరూపంబునఁ జనుదెంచి వినయంబున నిట్లనియె.

"మహాత్మా! నాయెడం దయసేయుము ఏదేవునిం దలంచినంతమాత్రంబుననె నూఱువేలయశ్వమేధంబులు పదిలక్షల షోడశమహాదానంబులు కోటితీర్థయాత్రలు ననేక కోటి వ్రతంబులుం జేసినఫలంబు లభించునట్టి శ్రీవత్సాంకుని

డును నిష్కళంకుండును రమాకళత్రుండును బరమపవిత్రుండును బరంజ్యోతియుఁ బరబ్రహ్మంబును వేదాంతవేద్యంబు నైనపరతత్త్వంబు నీయింట నుండి కంటికి ఱెప్పగాచినచందంబున నిన్నుం గాచుచునుండ నాబోటులకుఁ దేఱిచూడం గూడునే? శ్రీహరిని విసర్జించి దేవతాంతరంబు లపేక్షించు నతండు పాలసముద్రంబు దొరకినను బాల్కై మేకం బితుకువానిచందంబున సూర్యకిరణంబులం గాదని మిణుంగుఱుంబురువుల కాసపడు నపస్మారివితంబునం బరిహాసయోగ్యుం డగుం గావున నంబుజోదరదివ్యపాదారవిందవందనానందంబునం బొదలునీకు నశ్వమేధాదియాగంబులు సిద్ధించుట యెంతవింత! నాకు మామ యైనమాహిష్మతీపురాధినాథునిం దోడ్కొని వచ్చి నీకు సేవకునిం జేసెద. ఇమ్మహానారాయణాస్త్రం బుపసంహరింపు" మని ప్రియవాక్యంబుల వేఁడుకొనుటయుఁ గ్రీడి పావకునియెడం బ్రసన్నచిత్తుండై యమ్మహాస్త్రంబు నుపసంహారంబు గావించిన నగ్నిదేవుండు భండనంబునం బడినసేనల నెల్ల నైంద్రజాలికునిపగిది మగుడఁ బ్రతికించి యర్జునునకుం బ్రదక్షిణంబు గావించి పురంబునకుం జనియె. అనిన విని జనమేజయనరేంద్రుండు జైమినిమునీంద్రుం గనుంగొని పావకుండు నీలకేతున కెవ్విధంబున నల్లుం డయ్యె నని యడిగిన నతఁ డిట్లనియె:

—: అగ్నిదేవుని వృత్తాంతము :—

రాజేంద్రా! నీలధ్వజుని పట్టంపురాణి జ్వాల యను వధూటి గలదు. అప్పురంధ్రీమణికి నీరేడులోకంబుల నీడుజోడు లేనిచక్కఁదనంబున నుతికెక్కిన స్వాహానామధేయ యగుకన్యకారత్నంబు గలిగిన నాతరుణి జవ్వనంబును సౌందర్యంబు గుణంబులు లీలావిలాసంబులును, త్రిభువనమోహనంబులు గావున దానికిం బెండ్లిసేయం దలంచి నీలధ్వజుండు రూపలావణ్యవంతులు కీర్తిమంతులు నైనరాజకుమారులఁ బెక్కండ్ర వ్రాసి తెచ్చినచిత్రపటంబులు సూపి యం దొక్కనివరియింపు మనిన నగ్గజగమన సిగ్గునందలవాంచి మదాంధులు గర్వగ్రంథులు వసుంధరాధిపతులు. తక్కిన మానవు లెల్ల దీనులు. వారలశరీరంబులు నిత్యంబులు గావు గావున మర్త్యుల వరియించుట నాకు సమ్మతంబు గాదు. అమర్త్యులందు నొక్కరుని వెదకు మనిన నీలకేతుండు కూఁతుంజూచి మంచిది వాసవుని రప్పించెద వరియింపు మనిన నమ్మదిరాక్షి మదిలోన విచారించి "సురపతి నాకుం దగినపతి యగుం గాని యతండు జారుండు తపోవిఘ్నకరుండు కులగోత్రవిదారుండు సవికారుం డదియుం గాక దేవాదిదేవుండైనశ్రీవిష్ణుదేవునిం దనకు దమ్మునిఁగా నెంచి భక్తి గావింపఁడు గావున దేవేంద్రుండు సమ్మతుండు గాఁడన నతండు మఱియెవ్వారిం గోరుదు వనిన, "యగ్నిదేవుండు జగత్పూజ్యుండు. దేవతలకెల్ల నగ్నిముఖం బని

వేదవచనము గలదు. కావున సతనియెడ నాభావంబు నిలిచి యున్నయది. పతితోడం గూడ ననుగమనంబు సేయం దలంచినసతి తనశరీరం బాహుతి గావించె నేని దానిదురితంబుల నణంచి కైవల్యంబు నొసంగం జాలునట్టి దైవం బగ్ని దేవుండు దక్కవేఱొక్కరుండు లేఁడు. సురగరుడోరగవిద్యాధరసిద్ధసాధ్యచారణగంధర్వాదులలో నొక్కరుండును నామనంబునకు సమ్మతుఁడు గాఁడు. వైశ్వానరుని యందు నాడెందంబు లగ్నంబయ్యె ననినఁ జెలులు నవ్వుచు నప్పువ్వుఁబోఁడింజూచి 'యేమని కోరితివమ్మా! రాఁజుచుండెడు మొగంబేమి! నిప్పులు కుప్పలించునడక లేమి! సర్వభక్షకత్వం బేమి? యెచ్చటకు వచ్చినం గాల్చుట యేమి! పోయినమార్గం బెల్ల మలినం బగుట యేమి ! యిట్టివానిం బెండ్లియాడు నాఁడువారుంగలరె? అదియునుంగాక రెండు తలలతోడి మూఁడుకాళ్ల ముదుసలిని వరియింపఁదగవగునే! అనిన సఖీజనంబులవాక్యంబులు నిరాకరించి తండ్రిచే ననుజ్ఞఁగైకొని తపోవనంబునకుం బోయి నియమవ్రతంబు సంకల్పించి సమంత్రకంబుగా వైశ్వానరు నావాహానంబు సేసి కర్పూరంబు కుంకుమంబు కస్తూరియు నగరు చందనంబు మలయజంబును లవంగశర్కరాఘృతపాయసంబులు తేనెయు బిల్వఫలంబులు తెల్లచెఱకులు కదళీఫలంబులు తాంబూలంబులు మొదలైనపూజాద్రవ్యంబులు దెచ్చి హోమంబు నర్చనంబునుం జేయుచు బహుకాలంబు భజించు

బయ్యుఁ జిచ్చుదొర మెచ్చి నృపాలునిపురంబునకు వచ్చి విప్రరూపంబున రాజమందిరంబు సొచ్చి సముచితోపచారంబులఁ బూజితుండై "మహీశ్వరా! నీకన్య యగుస్వాహావధూరత్నంబు నాకుం గన్యాదానంబు సేయు" మనిన నీలధ్వజుండు ధూమధ్వజునిం జూచి "నాకన్యక యగ్ని దేవునిం దక్క నితరుల నొల్లదు గావున వేఱొక్కకన్నియ నొసంగెద వివాహంబుగ" మ్మనిన, ననలుండు నిజరూపంబుఁ జూపిన రాజు ప్రమోదభరితుండై స్వాహాకన్యకను చిత్రభానునకుం గన్యాదానంబు సేసె. అదిమొదలుగా వీతిహోత్రుండు వారియింట నిల్లంట్రపు టల్లుండై తత్పురంబు రక్షించుచు వైరులమీఁదం దార్కొనుచు నతనికి నస్త్రంబై యుండె. ఇదిజాతవేదుండు నీలధ్వజునకు నల్లుఁడైన తెఱంగని వివరింప జనమేజయుం డవ్వలికథ సెప్పు మనుటయు జైమిని యిట్లు సెప్పం దొడంగె.

అవ్విధంబున ధూమకేతనుండు నీలకేతనుని సమ్ముఖంబునకుం బోయిన నతండు నల్లునిం జూచి శత్రుసైన్యంబు నిశ్శేషంబుగా దహించి వచ్చితివే యని యడిగిన ననలుండతనిం జూచి నరేంద్రా! నరనారాయణుల మహత్త్వంబు తొల్లి వినలేదా! అర్జునుండు నారాయణపరాయణుండు గావున నావ్యూహంబు నాకు దురవగాహంబు. దాహంబు నొందింపం గూడదు. అదియునుంగాక తొల్లి దేవేంద్రుండు ప్రయోగించిన వజ్రాయుధంబు స్తంభింపజేసి ఖాండవ

వనంబు నా కాహుతి సేసె నయ్యుపకారంబు దలంపక
యతనితో నాచేత నైనయంత యుం బోరితి నింక నాకు
నసాధ్యంబు. నీవు నిరర్థకవిరోధంబు వాటింపక యూహా
యంబు రయంబునం గొనిపోయి పార్థున కొసంగికృతార్థుం
డవు గమ్ము" అనిన రాజపుంగవుండు తనకులాంగన యగు
జ్వాలానతిం గనుంగొని యల్లుండైనయగ్ని దేవుండు మనకు
హితంబు సెప్పెఁ గావునఁ గ్రతుఘోటకంబు గొనిపోయి
కిరీటికి నప్పగించి స్నేహంబు గావించుకొనియెద ననిన
దంట యగునావాలుగంటి తననాథునితో ముక్కంటివంటి
వాఁడు పెనంగనేనియుఁ జలపట్టి తనపట్టినకార్యంబు విడు
వక కీర్తిఁ జేపట్టుట రాజధర్మంబు. సాహసంబు సేయక శ్రీయు
ను గీర్తియుఁ గలుగనేరవు. పట్టినగుఱ్ఱంబు మగుడ నిచ్చి
యతని వేడుకొనం బోయితివేని నరిరాజులు నవ్వారె!
గెలిచితివేని నరలోకరాజ్యంబును మృతుండ వైతివేని సుర
లోకరాజ్యంబును ననుభవించెదవు. పరునకుం బ్రియంబు
సెప్పి బ్రతుకుటకంటె క్షత్రియునకు మరణంబు మేలు.
అనినవిని యమ్మనుజనాథుఁ డట్ల కావించెద నని యమ్మిం
చుఁబోఁడితోఁ బంతంబులు పలికిరణభేరి భాంకారంబులును
గజఘీంకారంబులును శింజినీటంకారంబులును నెసంగ
నహంకారంబున సేనలం బురికొల్పికొని పురంబు వెడలి
పురందరనందనునితోడం దలపడుటయు గాండీవి గాండీవ
గుణధ్వని దిక్కులు వ్రక్కలం జేయఁ బ్రళయకాలనీలజం

ధరంబు వర్షించిన తెఱంగున నంపరల పరంపరల వెంపర లాడుటయుఁ బడినయేనుంగులును మడిసిన గుఱ్ఱంబులును బొడి యగురథంబులును జడిసిన వీరభటులును దునుక లైన కేతనంబులును దుమురు లైనగొడుగులును ద్రుంగిన సే నాంగంబులును విఱిగిన కైదువులును విటతాటనంబు లైన మైమఱువులునువిశకలితంబు లైనకిరీటకేయూరహారాదిభూ షణంబులు వ్రేలెడు ప్రేవులును దుమ్ము లైనయెమ్ములును గ్రమ్మినరుధిరమ్ములును నాడెడు నట్టలును నందంద విహ రించుభూతబేతాళంబులును నానందంబు నొందుకంకకాక గృధ్రజంబుకంబులును గలిగి సంగరాంగణం బతిఘోరం బయ్యె. అంతనీలధ్వజుండు కపిధ్వజునిం దాఁకి నిశితవిశి ఖంబుల నొప్పించిన గాండీవి మండలీకృతకోదండుం డై చండకాండంబులు తండోపతండంబుగాఁ గురిసిన నొక్క తీక్ష్ణభల్లంబున భుజమధ్యంబు పగుల నేయుటయు నెత్తు రులు గ్రక్కుచు మరణసమానం బైనమూర్ఛ నొందిన సా రథి యన్నీలధ్వజుని దుర్దశయును సైన్యంబులు సమయుట యును గాలు కాలుం బెనఁచుకొని పడిన సుతభ్రాతృబంధు యోధజాలంబులనుం గాంచి యరదంబు కదనరంగంబు నకుం దొలంగించి పట్టణంబునకుం దెచ్చుటయు నట్టకే లకు మూర్ఛఁ దెప్పిఱి యప్పుడమిఱేఁడు సారథింజూచి మేలుసేసితి వని కొనియాడి మంత్రులం బిలిపించి మంత నంబు గావించి కృష్ణసహాయుం డైనజిష్ణుని మార్కొనుటకు

నెవ్వరికిఁ దరంబు! పర్వతంబుపై సన్నపడినఁ దగరు శిరంబు నొచ్చుటయె కాని పర్వతంబునకుఁ గొఱంత యేమి! బలవద్విరోధంబు తగ దని యాలోచన నిశ్చయించి తనపట్టపురాణికిం దెలుపుటయు నియ్యకొనక యయ్యతివ ప్రల్లదంబులు ప్రేలినఁ గినిసి నీదుర్నయంపుబోధనచే యుద్ధంబునకుం బోయిన నాకుం గలవార లెల్లను సమసిపోయిరి. స్త్రీబుద్ధిః ప్రళయాంతకి' యనెడు పలుకె యథార్థంబయ్యె నని యాగ్రహంబున "నిస్సీ! యిటువంటిదాన తోడం గాఁపురంబు సేసినఁ గుణంబు సెడి మానప్రాణంబులకు హాని సంభవించు" నని యప్పుడె దానిం బట్టణంబు వెడలనడచి చీనాంబరంబులును జిరత్నరత్నభూషణంబులును జిత్రంబులైనచేకానుకలును జిన్నారినారీమణులునుంగూడ నయ్యధ్వరాశ్వంబుఁ దెచ్చి విజయున కొప్పగించి వినయపూర్వకంబుగా మ్రొక్కుటయు నర్జునుండు నతని నాలింగనంబును సేసికొని "నీవు సహోదరసమానుండవు. ఈసంవత్సరంబునునాతోడంగూడ నశ్వరక్షణంబు సేసి యాగంబుం గనుంగొని ధర్మనందనవసుదేవనందనులకు వందనంబు సేసివత్తువుగాక" యని ప్రార్థించి యమ్మహీధవునిం దోడ్కొని యధ్వరాశ్వంబునుం దరలించిన నదియు దక్షిణదిశాభాగంబునకై యతివేగంబునం జనియె.

—:జ్వాలాదేవి సోదరునికడ కేఁగుట.:—

అంతనీలధ్వజుభార్యయైన జ్వాలాసతి మగనిచేనవమానంబు నొంది డెందంబునం బట్టరానిరోషవిషాదంబులంబొగులుచుఁ గాశీనగరంబునకుం జని యాదేశంబున కధీశ్వరుండు నపక్రపరాక్రమాటోపదీపితుండు నాత్మీయసహోదరుండు నైనయుల్ముకునియొద్దకుం బోయి విషాదవేదనాదోదూయమానమానసయై పాదంబులపయింబడి రోదనంబు గావించుటయు నతండును గరుణాయత్తచిత్తుం డై యూఱడించి "నీ వొంటిగా వచ్చుటకుఁగారణం బేమి? ఇంతవంత యేమిటికిం జెందెదవు? ఎంతకార్యంబయిన నిర్వహించెద" నని యడుగుటయు, నామె, యశ్వమేధాశ్వంబు వచ్చుటయుఁ దనతనయుండు పట్టుకొనుటయు నందువలన సమరం బగుటయు, బహుజనక్షయంబునుదనమగనిపరాజయంబును దాను మగుడ సమరంబునకుఁ బురికొల్పుటయు నతండు మంత్రులతో యోజనచేసి కయ్యంబున కియ్యకొనక తన్ను ననమానించి పురంబునువెడల నడుచుటయునాద్యంతంబును బూసగ్రుచ్చినవితంబునఁ దెలియఁబలికి మఱియునుం దద్విరోధంబు రూఢమూలంబు సేయందలంచి యిట్లనియె. "అన్నా నాబన్నంబు లెన్నని వివరించెద! నీమఱందితానును బుత్త్రుండును దండనాయకులు దళసమేతంబుగా ధనంజయునిందాఁకి దావాగ్నిజ్వాలలం బడినశలభంబులకై వడిఁ జచ్చియు నొచ్చియు వెన్నిచ్చియుఁ బార్థునికోర్తులకుం జాలక

కలహాకారిణి యగునన్నుం బురంబు వెడల నడిచి యతనిశర ణంబునొందె. ఈయవమానంబు సహింపఁగూడక యే నిందు వచ్చితి. నీవు దక్క నాకు రక్షకులు లేరు. ఎవ్విధంబున నైన నీయవమానంబు దీఱునట్లుగాఁ బార్థునితోడం బోరి సంహరింపు" మనుటయు నతండు సహోదరినిం జూచి "యట్లకానిమ్ము, రేపటికిహాయంబిచ్చుటికి వచ్చు. నేను బట్టి కట్టెద నతనికి నాకును సమరం బయ్యెడు నపు డర్జుననినిర్జిం చెద నీవు వంతం బొందవల" దనుటయు నాజగజంత సహో దరుం జూచి యింద్రనందనుండు గుఱ్ఱంబు పోయినత్రోవనే పోవుఁ గాని యిచ్చటి కేలవచ్చు? గుఱ్ఱంబు వెంబడి నతండు పోయిన నీవెవ్వరితోడఁ గదనంబు నేసెదవు? అని తీవరించు టయు "సహోదరి! యింతలోన నేమికార్యంబు దప్పె? ఎన్నటికేనియు నతనికి మనకు విరోధంబు పుట్టకపోవునే? నాఁటికి నీకోఱంత దీర్చెద. ఈవేళనూరకుండు" మనుటయు నాదంట యతనిం జూచి యన్నా పుట్టినజగడంబు తోడుత నడుపవలయుఁగాని యేండ్లు పూండ్లు చెల్లిన నేమి ప్రయో జనంబనిన నుల్మూఖుండు నాగ్రహోదగ్రుఁడై "పాపాత్మురా లా! చొచ్చినయిల్లు చెఱచినది యుం గాక పుట్టినయిల్లు నుం జెఱుప వచ్చితివే నీవంటి చెఱపనచేట మాయింట నుండం దగదు. పాతెడు బండ్లకుఁ బాదంబులు చాఁచు మనిమెదు. నీవలసినయెడకుం బొ" మ్మని విడనాడుటయుఁ బిడుగువడినదానిం గొఱవిఁజూఁడిన తెఱంగున నయ్యంగన

కెరలి మనంబులో మిడుకుచు గంగాసమీపంబునకుం జని రోడయెక్కి యవ్వలిగట్టునకుఁబోవువారలతోడం గూడఁ

—: గంగ యర్జును శపించుట :—

బోవునెడఁ దనయెడమకాలిమీఁద గంగాజలంబు తుంపుర పడుటయు "శివశివా! యెంతపాపాత్మురాలి నంటితిని. ఇందు కింక నేమిప్రాయశ్చిత్తంబు సేసికొందు" నని పలికినఁ దీర్ఘ వాసు లయినజనులందఱు గువ్వాకరి గొని త్రిలోకపావని యగునీపుణ్యవాహినిం దూషించిన నీనోరు పుచ్చవలదా? కర్మచండాలి! నీవుమాతోడంగూడ నుండం దగ దని యేక వాక్యంబుగాఁ దిట్టిన నాగంగానది నవ్వుచు నంగనారూపం బునఁ బ్రత్యక్షంబై "నీమాటి! నాయం దేమి యన్యా యంబు గంటివి! నీవిట్లు దూషించుటకుఁ గారణం బేమి యె ఱింగింపుము" అనినఁ బుట్టినబిడ్డల నేడ్వురం దొట్టితొట్టిస మెడలునులిపి వేసిన పాతకివి! నీకుఁ గడపట నుప్పురాయి వలె నొక్కండునిలిచె. సత్యవ్రతుం డగునమ్మహానుభావుని శిఖండిని మున్నిడుకొని యర్జునుండు వధించె. ఆనూడు దీర్చుకొనక యున్నదానవు. పుత్రహీనవు. నీముగంబుసూ డరాదు. అనిన నాదివ్యనది కోపశోకంబులు మనంబునం బెనంగొన నేఁటికాఱవనెలనాఁటికి నర్జునుని శిరం వాని కుమారునిచేఁ ద్రెళ్ళుంగాక యని శపియించి యంతర్ధా నంబు నొందుటయు నాజ్వాలయు సంతసంబునొందియాదివి జనదీతీరంబున ద్వారుఫులచేతం జితియమర్చికొని శివునుద్దే

— జ్వాలాదేవి చనిపోవుట. —

శించి తనశరీరం బాహుతి గావించి మృత్యుదంష్ట్రాకరాళం బును జ్వాలామాలి కాభీలంబు నర్జునప్రాణాపహారకంబు నగు శరంబై జనియించి బభ్రువాహనుతూణీరంబునం దుండె.

—: అధ్వరాశ్వము ఱాతినంటుకొనుట. :—

అంత నాసైంధవంబు జవంబున నయ్యుద్దేశంబులు దాఁటి వింధ్యపర్వతసమీపంబునకు వచ్చి యచ్చటఁ దిలకంబులు క్రముకంబులు కదంబంబులు కరవీరంబులు నర్జునంబులు నామ్రంబులు కుటజంబులుకురంటకంబులామలకంబులగురులు సాలంబులు రసాలంబులు పాటలంబులు వటంబులు లవంగంబులు నారంగంబులు,నీపంబులుధూపవృక్షంబులు మొదలగుతరువులచే బహుళంబులై నగహనంబులు సొచ్చి పోవునెడ మార్గమధ్యంబున యోజనంబు నిడివియు నరయోజనంబు వెడల్పును నంతియుపొడవునుం గల యొక్కశిలం జూచి దేహంబు తీఁట దీరుటకై యాశిలతో నొరసికొను మాత్రంబునఁ జిగురుఁగండెలోసం దగిలిన పక్షికైవడి నాగుంటెతో నంటికొని యవ్వాలివ్వాలం గదలనేరక కనకంబునం జెక్కినరత్నంబు కైవడి నిశ్చలంబై యుండుటయు నాసాహిణులు హ్రేషాహేషానాదంబుల వదల్చికశాఘాతంబున నైచి నాగెపట్టి సాఁగదీసిన రాక యూరకుండుటయు నయ్యశ్వరక్షకులు భయభ్రాంతమానసులై వడిగాఁ గవ్వడి కడకు వచ్చి యావృత్తాంతంబు విన్నవించుటయు నరుఁదంది

పురందరనందనుం డశ్వంబు దురవస్థఁదప్పించునుపాయంబు గానక తత్సమీపంబుననున్న సౌబరియాశ్రమంబునకుంజని

—అర్జునుండు సౌబరియాశ్రమంబునకుఁ బోవుట—

యందు శరభంబుపిల్లలం బ్రక్కలోనుంచుకొని చన్నుఁబాలిచ్చి పాలించు గండభేరుండంబులునుం, బాదుగులంబాలు దాఁచి సింహకిశోరంబుల కొసంగి నిదురవుచ్చు శరభంబులును, నేనుంగుగున్నల కటంబులతీట దీఱ మెల్లమెల్లన గోరులం గీఱు సింగంబులును లేడిపిల్లలం జూచి చన్నులు చేఁపి వానిమేనఁలు నాకుసివంగులును బాముపిల్లలకు నెండ సోఁకకుండ ఱెక్కలం గప్పు నెమిళ్ళును నెలుకపిల్లల మెల్లనం గలుగు చేర్చుమార్జాలంబులునుంగలిగి జాతివైరంబులు లేని జంతునివహంబులచే సకలభువనసంతోషకరం బైన యాశ్రమంబునకు ననతిదూరంబున సైన్యంబును నిలువ నియమించి ప్రద్యుమ్న వృష కేతనానుసాళ్వ యౌవనాశ్వ నీలధ్వజులం గూర్చికొని యాశ్రమప్రదేశంబున కరిగి వేదాంతవిద్యావిశారదుండునుదయారసవర్షనీరదుండును శ్రీమదష్టాక్షరీమంత్రలబ్ధమహత్త్వుండును రుద్రాక్షమాలికా విభూతిజటావల్కలధారియు శమదమాదిగుణహారియు నగు సౌబరింగాంచి సాష్టాంగంబుగా మ్రొక్కి సేవించిసవ్యసాచి నిటలంబునఁ గరకమలంబులు మొగిచి "మానికులచంద్రా ధర్మనందనుండు జ్ఞాతివధం బొనర్చిన పశ్చాత్తాపంబునఁ గృష్ణద్వైపాయను ననుజ్ఞచే నశ్వమేధాధ్వరంబు నేయం

బూని చైత్రశుద్ధపౌర్ణమాసిదినంబున దీక్షగైకొని బ్రాహ్మణులకు మణికనకాదిదానంబు లొసంగి మఘవాజింబయనంబు నేసి పూజించి పంపుటయు నేను శ్రీకృష్ణయుధిష్ఠిరులనమస్కరించి వారల యనుమతిఁ గైకొని యీయావనాశ్వాదులు వెంబడింగదలి రా దేశంబు లన్నియుఁ గడచి వచ్చి వింధ్యవనవాటిం జొచ్చి యయ్యశ్వంబు యోజనవిస్తారంబైనప్రస్తరంబుతో నొక్కటిగానంటికొనియె. శిలానిబద్ధంబైనయీక్రతుహయం జేవితంబున విడివడు నావితం బెఱిఁగింపవే దయానిధీ! నీకు నమస్కారం" బని ప్రార్థనంబు సేసె.

— ఉద్దాలకమహర్షికథ. —

అంత సౌబరి యింద్రతనూభవుం జూచి తొల్లియుద్దాలకుం డనుమహాముసీంద్రుండు యథోక్తంబుగా బ్రహ్మచర్యవ్రతంబు నెఱవేర్చి కర్కశభాషిణియుఁ గలహకారిణియుఁ బ్రతికూలాచారయు ననుదినకృతాపచారయుఁ నైన చండిక యనుదానిం బెండ్లియాడి బాల్యంబుననుండి యౌవనకాలపర్యంతంబు నానావిధంబుగా మనోరంజనంబు సేసియు దానివలన గుణంబు గానకయే చింతించుచు నుండు. వేపచెట్టునకుం బాలుపోసి చక్కెరయెరువు వేసి పెంచిననేనియుఁ జేఁదుగాక మాధుర్యంబుగలుగనేర్చునె! అతండు సంధ్యవార్వఁ బాత్రంబు దెమ్మనిన నది రాతిమీఁదం బగులఁగొట్టు. దాని నతిక్రించుకొనుట యతిప్రయాసం బగు.తడి

ద్రోవతి యెత్తి యిమ్మనిన నడిమికి రెండుగాఁ జింపు, నది బ్రహ్మకట్టి వైచి కట్టుకోవలయు. జపమాలికం దెమ్మనిన సూత్రంబు త్రెంచి పూసలు వెదచల్లు, నవి వెదకి యేఱి తెచ్చుకోవలయు. సమిధలు దెమ్మనినఁ గుండం బార్చివైచు. నదియూఁదిరగులుకొల్పుప్రయాసంబు దైవం బెఱుంగు. వంట వేగంబె కావలె ననినఁ గడవలు పగులఁగొట్టు. కోపంబు వలదే యనిన రోఁకలిచేఁ బ్రహరించు, నివ్విధం బునఁ బ్రతిదినంబుం బ్రతికూలవర్తన యగుభార్యచేతం బడరానిపాటులంబడుచు బ్రహ్మచారియు గృహస్థుండును గాక రెంటికిఁ జెడ్డ రేవఁడై వంతం బొందుచునున్న యెడ నతనికి గురుం డగుకౌండిన్యుం డనుమునివర్యుండు శిష్యులు గొలువం దీర్థయాత్ర పోవుచును ద్రోవ వచ్చి యుద్దాలకుని యాశ్రమంబునకుం జనుదెంచుటయు నతం డర్ఘ్యపాద్యాది విధానంబులం బూజించి కుశలంబడిగి కౌండిన్యుతోఁ దన భార్యప్రతికూలవర్తనంబు లెల్ల, సవిస్తరంబుగాఁబలుకరించి దుఃఖించుటయుఁ గౌండిన్యుం డుద్దాలకునిం జూచియయిన పనికి నేమి సేయం గలవారము. అగ్నిసాక్షికంబుగావివాహం బైనసతు లెటువంటివారైనను విడుచుట యెట్లు? దీని కొకయుక్తిఁ బలుకరించెద. చేయవలసినకార్యంబుచేయవల దనుము. చేయనొల్లనికార్యంబు చేయు మనుము. ఇట్లు చెప్పితి వేని యకృత్యంబులు మాని కృత్యంబులు సేయుచునుండు. నీయభీష్టంబు సిద్ధించు" నని యానతిచ్చిన నయ్యు

ద్దాలకుండు తనపత్నిం జూచి మనయింటినడవలో నెవ్వరో కొందఱు వచ్చియున్నారు. వారల నవ్వలికిం బొమ్మని తీర్థంబుమొదలుగ నీయక దుర్భాషలం దిట్టు మనిన నా చండి యక్కటా! యిట్లుచేయుదురె? అని వారలకు నమస్కరించి తోడ్కొనివచ్చి షడ్రసోపేతముగా నన్నపానంబు లొసంగి పూజించె. వారలు చనినయనంతరంబ యుద్దాలకుండు ఘటునాఁడు భార్యం గనుంగొని "రేపటికిఁ బైతృకంబు నేను జేయంగలవాఁడను గాను, కాదని చేసితినేని యుఁ గుండగోళకుల దురాచారుల వేశ్యాపతుల బధిరుల నంధుల విష్ణుభక్తివర్జితులఁ బరదారద్రవ్యనిరతుల బ్రాహ్మణార్థంబునకు నియమింతు నింతియ కాని నిన్న మనయింటికి వచ్చినవారు మగుడ వచ్చిరేని వారల నియమించువాఁడం గాను. పైతృకంబు సేసితినేని యువలు చామలు నారుగలు కందులు నలసందెలు నువులు సెనగలు తమిఁదలు జొన్నలు కంబు లుల్లి పుచ్చకాయ ముల్లంగి సొరకాయ పిండికూర నేతిబీఱకాయ చిత్రికూర మేడికాయ చెంచలికూర మొదలైన యభక్ష్యద్రవ్యంబులు దెచ్చి సద్గింతు నది యునుం గాక తెల్లవాఱిన జాముమీఁద బ్రాహ్మణులం జెప్పుదును గాని తొలినాఁటిరాత్రియే విజ్ఞాపనంబు సేయువాఁడంగాను. సాయంకాల సమయంబున రాత్రియేనియు నర్చనంబు సేయుదుఁ గాని కుతపకాలంబున నిద్ర పోనంగలవాఁడఁ నట్టింటఁ జిట్టముకయు నవుడు మట్టిడి పెంటలు

నెఱపుదు నింతియ కాని గృహంబు నలంకరింప. బ్రాహ్మణుల వస్త్రంబులు దోఁచుకొని దక్షిణ లేదు పొమ్మని యవిశ్వాసంబుగా నాచరింతు"ననిన విని చండి మండిపడి సదాచారసంపన్నులు వేదవేదాంగపారగులు నైనబ్రాహ్మణోత్తముల నాఁటి రాత్రియే నియమించి గృహంబు ముంగిలియు నడవయు గోమయానులేపనంబు రంగవల్లికలచే శృంగారంబు గావించి తానునునరుణోదయంబుననెస్నానంబునేసి మినుములు పెసలు యవలు గోధుమలు మొదలగుధాన్యంబులును దోసకాయ పనసకాయ కాఁకరకాయ యారుద్దొండకాయ బలుసుకూర మొదలైనశాకంబులు, నతిరసంబులు వడలు దోసె లిడ్డెనలు మొదలగు ప్రేష్యంబులైన భక్ష్యంబులును గమనీయంబు లైన నూతనభాండంబులం దయపరించి దక్షిణలు సొమ్ము వస్త్రంబులు మంచిగంధంబులు సంపాదించి యుక్తకాలంబున యథావిధిగా శ్రాద్ధంబుఁ జేయించి మగనికి నిష్టబాంధవులకు షడ్రసోపేతంబుగా భోజనంబులు పెట్టి తాంబూలాదు లొసంగి సంతోషంబు నొందించుసమయంబున సూర్యమండలంబు బింబఫలడంబరవిడంబనం బై కాంతికదంబకంబులం గనుపట్ట నస్తగిరిశిఖరంబునఁ గనకకలశంబుకరణిం బ్రకాశించె నప్పు డుద్దాలకుండు భార్య చేసినయుపచారంబులకుఁ సంతుష్టుండై మేను మఱచి తద్విపరీతంబుగాఁ బలుకక పార్వణంబుగొని పోయి గంగాజలంబులో వైవు మనినం గోపించి యాపాత

కిని యింటిసమీపంబుననున్న పెంటమీఁద వైచుటయు నుద్దాలకుం డాగ్రహావ్యగ్రుఁడై కనుఁగొలంకుల నిప్పు లుప్పతిలం జూచుచు నిర్భాగ్యురాల! పవిత్రంబులైనపార్వ ణంబులు పెంటమీఁద వైచి శ్రాద్ధంబు వ్యర్థంబు గావిం చితివి. ఈయకృత్యంబు లెన్నాళ్ళుసహించంగలవాఁడ? గొం డారణ్యంబున గుండురాయివై పెద్దకాలంబు పడియుండు మని శపియించి గడగడ వణంకుపడంతుకం జూచి కరుణా కలితమానసుండై. కొంతకాలంబునకు ధర్మనందనుని యశ్వ మేధాశ్వసంరక్షణార్థంబుగా నర్జునుండు వచ్చు నతనికరం బుసోఁకినం గృతార్థవయ్యెద వని శాపమోక్షంబు ననుగ్ర హించెం గావున నీకరంబుచే నప్పాషాణంబు నంటుము. అశ్వమేధహయంబు పీడి వచ్చు. చండికయును శాపమో క్షంబుగాంచు ననిన నక్కిరీటి సౌబరిమహామునికి సాష్టాం గనమస్కారంబు సేసి వాజిసమీపంబునకుం జని నిజకరా రవిందంబుచే (రాతి) నంటుటయు (హయంబు దానితోడ నంటు వాసె) శ్రీరాముని చరణారవిందరేణువులు సోఁ కిన యహల్యకైవడిఁ జండికయు శాపమోక్షంబు నొందె. ఉద్దాలకుండును గ్రమ్మఱ దానితోడం గాఁపురంబు సేయ నొల్లక సన్న్యసించె.

అంత నయ్యశ్వంబు వింధ్యకాననంబుదాఁటి యాది భుజంగపుంగవుని ఫణాశృంగంబులు బరువుచేతం గ్రుంగఁ బడునట్లుగాఁ జతురంగంబులు నడువ హంసధ్వజమహారాజ

ప్రతాపసంరక్షితంబును గోపురాగ్రపరిచుంబితగోపురంబైన చంపకాపురంబు చేరం జనిన నాహవప్రవీణులును మహాసాహసికులును బాహుబలభరితులు నైన యోధవీరులతో నింద్రనందనుండు తోడనెవచ్చె. అప్పు డధ్వర ఘోటకంబు వచ్చుటయు నానాధ్వజినీసమేతంబుగా ధనంజయుండు కూడం జనుదెంచుటయు నుపలక్షించి వేగరులు వేగంబ చని హంసధ్వజునితో నెఱింగించుటయు మంత్రులం బిలిపించి యాలోచనంబు సేసి "ధర్మజుని యశ్వమేధాశ్వంబు వచ్చె నంట! విజయుండు తోడనే వచ్చుచున్నవాఁ డట! నే నత్తురంగంబుఁ బట్టి బెట్టుగా సమరంబు గావించెద. అపుడు

—: హంసధ్వజుఁ డశ్వమును బట్టవచ్చుట. :—

భక్తసంకటమోచనుండును బద్మలోచనుండును గరుణావరిష్ఠుండును నైన శ్రీకృష్ణుం డతనికిఁ బ్రాపై వేంచేయుఁగలండు. నేన ద్దేవదేవుని దివ్యపాదారవిందంబులు సందర్శించి కృతార్థుండ నయ్యెద" నని నిశ్చయించి సన్నాహసముచితంబైన రణభేరి మ్రోయించుటయుఁ గోలఁ గొట్టినభంగిఁ జతురంగ బలంబులు వెలువడియెను. అప్పుడు బలపరాక్రమధురీణులును రణకళాప్రవీణులును బరమాప్తులు నైనడెబ్బదుండ్రు సేనాపతులు నొక్కొక్కనికి డెబ్బదియొక్కవేయిభద్రగజంబులును నవరత్నమయంబు లైన యన్నియరదంబులును జవసత్త్వవంతంబు లైనలక్షలక్షగుఱ్ఱంబులును నందఱు వీరభటులునుం గలరు. ధనబలుండును సురథుండును సుధన్వుండును

సుబలుండును ధర్మబాహుండు ననం బరఁగిన కుమారు లేవ్వురు గలరు. వారలందఱు ధర్మపరాయణులును శ్రీవిష్ణు భక్తినిష్ఠాగరిష్ఠులును నేకపత్నీవ్రతులును సత్యభాషణులును దాతలును శూరులును సంగరప్రియులునై యొప్పుదురు. అట్టిసేనలతో హంసధ్వజుండు కయ్యంబునకు వెడలునపుడు నిజపురోహితులైనశంఖలిఖితులం బిలిచి నాయాజ్ఞ నుల్లంఘించి రణంబునకు రాక వెనుకఁ జిక్కినవారిం గాఁగిన చమురుకొప్పెరలలో వైవుం డని యాజ్ఞాపించి భద్రగజంబు మీఁద నెక్కి శ్వేతచ్ఛత్రచామరంబులు మెఱయ వెడలు నపుడు మేడ లుప్పరిగలు చంద్రశాలలు నెక్కి పౌరసతులు మహీపాలుని మీఁదం జల్లుకమలదళంబులు తత్కటాక్షంబులతోడం గూడ మేనం బడిన నమ్మేదినీనాథుండర్జునునితోఁ దాఁకం దలంచి నంతమాత్రంబున దేవేంద్రుం డయ్యెనో యనం జూపట్టె. అయ్యవసరంబున సుధన్వుం డనం బరఁగిన

—సుధన్వుఁడు సంగరమునకు రాక జాగు సేయుట.—

యతని మూఁడవకుమారుం డాహవంబునకుం గట్టాయితం బై తల్లియొద్దకు వచ్చి వందనంబుచేసిన నయ్యంబ నెయ్యంబువఁ గౌఁగింటం జేర్చి కులంబునకుం గీర్తి తెమ్మని పంపివం దనకు నగ్రజ యగుకువలాదేవికి మ్రొక్కిన నాయమ్మయు నట్లదీవించి తామసింపక తండ్రివెంటం జను మని పంపు టయు సంతసంబుతోఁ దన మోహంపుటింతి యగు ప్రభావతి చెంగటకు వచ్చి సంగరంబునకుం బోయివచ్చెద ననిన

నయ్యింగన కర్పూరనీరాజనంబుల నివాళి దీసి చేతం బట్టు కొని కేళీగృహంబునకుం దోడ్కొనిపోయి వలపు దెలుపు కలికివాలుఁజూపులం జూచుచు జాఱుపయ్యెద సవరించుచుఁ జెదరిన ముంగురులు కొనగోట దిద్దుచు రతికేళికౌతుకంబు తెలియంబడఁజేసిన నారాకుమారుండు బోఁటీ! కిరీటిం గెలువక నిన్నుంబొందునది లేదనిన నమ్మగువ చిఱునగవు మొగంబునకు వింతసొగసు సంపాదింప నీవు సకల ధర్మంబులం దెలిసినవాఁడవు. నేనిన్నవింపఁదగిన దేమున్నయది! ఋతుధర్మంబు దాఁటవుగావున విన్నపంబు గావించితిని. నాకోర్కి నెఱవేర్చి పోవుట యుక్తంబని కౌఁగిలించికొనిన సుధన్వుండు నిజసతిం జూచి దివాసురతంబుధర్మంబుగాదు. రాజు మహోగ్రశాసనుండు. రణభేరీనినాదంబు విని వినకమున్న పురంబునందలి సైన్యపతులెల్లఁ గరితురగస్యందన వీరభటులతోడం గూడఁ గదనంబునకుం జనిరి. నేను వెనుకఁ జిక్కిపోయితినేని చండశాసనుం డైనమండలేశ్వరుండు పురోహితులకు నొప్పగించు, వారలు నిర్దయాత్మకులై తప్తతైల కటాహంబునం బడవై చెదరు. రమణీమణీ నీఋతువాసరంబులు పెక్కుగలవు గాన నేఁటికిఁ గిరిటిం జయించివచ్చెద. నేఁడు దక్కదినంబు లేకయున్నయదియె? అనిన నయ్యిందువదన కందర్పబాణ బాధిత యై నేఁటితోడం బదియాఱుదినంబులు నిండె నింక ముందర ఋతుదినంబులు లేవు. తండ్రి తిథి యైనను భార్యయెడ

ఋతుకాలగమనంబు సేసిన దోషంబు లేదని శాస్త్రవచనంబులు గలవు. అదియునుంగాక యిది తెల్లవాఱుజాముగాని సూర్యోదయంబు గాలేదు. కావున దివాసంగమ దోషంబును లేదు. కయ్యంబునకుం బోక వెనుకఁజిక్కిన, శంఖలిఖితులు కాఁగిన నూనెతొట్టెలోనం బట్టి వైతురని భయపడియెద వేని ఋతుకాలంబు తప్పిన భ్రూణహత్యాదోషంబు వచ్చునందుచే యమలోకంబునఁ దప్తతైలకటాహంబునఁ గూలవలయు. కాకున్న నిప్పుడే మదనవేదనచే శరీరంబు నిలువదు. నామాట జవదాఁటి పోయితివేనియు స్త్రీహత్యయు భ్రూణహత్యయు రెండుదోషంబులును బ్రాపించుచున్నయవి" యని పలుకుచుఁ గులుకు బెళుకుఁజూపుల జంకింపుచుఁ గరకంకణంబులు మొరయఁ జనుగుబ్బలందు హారంబులు మెఱయ నెఱికురులు విరియ రయంబున బింకంపుఁ జనుగుబ్బ లురమ్మునం జేర్చి కౌఁగిటం బొదివి గందంపుఁజెట్టునం జుట్టిన చిలువచెలువ చందంబునఁ దల్పంబునంబడఁ గెడపుటయు రాజనందనుం డాకుందరదన మాట జవదాఁటఁజాలక రతికేళిం దనియించె.

తదనంతరంబ సుధన్వుండు సత్వరంబుగా వెలువడి వచ్చుటయు నంతలో హంసధ్వజుండు తనకుమారుండైన సుధన్వుండు తోడరాకుండుటవలన మండిపడుచు దండధరకింకరులంబోని లంకెనాయకులవంకఁ గనుగొని నాయాజ్ఞనుల్లఘించిన సుధన్వునిం బట్టుకపోయి పురోహితు

లైనశంఖలిఖితుల కొప్పగింపుఁడు. ఇంచుకయు శంకింప వలవ దని నిరుత్తరంబుగా నాజ్ఞాపించుటయు వారలు చంపకాపురంబున కరుగుదెంచుచు ముందట సఫలీకృత మనోరథుండు నాహవోత్సవసమున్నతుండు నై కవచకార్ముకంబులు ధరియించి కవదొనలు బిగియించి కరత్రాణంబు నంగుళిత్రాణంబును బూని సింగంపుఁగొదమకైవడిం జనుదెంచు రాజకుమారునింగాంచి మ్రొక్కి " సుధన్వా! నీవు రాజశాసనంబు మీఱి వెనుకం జిక్కితివి గావున నీయెడ మిగులం గోపించి భూనాయకుండు నిన్నుం గట్టుకపోయి ధర్మశాస్త్రగురువు లైన శంఖలిఖితుల కొప్పగించి రండనె'' ననవుడు సుధన్వుండు తండ్రియాజ్ఞ దాటిన కుమారుఁడు, నేలినవాని యానతి మీఱిన బంటు నేమి చేసినఁ జెల్లు. తండ్రియు ధరణీవల్లభుండు నైన యమ్మహారాజు నానతిఁ జేయుటయె జన్మఫలం బని రథంబు డిగ్గుటయు నధిజ్యకార్ముకుండు నాబద్ధకవచతూణీరుండు నఖిలభూషణ భూషితుండు నంగజాకారుండు నైనయక్కుమారునిం బెడ కేలు గట్టి పట్టికొనిపోయి బ్రాహ్మణోత్తములైన శంఖలిఖితుల ముందరఁ బెట్టి "యితండు రాజాజ్ఞ మీఱి వలరాజు నాజ్ఞకు లోఁబడి కృష్ణపాదకమలంబులఁ జూడవలయు ననెడివేడుక లేక తనచేడియతోఁ గ్రీడారతుం డై వెనుకఁ జిక్కెం గావున నితనిఁ దప్తతైలకటాహంబున వైవుం" డని పలుకుటయు లిఖితుం డగ్రజుం డైన శంఖునిం జూచి భూమిలోన నేమనుజుండు తనపలికిన

పలుకు నిజంబు సేయక తప్పించు నమ్మనుజునకు రౌరవాది నరకంబులు సిద్ధించు. తొల్లి సత్యంబు నిర్వహించుటకునై తనరాజ్యం బంతయు విశ్వామిత్రున కొసంగి కుమారుని భార్యను గాశిలో విక్రయించి తానును జండాలునిచే విలువఁబడి సత్యంబు ప్రతిష్ఠించిన హరిశ్చంద్ర నరేంద్రుని విన లేదా! యట్లే రామచంద్రుండును సత్యపరిపాలనంబునకై రాజ్యంబు త్యజించి వనంబునకుం జనియె. దశరథుండును కైక కిచ్చినవరంబులు దప్పకసత్యంబు నిమిత్తంబుగాఁదనువు దొఱంగె. సత్యంబు దప్పిన రాజసేవవలనఁ గోటివేలు వచ్చినం గాదు. సజ్జననిందితం బైన యసత్యంబున గొగ్గనట్టిరాజు చేసిన పాతకంబులు పురోహితుం జెందు. పతి యాజ్ఞ మీఱినయెడ మిత్రుం డైనను బుత్త్రుం డైనను దల్లి యైనను దండ్రియైనను బాంధవు లైనం దండనార్హు లగుదురు.

—:సుధన్వుఁడు తప్తతైలకటాహమున దిగుట:—

అని చెప్పిన విని శంఖుండు "నట్లచేయుం డగిసయుని. రాజకుమారకా! నీమనంబున కెట్లు తోఁచుచున్నది" యనిన సుధన్వుండు చిఱునగ వంకురింప ధనుర్బాణంబులు క్రింద వైచి కవచంబు సడలించి కవదొనలు వదలించితొల్లి పరవీరులం జయించి తెచ్చినరత్నభూషణంబు లుజ్జగించి శ్రీకృష్ణపాదారవిందసమర్పితంబు లైన తులసిమాలికలుపద్మాక్షమాలికలుకంఠంబునంగదియించి శ్రీహరిపాదతీర్థంబులు

గ్రోలి కమలాక్షుండును ద్రిలోకాధ్యక్షుండును గనకాంబర ధారియు యోగిజనహృదయపద్మవిహారియు నగుశౌరినిం జేరఁ్గొని యుపనిషద్వచనంబులచే నద్దేవునిం బ్రస్తుతించుచు నీలమేఘశ్యామలంబును గోటిమన్మథోపమానంబును బూర్ణచంద్రవదనంబును నాశ్చర్యకరంబు నైనశ్రీమన్నారాయణమూర్తిని హృదయపంకజంబునం గుదురుకొలిపి సోపానంబులు గట్టినయట్టి నూనియతొట్టియొద్దకుంబోయి సెగలచే నలుదిక్కులం గప్పుచుఁ బొగలెగయ నుడుకునట్టి తైలంబు కేలం ద్రోయుచు మదగజంబు సరోవరంబు సొచ్చుచందంబున మొదటిమెట్టునకుం దిగి రెండవమెట్టునకు నడుగుపెట్టి మూఁడవమెట్టునకుం బోయి నాలవమెట్టున నిలుచుటయు నగ్నిమయంబైన యత్తైలంబు కుత్తుకబంటి యయ్యె. అప్పుడతనివదనంబు యమునాజలంబునం గనుపట్టు కమలంబు కరణి నతిమనోహరంబై యొప్పె. వ్రేలెత్తి చూపఁగూడని యాస్నేహంబును, శ్రీ విష్ణుభక్తుండగు రాజకుమారునితో స్నేహంబు సేసిన చందంబునఁ జంద్రకిరణంబులకై వడిఁబన్నీటిధార తెఱంగునఁ జందనరసంబుచందంబున నతిశీతలంబై యుండె. జనమేజయనరేంద్రా ! హరిదాసుల కసాధ్యంబేదియుం గలదె!

—: దేవతలు సుధన్వునిపైఁ బూలవాన గురియుట.:—

అవ్విధంబు గాంచి శంఖలిఖితు లాశ్చర్యంబు నొంది యిక్కుమారుం డిట్లుండుట యింద్రజాలంబుగాఁ దోఁచు

చున్నయది. లెస్సగాఁ బరీక్షింపవలయు నని నారికేళఫ
లంబు లత్తైలంబులోన వైచుటయుఁ బెటాలునం బెటిలి
యించించుక చిద్రుపలై యెగసి చుట్టు నున్నజనులపయిం
బడిన బొబ్బలెగసి బొబ్బరించుచుం బరువెత్తిరి.అంతయుం
గాంచి యమ్మహామునులుహరిభక్తియుక్తుండైనరాకుమారుని
మహత్త్వం బెఱుంగక యవమానించిన మహాపాపం బేమి
టం దీఱు? జ్వాలామాలికాభీలం బైనయాతైలంబులోనం
బడుటయె ప్రాయశ్చిత్తంబని యయ్యిరువురుఁ దోడనెయా
తైలకటాహంబునం దుమికిరి. అపు డమ్మువ్వురి మీఁద దేవత
లు పుష్పవర్షంబులు కురియించిరి.ఆసమయంబున నింద్రాది
దిక్పాలకులు సుధన్వునిం జూచి "కుమారకా! నీవు ప్రహ్లా
దు నంతవాఁడవు. నీస్వరూపం బెఱుంగక యవమానంబు
నేసిన యమ్మునులకు నీపాదారవిందంబులుసోఁకినయాతైలం
బులో మునుంగుటయె గంగాస్నానంబు నేసినగతిం బ్రాయ
శ్చిత్తం బయ్యె, నింక బయలువెడలుం" డనుటయు రాజ
పుత్త్రునితోడం గూడ నమ్మునులు బయలుదేఱి ధౌతవస్త్రం
బులు ధరియించి హంసధ్వజునిచెంతకువచ్చి యతనివృత్తాం
తంబు వివరించుటయు నతండు సంతోషభరితమానసుం డై
తప్తతైలకటాహంబున నవగాహనంబు నేసిననిన్ను శ్రీహరి
రక్షించెం గావున నీవు ధన్యుండవు. నాయాజ్ఞ చెల్లించి
సత్యంబు నిర్వహించి వచ్చితివి. కావునఁ గులోద్ధారకుం
డవు. సేనాధిపత్యం బొసంగెద నని యాలింగనంబు నేసినఁ

దండ్రికిం జాఁగిలి మ్రొక్కి కరంబులు మోడ్చి తోంటికరణి సముజ్జ్వలభూషణంబులు ధరియించి నిజతేజంబునం దశది శాభాగంబులు ప్రకాశింపఁజేయుచుఁ దన్ను దండించిన శంఖలిఖితులుం దక్కినజనంబులు బహువిధంబులం గొని యాడ రథంబు నధిరోహించె.

—: హంసధ్వజుఁ డధ్వరాశ్వముఁను బట్టించుట :—

అవ్విధంబున సుధన్వుండు తండ్రిచే సేనాధిపత్యంబు గైకొని రథచక్రసముద్భవంబులగుదువ్వలచేసప్తసాగరంబు లిత్తింకు లింకంజేయుచు భేరీపటహ డిండిమ శంఖ కాహళా దివాద్యధ్వనులచే దిగ్గజంబులఁ జెవుడుపడం జేయుచు బాల సూర్యకిరణప్రకాశంబు లైనమణిమయధ్వజంబుల యౌన్న త్యంబుచే నాకాశంబు తూంట్లు పడంజేయుచుఁ గైదువులు సారించుటవలనం బొడము మిఱుంగుఱులచే సూర్యునకు వేఁడిమి సేయుచుఁ జటులధాటీని ఘాటంబు లైనచతురం గబలంబులు నలుదిక్కులం గ్రమ్మి చనుదేఱ విలునారి మ్రో యించుచు నాహవోత్సాహంబున వెడలు నగ్గలికఁ గనుం గొని హంసధ్వజుండు సంతసంబున నయ్యధ్వరాశ్వంబుం బట్టి తెప్పించి పద్మవ్యూహమధ్యంబున నుంచి తాను ముం దుగాఁ గయ్యంబువేడుక మొగంబునం జెంగలింపఁ గదలి వచ్చి ధ్వజంబు లనియెడి వృక్షంబులును బతాక లనియెడి తీఁగెగుంపులును వీరభటు లనియెడి సింహశార్దూలంబు లునుం గలిగి ప్రవేశింపఁ గూడనికతంబున మహారణ్యం

బునుం బోలె రాజాధిరాజకిరీటంబులం దాపినదివ్యరత్నం బులనియెడి గ్రహంబులును గజకదంబకంబు లనియెడి మేఘంబులు నర్జునురథం బనియెడి మార్తాండమండలంబును గలిగి గగనంబునుంబలె నంటం దరంబు గాక వెలిగొడుగు లనియెడి తెల్లదామరలును జామరంబు లనియెడు రాజహంసంబులును ఖడ్గకాంతు లనియెడి వారిపూరంబులును యోధవీరులనియెడి బలు మొసళ్లునుం గలిగి మహాతటాకంబు చందంబున దురవగాహం బగుచుఁ జతురంగంబు అనియెడి తరంగంబులును గజంబులను పర్వతంబులును రథంబు లను ద్వీపంబులును విజయ జయభుజప్రతాపం బనియెడి బడబానలంబునుం గలిగి సముద్రంబుకరణి నపారం బగుచు వృషకేతనుండును బ్రద్యుమ్నుండును యౌవనాశ్వుండు ననుసాళ్వుండును నీలధ్వజుండును సువేగుండును మేఘవర్ణుండును మొదలైన మహారథులచే దుర్నిరీక్ష్యంబును నైవచ్చు విపక్షసైన్యంబు నాలోకించె.

అప్పుడు సవ్యసాచి ప్రద్యుమ్నునిం జూచి "కృష్ణనందనా! నాపరాక్రమంబు మీర లందఱుం గనుంగొనుఁడు దురవగాహం బైన యీపద్మవ్యూహంబు చొచ్చి చెండాడి తన్మధ్యంబున నున్నమఘాశ్వంబు గొని తెచ్చెద" ననినఁ బ్రద్యుమ్నుండు పార్థునితో నిట్లను "మాతండ్రియగువాసుదేవుండు సేనాపతిత్వంబుగా నన్నుంగూర్చి మీవెంటనంపుటకుఁ బ్రయోజనం బేమి? ఎదుటిదళంబు లెల్ల నాపాలు

నేసి మీరు కనుంగొనుచు నుండుం డనుటయు వృషకేత నుండు క్రీడి నవలోకించి పుడిసెఁడునీళ్ళు చల్లిన నడంగిపో యెడుధూళికిఁ గాలమేఘంబులు వర్షింపవలెనే! తెప్ప వేసి నంబడి పోవు దోనులమీఁద గరుత్మంతుం డెత్తి రావలయు నె? ఈరాజు మీకు సమానుండు గాఁడు, మీరీతని మీఁదఁ జేయిచేసికొనం బనిలేదు. నేనె యీతనిం గెల్చి యధ్వ రాశ్వంబు దెచ్చెద.

—: వృషకేతుసుధన్వులయుద్ధము :—

అని పలికి యర్జునుని వీడ్కొని యరదంబు నధిరో హించి కిఱుకిఱుం దిరుగురథచక్రంబువలనంబొడమినమిఁణుం గుఱు లంబరంబున కెగయ గుణంబు సారించుచు వచ్చునా వృషకేతనుంజూచి సుధన్వుండు, "ధ్వజంబునందువృషభాం కం బున్నయది గాన నితం డర్జునుండుగాఁడు." అని తలం చుచు నాతనిం జూచి "ఓయీ! నీకులగోత్రనామధేయంబు లెఱుంగక నీతోడం గదనంబు సేయనొల్ల" ననిన, వృష కేతనుండు, కశ్యపమహాముని మాకుం గూటస్థుండు. నాచే త నిహతుండవై యెవ్వానిబింబంబుభేదింపంగోరెద వాసూ ర్యుండు మాతాత, త్రిలోకాధిపతి యైన దేవేంద్రుం డెవ్వా నికడకు యాచకుం డై వచ్చి యాచించె నట్టి దాతలదా తయు శౌర్యసముదీర్ణుండు నగుకర్ణుండు మాతండ్రి. నా పేరు వృషకేతుం డనిన విని సుధన్వుం డి ట్లనియె. మధు చ్ఛందనుం డనుమహాముని మాకుం గులగురుండు, హంన

ధ్వజుండు మాకుం దండ్రి. నాపేరు సుధన్వుండు. మన యిరువురకు జోడు తగి యున్నయది. అనిన విని రోషావేశంబునం గన్నులు జేవురింపఁ గోదండంబు మండలాకారంబుగాఁ దిగిచి సానలందీఱిన మెఱుంగు వాలమ్ముల వానలు గురియించి చుట్టు నున్న సైన్యబులం జెల్లాచెదరుగాఁ గొట్టి యయిదువిశిఖంబులు చాపంబునం గూర్చి విల్లు ఖండించి కేతనంబు దునిమి సూతుని ప్రాణంబులు గొని తురంగంబులం గూల్చి ,రథంబు చక్కాడుట యు, సుధన్వుండు వేఱొండు రథం బెక్కి విల్లు గైకొని యయిదు బాణంబులచే వృషకేతురథంబు దూరంబునం ద్రోచి విల్లు తునియలు సేసి సేనలకుం జేయి వీచుటయుఁ జుట్టుముట్టి పరిఘంబులు పట్టిసంబులు గదలు గుదియలు ముసలంబులు చంద్రహాసంబులు మొదలగు కైదువుల వానలు గురియుటయుఁ జిక్కువడియునుం జేవ చెడక సూర్యపౌత్త్రుండు మధుసూదనునిపాదారవిందంబులుడెందంబునం దలంచుచునొక్క రథికునిచేతివి ల్లొడిచి తీసికొని దురం బొనరించుటయు సుధన్వుం డతని సాహసంబునకు సంతసించుచు వజ్రాయుధంబు చందంబున జ్వాలామాలికాభీలం బైన యొక్క బాణంబు శరాసనంబున సంధించి యాకర్ణాంతంబుగాఁ దిగిచి యేయుటయు నడుఱొమ్మునం దాఁకి వెన్నున వెడలి భూతలంబున మునింగినం గర్ణనందనుండు కీలెడలిన జంత్రంపుబొమ్మ చందంబున రథంబు మీఁదఁ బడి బలుమూర్ఛనొందె.

—: ప్రద్యుమ్నుఁడు సుధన్వునిం దాఁకి మూర్ఛిల్లుట. :—

అంతఁ బ్రద్యుమ్నుండు దుర్వారభుజాగర్వంబునం దేరు దోలించి నిలు నిలు మని యడల్చి యయిదునారసంబుల నొప్పించి నాల్గు సాయకంబుల నాలు గశ్వంబుల నిరువది తునుకలు గావించి మూఁడు బాణంబుల నొగలు ఖండంబులు చేసి యొక్క కాండంబునఁ గోదండంబు రెండు ఖండంబు లొనర్చి యార్చుటయు సుధన్వుండు ప్రద్యుమ్ను కరకౌశలంబునకు మెచ్చుచుఁ బదాఱుబాణంబు లొక్కపిడికిటం బట్టి విల్లు దునిమి సారథిం గూల్చి ధ్వజంబు చక్కడిచి తురంగంబులం గీటడఁగించి బలుపిడుగులంబోని మూఁడు తూపులు నడురొమ్మునం గ్రుచ్చి యచ్యుతునిపట్టిని నొప్పించి సింహనాదంబు సేసె. ఇవ్విధంబునఁ బత్తులగతి గగనంబున కెగయుచు సర్పంబులవలెం బెనఁగొనుచుఁ బొట్టేళ్లకై వడి గిట్టలతోడనె చండించుచు నిరువురు నొక్కుమ్మడిఁ గరలాఘవ శరలాఘవంబులును లక్ష్యశుద్ధి దృఢచిత్రత్వంబులును మెఱయ విలువిద్య నేర్పులు చూపుచుఁ బెద్దయుండ డవు పోరిపోరి మూర్ఛాపరవశులై వ్రాలిరి,

—: కృతవర్మాదులు సుధన్వునిం దాఁకుట :—

అంత సుధన్వుండు శీఘ్రంబున దెప్పిఱి వేఱొక్క యరదంబెక్కి సేనం గనుపుగొట్టుచు నున్నఁ గృతవర్మ యెడదాఁకి తొమ్మిదితూపులు నిగిడించిన సుధన్వుండు నడుమనె ఖండించిన వెండియుఁ గృతవర్మ మూఁడు వాఁడితూ

వులు మఱియు నైదుసాయకంబులు నించిన హంసధ్వజనం దనుం డది గణింపక కృష్ణసర్పంబులంబోని తొమ్మిదివాల మ్ములనిగిడించిన సహింపంజాలక తేరుడిగ్గి పలాయనంబు గావించె.

అనంతరంబ యనుసాళ్వుం డెదిరించి యదలించి నిజ బాహాబలంబు గాన్పించి శరవర్షంబులు గురియించి మఱియు నవ్వీరాగ్రేసరుం డుభయదళంబులుం గొనికూడ నేను బ్ర యోగించు నీయస్త్రంబు సైరింతువేని నిన్ను మెచ్చెద నని యుచ్చరించి బడబానలజ్వాలికయుం బోలె మృత్యుజిహ్వ యుం బోలె వాఁడి మిగులు వాలికతూపు నడుఱొమ్మునకు గ్రుచ్చుటయు, సుధన్వుండు ధైర్యంబు వదలక నిలిచిన నను సాళ్వుండు వెండియుఁ బ్రచండకాండంబు లొండొండ నిగి డించి యట్టహాసంబు సేసిమూఁడువాఁడితూపులు ఱొమ్మున నాటించుటయు సుధన్వుండు మూర్ఛిల్లి తోడనే తెప్పిఱి యయ్యనుసాళ్వునిపయి శరవర్షంబులు గురియించి మూర్ఛ నొందించి సేనల విరియించి యంతకుని చందంబునఁ గోటి సైన్యంబులం గనుపుగొట్టుచు నక్కజంబుగఁ జెక్కు నారసం బులు పఱపిన దొర్లినమావంతులును దెల్లినమత్తవారణంబు లును జెక్కుచెక్కలైన చక్రకూబరాదులును విశ్లథంబులైన రథంబులును విదారితంబు లగు కేతనంబులును విధ్వస్తంబు లగుకార్ముకంబులును గూలినరథికులును గొఱప్రాణంబుల తోడం బొరలు మహారథులును శిరంబులు దెగిపడినరాహు

త్తులకబంధంబులు మోచుకొని నలుదిక్కులం బఱచుచుఁ దెగినమోరలు విఱిగినఱొమ్ములు పగిలినప్రక్కలు తెగిన తోఁకలు ఖండితంబు లైనపాదంబులు శిథిలీకృతంబు లగు సంధిబంధంబులుం గలిగి పొరలు సైంధవంబులును శిరం బులు నురంబులు జానువులు జంఘలు కర్ణంబులు కపోలం బులు వెన్నులు కన్నులు పచ్చడికిం దఱిగినచందంబున శక లంబు లైన నెత్తురులు గురియ వీరమార్గంబు గైకొని కాలుం గాలుం బెనఁచుక పడ్డవీరభటులును విఱిగిన యీఁ కెలు విటతాటనంబు లగుకేడెంబులును ఖండంబు లైన కోదండంబులును దుత్తుమురు లైనకత్తళంబులును జందంబు మాలిన చిందంబులును జూర్ణంబు లైనశూలంబులును భం గంబు లైన ప్రాణంబులును నింతింత లైన కుంతంబులును జక్కులైనచక్రంబులునుం గలిగి యాభీలం బైన సమరభూ భాగంబునఁ దెట్టువలు గట్టునట్టులతోడం గూడ గట్టు పొర లినట్టు మట్టుమీఱిన నెత్తురులును గైరికాదిధాతురంజితంబు లగు హిమశైలకటకభాగంబుల బహువిధంబులు గాఁ బ్రవ హించుభాగీరథీ ప్రవాహంబులకరణింగనుపట్టె. ఆసమయం బున సాత్యకి సుధన్వునిం దాఁకి నిశితాస్త్రవర్షంబులు గురి సిన వాఁడునుం దోడ్తోన మరలించిన శైనేయుం డెనుబది నారసంబులు ప్రయోగించి యతని యరదం బల్ల కావించె.

అవ్విధంబున విరథులై సాత్యకిసుధన్వులు వేఱె యర దంబు లెక్కి చలంబు డింపక యొండొరుల పైమలువు

లఱువుళ్ళు సేసి నెత్తుటం జొత్తిల్లుచుఁ బూచిన మోదుగుల చందంబునఁ బొలుపొందిరి. అంత సుధన్వుండు సాత్యకి నదల్చి మృత్యుదంష్ట్రాకరాళంబును జ్వాలత్పావకసంకాశంబును గనకమాలికాలంకృతంబు నైనశక్తి కేలం గైకొని వ్రేయుటయు సాత్యకి చేష్ట లుడిగి వసుధాతలంబున వ్రాలె. అంతఁ గౌంతేయమధ్యముండు శత్రుభీకరం బైనయాకారంబునం గనుపట్టుచు సుధన్వునిం జూచి నృపాలకుమారకా! ద్రోణభీష్మకర్ణాది మహాయోధవీరులతోడం బెనంగి వారల బలపరాక్రమంబు లెఱింగి యున్నవాఁడ. నీవిక్రమం బంతకంటె నతిశయించి యున్నయది యనుటయు నధిజ్యధన్వుం డగుసుధన్వుండు కిరీటీ! నీబోఁటి మేటివీరునకుఁ బెక్కుమాట లేమిటికి? తొల్లి కృష్ణసారథ్యంబున జయంబు చేకొంటివి. ఇప్పు డొంటిచా వచ్చినాఁడవు. చక్రంబు కేలంబూని చక్రి నీకు సహాయుం డయ్యెనేనియు హయంబు విడువం గలవారము గాము. శ్రీకృష్ణదేవునకుం బ్రియంబుగా మాతండ్రి హయమేధంబు సేయుంగాక.

—: అర్జునసుధన్వులయుద్ధము. :—

అనిన విని ఫల్గునుండు క్రోధారుణలోచనుం డై నూఱు నారాచంబులు నిగిడించిన నతండు నన్నియు బాణంబుల వానిం ద్రుంచి పదితూపులు మేనం గీలించి నవ్విన నవ్వీరుండును గాలమేఘంబు చందంబున శరవర్షంబు లపారంబుగాఁ గురిసిన సుధన్వుండు మండలీకృతశరాసనుం డై మిన్ను

నేలయు దిక్కులు విదిక్కులు శరపరంపరలచే ముంచె. అంతఁ గుంతీనందనుండును గాలకూటవిషాగ్నిజ్వాలలం బోని కీలాజాలంబులం బొలుపొందు నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన హంసధ్వజకుమారుండు సప్తకులమహామేఘంబులు పుట్టింపం జాలునట్టి పర్జన్యాస్త్రంబు ప్రయోగించుటయు ధళధళాయమానంబు లైనమెఱుపులు పెళపెళ మనియుఱుమునుఱుములును బెనుగుండ్లం బోని వడగండ్లును మిక్కుటంబుగా దిక్కులు క్రిక్కిఱియం బాఱుమహాప్రవాహంబులును నెడ నెడం బడు బలుపిడుగులునుం గలుగుటయుఁ దురంగంబులు మాతంగంబులు శతాంగంబులు పదాతిసంఘంబులును బక్కెరలు పల్లంబులు జోళ్ళు ఛత్రంబులు చామరంబులు వెల్లింబడిపోవ మిఱ్ఱుపల్లంబును నొక్కటిగా బహుప్రవాహంబులు పాఱం దొడంగిన నింద్రనందనుండు వాయవ్యాస్త్రంబుచే నయ్యస్త్రంబు మాయించిన హంసధ్వజకుమారుం డర్ధచంద్రబాణంబున నర్జునుని సారథిశిరంబు ఖండించి దీప్తపావకసదృశంబు లైననిశితవిశిఖంబుల నాపాదమస్తకము గ్రుచ్చి యార్చుటయు రథవాహంబులు కలంగంబడి నలుదిక్కులు పఱచుచుఁ జీకాకుపడుటయు నర్జునుండు

—: శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ బ్రత్యక్షమగుట :—

దుస్తరం బైనయాసంకటంబు నిస్తరింపం జాలక, ‹ఆపదుద్ధారకా! ఆదిదేవా! అనంతా! అనంతశయనా! అంబుజనాభా! అచ్యుతా! హరీ. శ్రీకృష్ణా! నిన్ను నమ్మినవాఁడ.

లక్కయింటం జిక్కు వడకుండఁ గౌరవసభాస్థలంబున ద్రౌపదికి మానభంగంబు గాకుండ నడవుల నిడుమలం బడునవుడాపదలం బొరయకుండ భీష్మద్రోణ కృపాశ్వత్థామకర్ణాది యోధవీరుల యస్త్రాగ్ని జ్వాలలం గ్రాఁగకుండ సైంధవవధంబునఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ రక్షించి సకల సంకటంబులు నెడఁబాపితివి, త్రిలోకాధ్యక్షా పంకజాక్షా! యిప్పుడీసంకటంబు తొలంగించి రక్షింపవే రక్షింపవే యని ప్రార్థించుటయు భక్తరక్షణ విచక్షణుం డగు కమలాక్షుండు తెలిదమ్మి రేకులం దెగడుచుఁ గరుణామృతంబు వెదచల్లు చల్లనిచూపులఁ జెన్ను మీఱయు కన్నులును బున్నమచందురుం బురుడించు నెమ్మొగంబున నందంబు మీఱుమందహాసంబును గలుముఁల జవరాలికి నిజనివాసంబైన వెడందయురంబున బాల్యసూర్యబింబవిడంబకం బైన కౌస్తుభంబును నద్భుతంబు లైనపరిమళంబులం గుప్పళించు వనమాలికయు శార్ఙ్గకోదండమౌర్వీకిణాంకంబులునుఆజానుదీర్ఘంబులు కంకణకేయూరకటకాంగుళీయకాది నానాభూషణవిభూషితంబులును సర్వాభీష్టప్రదాయకంబులును లోకరక్షా దీక్షితంబులునుశుభలక్షణలక్షితకరాంగుళీవిలసితంబులునైన చతుర్భుజంబులును జిగురుటాకులంబోలి మానిమానసధ్యానయోగ్యంబులును వేదాంత వీథీసంచార యోగ్యంబులు నగు మృదులపాదంబులును గనుపట్ట నీలమేఘశ్యాములుండును బీతాంబరధరుండును గోటికందర్పలావణ్యనిధియును బ్రస

న్నముఖారవిందుండు నైనగోవిందుండు తత్క్షణంబ ప్రత్యక్షంబయ్యె.

అంత ఫల్గునుండు సాష్టాంగ వందనంబు గావించి కరంబులు మొగిచి కరుణారసంబు వెదచల్లు చల్లనిచూపులం గటాక్షించి యాదరంబున నిటలతటంబున ఘటియించి యానంద బాష్పంబులు ఱెప్పల నుప్పతిల్ల రోమాంచకంచుకితగాత్రుండై గద్గద కంఠంబున నేమియుఁ బలుక నేరక యూరక యున్న యయ్యర్జునుని గాఢాలింగనంబు గావించి సారథ్యంబునకుం బూని యాముకుందుండు పగ్గంబులు బిగియం బట్టి మునికోలం గేలంగైకొని తురంగంబులకందంబులప్పళించి తేరు మరలించి యర్జునునిం జూచి యువక్రపరాక్రమశాలి వైన శత్రునిం జయింపుము శీఘ్రంబు లెమ్ము జయంబు చేకొను మనుటయుం గాండీవి వెక్కి గాండీవంబు సజ్యంబుగావించిజ్యానాదంబులచే రోదసీకుహరంబుపూరింపుచు దేవదత్తం బొత్తుటయుఁ గమలాక్షుండును బ్రళయ

## —: అర్జునసుధన్వులప్రతిజ్ఞలు. :—

సమయ జలధర గంభీరనిస్వనంబైన పాంచజన్యంబు పూరించె. ఇవ్విధంబున యుద్ధసన్నద్ధులును రథికసారథులునై వచ్చు నాకృష్ణుల నిరువుర నుపలక్షించి సుధన్వుండు వదనారవిందంబున మందస్మితంబు దళుకొత్త శక్రనందనా! చక్రపాణి నీకు సహాయుండై యుండఁ బరాక్రమించుట కేమి భయంబు? ఉభయదళంబులు వృథా సమయ నేటికి! రిత్త

యంపపోకడకయ్యం బెంత తడవు? ఇన్ని బాణంబులలో నిన్ను జయించెద నని ప్రతిన గావింపు మనినఁ బురందర నందనుండు రాజనందనా! మూఁడుబాణంబులచేత నీశిరంబు పడఁ గెడపెద నటుచేయం జాలనైతి నేని తండ్రియుం దాతయు మొదలైన మాపూర్వులు పుణ్యవిహీనులై నరక కూపంబునఁ గూలుదురు గాక యని ప్రతిన గావించుటయు నీ వేయు మూఁడు బాణంబులు నే నడుమ ఖండించెద. ఇట్లు సేయ నైతి నేని నేనును మాపెద్దలును నాచరించిన సుకృతంబులు రాక్షసుల పా లగుంగాక. పూజావిరహితుండైనదురాత్ముండును, వసిష్ఠసమానుండైన బ్రాహ్మణునిం జంపిన బ్రహ్మఘాతుకుండును బొందుదుర్గతిఁ బొందం గలవాఁడ నని త్రివాచకంబుగాఁ బ్రతిన గావించి సుధన్వుండు సువర్ణపుంఖంబులును గంకపత్రవిచిత్రితంబులు నగునూ ఱమ్ములొక్కముష్టిం బట్టివి ల్లాకర్ణాంతంబుగాఁ దిగిచి యదుకులాధ్యక్షుని వక్షస్థలం బుపలక్షించి యేయుటయు నాబాణంబునకుం గట్టిన బలుఱెక్కగాడ్పుల నయ్యరదంబునన్నూఱు మూరలక్రిందికిం జని భూనభోఽంతరాళంబు లేకంబుగా దువ్వ గ్రమ్ముటవలన రథ రథ్య కపిధ్వజంబుల తోడం గూడఁ గృష్ణార్జునులు గానం బడరైరి. అప్పుడా సుడిగాలి విసలోనం దగిలి యారథంబు బొంగరంబుచందంబునఁ గుమ్మరిసారె తెఱంగునం దిరుగుచు నుండెఁ గాని నిలువదయ్యె. అప్పుడు విశ్వంభరుండైన శ్రీకృష్ణదేవుండు

తన యుదరంబునందున్న బ్రహ్మాండకోటులు బరువుతోడం గూడ నయ్యరదంబు చిక్కుండ్రొక్కి యెట్టకేలకుఁ గదల కుండఁగ నిలిపి యర్జునా! పెక్కు బవరంబులుం గని యున్నారము. ఇంత కడిందివీరు నెక్కడం గానము. ఇతండు సత్యవ్రతుండు. పితృభక్తుండు. అదియునుం గాక యేకపత్నీవ్రతుండు. అత్యంత కాముకులమై బహుస్త్రీలోలురమైన నీకు నాకును వీనిన్ జయింపం గూడునే. నీ ప్రతిన యెట్లు నెఱవేఱం గలయది. చిత్తం బుత్తలం బగుచు నున్నయది? యనిన విని కిరీటి నవ్వుచు శ్రీకృష్ణా! నీకటాక్షంబు గలిగనేని యసాధ్యం బేమి యున్నయది? అని పలికి గాండీవి జ్యాసినాదంబు దిక్కులు వ్రక్కలిలం జేయఁ గాంచనపుంఖంబును గాలదండోపమానంబును నైన సాయకం బొక్కటి వింట సంధించి, వానికంతం బుపలక్షించి యేయు నవసరంబున గోపాలదేవుండు మున్ను దాను గోవర్ధనాచలం బెత్తి గోగోపసంఘంబులం గాచినసుకృతఫలంబు నయ్యస్త్రంబున కొసంగిన నదియును గాండీవి కోదండవినిర్ముక్తంబు ప్రళయకాలదండధర దండోపమానంబునునై దిక్కులు విదిక్కులు ఘూర్ణిల్లం జేయుచు మెఱుంగు మొత్తంబులు నుమియుచుఁ గాలదండంబుకరణిఁ బఱతెంచిన నయ్యేకపత్నీవ్రతుండు నంతకంటె మిన్నైనతూపొక్కటి వింట సంధించి ప్రయోగించిన నదియును బక్షీంద్రుఁ డురగంబు ఖండించిన తెఱంగున దాని ఖండించె. తోడనే సుధన్వుండు నిప్పులుగుప్ప

ళించుశరంబు లపారంబుగాఁ గృష్ణార్జునులపయిం గప్పినఁ గిరీటి హాటకపుంఖంబును గోటిసూర్యప్రకాశంబు నగువే ఱొక్కసాయకంబు గాండీవంబునం బూన్చి యేయుటయు నచ్యుతుండు దాను మున్ను పరశురామావతారంబున సకలక్షత్రియుల జయించి చతుస్సముద్రముద్రితం బైనభూవలయంబు కశ్యపునకు ధార వోసినఫలం బయ్యంబకంబున కొసంగిన నదియును బ్రళయకాలానలంబు చందంబున జ్వలింపుచు దుర్వారవేగంబునం జనుదెంచుతఱి హంసధ్వజకుమారుండు తాదృశం బైనబాణం బాకర్ణాంతంబుగాఁ దిగిచి యేసిన గాండీవికాండంబు రెండుఖండంబులై భూమండలంబునం బడియె.

—: అర్జునుండు సుధన్వునితల ద్రుంచుట :—

ఇవ్విధంబున శరద్వయంబు నష్టగుటయుఁ బురుహూతనందనుండు డెందంబునం గ్రందుకొనుచలంబును మచ్చరంబును విచ్చలవిడిం బెచ్చు పెరుఁగఁ గల్పాంతమార్తాండ మండలంబు వేఁడిమిం గ్రేణి సేయు మూఁడవబాణంబు ధనుర్గుణంబునం బూన్చుటయు నప్పురుషోత్తముండు నకాండంబునకుఁబుంఖదేశంబునహిరణ్యగర్భునిమధ్యప్రదేశంబున సమవర్తిసహితుం డగుహరుని బాణాగ్రంబునం దన తేజోవిశేషంబు నశేషంబు నునిచి తొల్లి శ్రీరామావతారంబునఁబితృవాక్యపరిపాలనంబును సత్యవ్రతంబును నేకపత్నీవ్రతంబును శరణాగతసంరక్షణంబునునశ్వమేధాదియాగంబులును

జేసినఫలంబు తత్సాయకంబునం దునిచె. అంతక మున్న రంభోర్వశీప్రముఖు లైనయచ్చరమచ్చెకంటు లమ్మహావీరుం డగుసుధన్వు నెదురుకొనుటకై కానుకలు గైకొని వచ్చిరి. ఇంద్రాదిదిక్పాలకులువిమానారూఢులై యతివేగంబునవచ్చి సుధన్వార్జునుల ప్రతినలు నిరుపురజయసందేహసమరవిజృంభణంబును హర్షాద్భుతభయంబులం బొరలు నంతరంగంబులం బొగడుచుఁ గనుంగొనుచు నుండిరి.

ఆసమయంబునఁ బార్థుండు లయకాలశిఖిశిఖాసంకాశం బైన యాశిలీముఖంబు సంధానక్రియాచాతుర్యంబున సంధించి యేయుటయు మంటకి మింటికి నేకంబుగా మంట లెగయ మిణుంగురులకుప్పల గుప్పాగుప్పనం గుప్పుచు ఛటచ్ఛటశబ్దంబుల భూనభోంతరాళంబులం గ్రక్కతిలం బఱతెంచు నయ్యస్త్రంబు నరవడిం గనుంగొని సుధన్వుండు చండమార్తాండకిరణప్రకాశంబునుదంభోళిసంకాశంబునగు బాణం బొక్కటి వింట సంధించి ప్రయోగించుట యు నక్కాండం బతిరయంబునం బఱతెంచి యర్జునుం డేసిన బాణంబు నడిమికి రెండుతుండంబులు సేసిన నాశరంబు సగంబు తెగి పడియును వేఁడిమియును వేగంబును జెడక శ్రీవాసుదేవుని సంకల్పంబువలన నతిత్వరితంబుగాఁ బఱతెంచి చంద్రబింబోపమానంబును గిరీటకుండలాభిరామంబును వీరరసోన్నిద్రంబును విజృంభితసింహనాదంబు నైన సుధన్వునిశిరంబు ఖండించె.

తదనంతరంబ తత్కబంధంబు బిఱబిఱం దిరిగి రథగజ తురగపదాతిబృందంబులు చాంపకట్టుపడం జేయుచుధరాతలంబునం బడియె. ఫల్గునశరఖండితం బగు నతనిశిరంబు గగనంబున కెగసి గజేంద్రవరదా! గరుడవాహనా! నీరజాక్షా!నిఖిలలోకాధ్యక్షా! దేవకీనందనా! దీనజనాభినందనా!నారాయణా! భక్తత్రాణపరాయణా! 'నమోనమో' యని దివ్యనామసంకీర్తనంబు సేయుచునతివేగంబునవచ్చి శ్రీగోపాలదేవుని చరణపద్మంబులం దుమ్మెదకైవడి వ్రాలె. అప్పు డతనిదివ్యతేజంబు దశదిశలు ప్రకాశింపం జేయుచుం గేశవునిదివ్యదేహంబునం గలసె. కంసమర్దనుండును దన హస్తకంబు కేలం గైకొని హంసధ్వజునిమ్రోల వైచుటయు నమ్మహీధవుండు పుత్రశోకార్తుండై పెద్దయుంబ్రొద్దు వగచి యాశిరంబు గ్రమ్మఱ రుక్మిణీవల్లభునిపాదాబ్జంబులంగదియ వైచుటయునద్దేవుండు దాని నెత్తి గగనంబున కెగుర వైచుటయుం దోడనె యంతర్ధానంబు నొందె.

అంత సుధన్వునిపాటు గనుంగొని చింతావ్యాకులితమానసుండై హాకుమారకా! హాకులోద్ధారకా! మహాగుణభూషణా! మాతాపితృసంతోషణా! మేరునగధీరా! వీరాధివీరా! హాసుకుమారశరీరా! సుజనాధారా! బుధవిధేయా! దానరాధేయా! నందనందనచరణారవిందవందనా! దీనజనాభినందనా! అయ్యయ్యో! నన్నును మీతల్లి *నగతికులం

---

*సనాథుల-మూలము.

జేసి వాసుదేవుని సాయుజ్యంబు నొందితివే! నీవుత్తమోత్తమంబైన దివ్యపదంబున కేగితివి గావున నీకు వగవం బని లేదు. నన్నుం గన్నతండ్రీ! పరాక్రమోపార్జనుం డగునర్జునుని నిర్జించి వత్తువని నీరాక కెదురు చూచుచునుండు మీతల్లితో నే మనం గలవాఁడ. నీరాణి యగుప్రభావతిముఖం బేమని చూడం గలవాఁడ. కుమారా! యనాథుల మగు మాజీవనంబునకు వగచెద మని పలవించు హంసధ్వజుని చెంతకుం జనుదెంచి సుధన్వున కగ్రజుం డైనసురథుండు తండ్రి నూరార్చుచు రాజేంద్రా! శూరుల కాహవమరణంబు మోదకరంబు గాని ఖేదకరంబు గాదు. నీవంటిధీరుం డిట్లు దైన్యంబు నొంద నగునే. నన్ననికిం బంపుము వైరిసేనలం జుట్టుముట్టి కనుపుగొట్టెద. మాధవునిప్రాపున సుధన్వుని వధించిన వాసవతనూజునిం బాఱం దోలెద. కాక యెదిరించెనేని నాతమ్మునికి సహాయంబుగాఁబనిచెద. దిక్కులఁగీర్తినించెద. అని యనేకవిధంబుల హంసధ్వజు నూరార్చి సురథుండు కైదువులు మెఱుంగు లీన జోదులిరుగెలంకులం బలసి చనుదేర నరదంబునెక్కి ద్విరదంబులు తురంగంబులు భటసంఘంబులు నసంఖ్యాతంబులు గాం జనుదేరఁ గుహానాన్నృసింహునికవాకహార్భటులచందంబుగా నందంబు మీఱుచిందంబు పూరింపుచు సింహనాద మేదుర రోదోఽంతరాళుం డై బయలు వెడలియు సుధన్వునిరాకం జూచి మధుసూదనుండు పార్థునుద్దేశించి యర్జునా! దుర్జయ

—సురథుఁ డర్జునునితోఁ యుద్ధము సేయుట.—

కాలభైరవుండునుం బలె మండుచు సుధన్వాగ్రజుం డైన సురథుండు సర్వసన్నాహం బగు సైన్యంబులతోడం గూడ నిదె వచ్చె. వీని నీకె కాదు, బ్రహ్మవిష్ణురుద్రాదుల కైన నెదుర్కొనం గూడదు. తమ్ముని యుమ్మలికమ్మునరోషమ్మునం జనుదెంచు వీనిధాటికిం బ్రథమకబళంబుగా నేమిటికి? మన మీవేళనుం దొలంగి యుండుదము. పురుషరూపంబు గై కొన్న సత్యంబు కైవడి నరాకృతి వహించినధర్మంబుకరణిసా కారం బైనసదాచారంబుచందంబున సద్గుణాభిరాముం డైన యారాజకుమారుండు నీకు నసాధ్యుండగుట కతనఁ బ్రద్యుమ్న వృష కేతన మేఘవర్ణ యౌవనాశ్వనీలధ్వజాదియోధుల నిచ్చట నిలిపి మనము కొంతతడవునకు మగిడి వత్తమనిపలు కుచుఁ బరబలంబుల మీఁద దమబలంబులం బురికొల్పెడు చందంబున నరదంబు తటిమికొని మూఁడు యోజనంబు లెడ గలుగం జనియె.

అప్పుడు సురథుండు రమణ మెఱయ నేగుదెంచి పిడు గులు పడువడువున బెడిదంబు లైనశరంబులు జడిగొనం గురియుచు నర్జునుని సైన్యంబు సొచ్చి మారి మసంగిన భంగి మంత్రించిపడవైచినగతి లయకాలదండధరుండు తాండవిం చినదారి విజృంభించి గంభీరగుణారావంబుచే నంభోని ధులు గలంగ భద్రగజసమూహంబులఁ జించి చెండాడుచు వాయువేగమనోవేగంబు లగుతురంగంబుల గుదులు గ్రు

చ్చిన చందంబునం గూల నేయుచుఁ దేరులఁ దిలమాత్రశక లంబులు సేయుచు భటకదంబంబుల నంబకంబులం బడఁ గె డపుచు ఖండంబు లైనశస్త్రాస్త్రకాండంబులును దుత్తుమురు లైన కత్తళంబులును దుమ్ము లైన కోలెమ్ములును బ్రోవు లైన ప్రేవులును బంకంబు లైన మాంసమజ్జ మస్తిష్కంబులునుం గలిగి రణాంగణంబు ఘోరంబు గాఁ గనుపట్టం బరాక్ర మింపుచు యోజనత్రయవిస్తారంబుగాఁబన్నిన సైన్యంబుల నెల్లఁ జించి చెండాడి శ్రీకృష్ణునిఁ బార్థునిం గనుంగొని సుర థుం డిట్లనియె. కృష్ణా! నీవు మూఁడవతారంబులం జేసిన సుకృతంబు నీబలంబును బార్థున కొసంగి సుధన్వునిం జం పింప నగునె? పురాణపురుషుండ వయ్యుఁ బడుచుఁదనంబు మాన వైతివి. రేనుపండ్ల నిమిత్తంబు గా ముత్తియంబులు వేలములు వేయుచందంబున గోవిందా! నీ విల్లు చేయం దగునే. నిన్ను ధర్మదయాసాంద్రుం డని మహామునులు గొ నియాడ విందు. నీ విందు సుధన్వుని మఱంది చేతం జంపించి పోవం జూచినం బోనిత్తునే? యని పలికి యలుక మొగం బునం దోలుక వేలకోలందు లగుకడింది బాణంబులు పురంద రనందనునిపయి నిగిడించిన నతండు వాని నన్నిటిని ఖం డించి క్రొవ్వాఁడిబాణంబులచేఁ గోదండంబు ఖండించి గుఱ్ఱంబులం బడఁగెడపి సారథిని వధించి రథంబు వితథంబు గావించిన వాఁడునుం బొలివోవనిబంటుతనంబున వేఱొండు రథం బెక్కి సముజ్జ్వలం బైనకార్ముకంబు సజ్యంబు గావించి

కమలాక్షపార్థుల రథాశ్వకేతనసమేతంబుగా బాణవారాశి
లోనం జిక్కుపడం జేసినం గ్రీడి వేడుక మెఱయ వాని
తూపులు రూపఱం జేసి యొక్క మెఱుంగు నారసంబునభి
మంత్రించి వేయుటయు వానిరథంబు ఱెక్కలతోడి మేరు
శిఖరంబుచందంబున సూర్యమండలంబు దాఁకం గొని పో
యె. అర్జునుని ధనుర్విద్యాకౌశలంబు వర్ణింపం దరంబె?
సురధునీతీరపర్యంతంబు సురథు నీతీరునం గొని. పోయిన
సురపథంబున నిల్చి వాఁడు భువనభయంకరంబుగా నట్టహా
సంబు సేసి భీకరం బయినసాయకంబు వింటనరిఁబోసిపార్థు
నరదంబు గుఱిసేసి యేసిన నది బిఱ్ఱబిఱ్ఱం దిరిగి భూమి
లోనం బూడుకొనుటయు మురభంజనుండు ధనంజయుని
తోడం గూడ దుమికి తనబాహుదండంబులు చాఁచి య
య్యరదంబు నుబుకనెత్తం జాలక తొల్లి వరాహావతారం
బున శైలకాననసమేతం బైనవసుంధరావలయంబు దంష్ట్రా
గ్రంబున నుద్ధరించితి నప్పుడు నింత బరువు తోఁచలే దని
పార్థునితోఁ బలుకునవసరంబున నాంజనేయుండు తత్కేత
నంబున నుండి డిగ్గ నుఱికి మహామేరుశైలసమానంబుగాఁ
బెరిఁగి దీర్ఘతరం బైనవాలంబునం జుట్టి పట్టి యీడిగిలంబడ
నీడ్చి యు నత్తేరు నెత్తం జాలం డయ్యె.

అంత సురథుండును గరుడవాహన శ్వేతవాహనుల
మీఁదనర్బుదన్యర్బుదఖర్వ మహాఖర్వశంఖసంఖ్యాతంబు
లును బుంఖానుపుంఖంబు లైనమార్గణంబులం గుప్పుటయు నా

జనార్దనుండు దాని సైరింపం జాలక యర్జునుం జూచి కిరీటీ! నీమేటితనం బెక్కడికిం బోయె. అని మొసలం గనుచెదరని వీరాధివీరుండ వని కదా నిన్ను నమ్మి మాయన్నసమ్మతి లేకుండియు నాచెలియలి నొసంగితి? ఇంకనైనం దెలివొంది కయ్యంబు సేయుము. (అనియె)

* అదియునుం గాక సాటి లేని మేటి పోటుబంట వని సరిబావమ్మఅంది వనియును లాఘవం బెన్నక నీరధంబు గడప నోడంబడి పార్థుని సారథియను నామధేయంబు జగద్విఖ్యాతంబుగా ధరించితి. అయిన నేమయ్యె? ఇప్పుడవక్రపరాక్రమం బగుచక్రంబు నొసంగుదునో? లేక నేను రథికుండ నై శార్ఙ్గకోదండంబు మండలాకారంబుగా గుణమునపడం దిగిచి యాశీవిషోపమానంబులగునిశితవిశిఖపరంపరల వెంపర లాడి వైరిసమూసమూహంబులం గనుపుగొట్టెద. నీవు సారథ్యంబునకు నాయితంబు గమ్ము లెమ్ము లెమ్ము పగ్గంబులు గైకొ మ్మనియె.

అంత ఫల్గునుండు రోషారుణలోచనుండై బాణాసురమర్దనుం గనుంగొని దేవా! నాపరాక్రమంబు చూడుము. అని పలికి నూఱులకొలందులు వేలసంఖ్యలు నయుతనియుతగణంబులు నైనయంబులం బ్రయోగించి వాని తేరు తిలమాత్రంబులుం నణుమాత్రంబులు బరమాణుకల్పంబులును

* ఈపువ్వులనడుమ నున్న వాక్యము లొక్క ప్రతిలో మాత్రమే కలవు.

దమ్ముదూళియుం జేసి భూతలస్థునిం జేయుటయు సురథుండు విరథుండై మాధవాంజనేయులచేతఁ దెమలింపం గూడని పార్థునిరథంబు ఘల్లగించి సంగడంబుచందంబు సంబాడవుగా నెత్తి కంసకర్భభంజనుంజూచి "కృష్ణులారా! మీయరదంబు భూమింబడవైచిచూర్ణంబు గాఁ జేయుదునో సప్తసాగరంబుల కవ్వలితీరంబునఁ బడవైతునో హస్తినాపురంబున ధర్మజుని సన్నిధానంబునఁ బడఁ జిమ్ముదునో" యని పలుకుచు ఘాత చేసిన నాఖండలసందనుండు దంభోళిసంకాశంబులైన యయిదు బాణంబులు గాండీవంబునం దొడిగిసురథునివక్షంబు భేదించిన వాఁడును విసంజ్ఞుండై చేవదలి ధరణీతలంబునం బడియె. అంతలో రమాకాంతుం డెప్పటి తెఱంగునఁ దేరాయత్తంబు సేసి పార్థుండును దానునెక్కి దేవదత్తపాంచజన్యంబులు పూరించుటయు సురథుండు సారథి తెచ్చినవేఱొక్క తేరిమీఁదఁ దాను నవలీల నెక్కి నిరర్గళమార్గణాసారంబులుగురియుచుఁ బోటుపంతంబుమాట లాడందొడంగిన ధనంజయుండు సురథునిం జూచి యవశ్యంబును

—: అర్జునుఁడు సురథునిం జంపుట :—

భవదీయమస్తకంబు ఖండింతు నట్లు చేయనైతినేని నాపూర్వజులకు ద్రోహంబు సేసినవాఁడ నగుదు ననిన సురథుండు పార్థునిం గనుంగొని నీశరీరం బవశ్యంబు ధరణీతలంబునం బడఁద్రోయుదు నట్లు చేయనైతి నేని నీచెప్పిన శపథంబె నాకును నరియనుచుఁ గిరీటిపై ననేక కోటిబాణంబులు నిగి

డించిన వానిం ద్రుంచి యతండు సురథునిపై శతసహస్ర సంఖ్యాతంబులైనవిశిఖంబులుసంధించె. అంతనాసురథుండు రోషారుణలోచనుండై వివ్వచ్చు వింటినారి ద్రెవ్వ నేయుటయుఁ బార్థుండు వేఱొక్కనారి సవరించి రథంబు చెక్కలు గావించిన నతండు వేఱొక్కశతాంగంబుపై నెక్కి యుద్ధతి మోహరించుటయుఁ బార్థుండు దాని బహుశకలంబులు గావించె. క్రమ్మఱ నొక్కరథం బెక్కి సందునిమె. మఱియు నొక్కశతాంగంబు నధిరోహించిన ఖండించె. ఇవ్విధంబున నూటయెనిమిది రథంబులు పొడిచేసిన సురథుండు విరథుండయ్యుఁ గార్ముకంబు సారింపుచుఁ దూణీరంబునకుం గేలు సాఁచి బాణంబు నందుకొనునంతలో నర్ధచంద్రాశుగంబున నతనిబాహువు ఖండించె. అట్లు ఖండితబాహుఁ డయ్యు శౌర్యంబు వదలక సురథుండు కేలం గద యమర్చుకొని త్రివ్వుచుం బఱతెంచి కిరీటి తేరిగుఱ్ఱంబులం జదియ మోఁది రెండు వేల యేనుంగులం బీనుంగులు గావించి యన్నియ రథంబుల మర్దనంబొనర్చి పదివేలవీరయోధుల మడియించి యన్నియ తురంగంబుల గీటడంగించి సింహనాదంబు సేసినం గిరీటి కృష్ణసర్పోపమానం బైనక్రొవ్వాఁడి మోఁబుంగుఁ దూపు వింటం దొడిగి గదతోడం గూడ వామభుజంబు ఖండించిన రెండు భుజంబులు లేకుండియుం గొమ్ములు లేని యేనుంగుకైవడి నౌద్ధత్యంబునఁ బాదఘాతంబులచే రథ రథ్యసారథి మాతంగ తురంగంబుల మర్దింపుచు వచ్చునెడఁ

బాండవమధ్యముండు రెండు బాణంబులచే రెండుపాదంబులు ఖండించిన, సురథుండు దొల్లివచ్చుట కనుంగొని యింద్రనందనుండు కనకపుంఖవిభ్రాజితంబును మయూరపత్రచిత్రితంబును ననేకసూర్యప్రకాశంబు నైనసాయకంబు సంధించి యభిమంత్రించి యేసిన, నది యతిరయంబునంబోయి సురథునిశిరంబు ఖండించిన, నాశిరంబు రాతిమీఁదం బడిన చందంబున బిట్టుగా మిట్టిపడి పార్థునిమస్తకంబు మీఁదం బడుటయుఁ, బిడుగుపడుచందంబున దిమ్మవట్టి కిరీటివివశుండై భూతలంబునం బడియె. సురథుని మొండెంబు కరితురగరథసమూహంబుల నుగ్గునూచము చేయుచుఁ జేగులుకొండచందంబున, గుంభినీతలంబునం గూలె. అంతమూర్ఛనొంది పుడమిపయిం బడినకౌంతేయునిం గనుంగొని, దనుజాంతకుండు నిజపాణిపల్లవంబుచే మేనునిమిరి సేదదేర్చినం, గిరీటి స్వస్థుండై నిలిచె.

—: శ్రీకృష్ణుండు గరుత్మంతునిఁ దలఁచుట: —

అంత సురథుని శిరంబు నెత్తామరమీఁద వ్రాలు మధుకరంబు తెఱంగున శ్రీహరిచరణారవిందంబులమీఁద వ్రాలె. అప్పురుషోత్తముండు నయ్యుత్తమాంగంబు కేలం గైకొని పార్థునకుంజూపి "యితండు ప్రాణావసాన సమయంబునందును సత్యంబు దప్పండు. శీలవంతుండును దాంతుండును సమరదుర్దాంతుండు నయిన యీయుత్తమశ్లోకుండు నిఖిలలోకవందనీయుం" డనుటయు, సంక్రందననందనుండు

పరమానందంబున నందుకొని తచ్ఛిరంబునకు వందనంబు గావించె. అంత మురాంతకుండును రాజతనూజుఁ గృతార్థుం జేయ నూహించి వైనతేయునిం దలంచిన నిబ్బరంపు మబ్బులోనం గబ్బి మిఱుమిడ్యుల్లత తెఱంగున విద్యోతమానంబు లైనఱెక్కలవలనఁ బిక్కటంబుగాఁ బొడమిన ఝంఝామారుతంబుచేఁ గులపర్వతంబు లొడ్డగిల్లు నట్లుగా నెగసి వచ్చి సన్నిధానంబున నిలిచి దేవదాసుండ నగు నేను వచ్చితి; నేమికార్యంబు నియమించెద; నని పలుకుటయు, నుపేంద్రుండు ఖగేంద్రునిం జూచి నీవీశిరంబు గైకొని శీఘ్రంబుగా నరిగి ప్రయాగలోఁ ద్రివేణీమధ్యంబున వైవుము. సురథుం డుత్తమలోకంబు గాంచుఁ గాక యనిన నాగాంతకుండు నరకాంతకుని యానతి శిరసావహించి "దేవా! భవదీయ దివ్యపాదారవిందంబులొక్కసారి మదిం దలంచినంతనే యెట్టిమానవుం డైనను గృతార్థుండై పరపదంబు నొందు. అట్టి మీభక్తునిం దలంచినవారికిఁ దీర్థయాత్రాఫలంబు సేకూఱు నను నెడ భవదీయభక్తులకుఁ దీర్థయాత్ర లేమిటికి? అయినను మీయానతి యులంఘనీయంబు గావున నట్లే కావించెద" నని పలికి, యమ్మస్తకంబు గైకొని గరుత్మంతుండు నిజపక్షవిక్షేపంబులచే గిరుల నూటాడం జేయుచు వచ్చునెడ సదాశివుండు పార్వతీసమేతంబుగా వృషభారూఢుండై యంబరంబునం జనువాఁడు, తనమ్రొద్ది భృంగిరిటిం జూచి నీవు జవంబునం జని గరుడుం డెత్తుక

పోవు శిరంబుఁ దీసికొని రమ్మని పంపుటయు భృంగిరిటి వైన
తేయునిం జేరవచ్చి యతని ఱెక్కలగాడ్పులో సుడివడి సుగ
గాలిలో నంటవిలిన చొక్కాకుచందంబునఁ బెద్దయుంబ్రొద్దు
తిరుగుడుపడి యెట్టకేలకు విడివిడి యతిరయంబునం బఱ
తెంచి "దేవా మహాదేవ! యిక్కార్యంబు నాకశక్యం" బను
టయుఁ బార్వతీదేవి నాథునివిలోకించి నవ్వుచు నిట్లనియె.
అత్యంతవికారంబులైనయంగంబులం గనుపట్టుభృంగి పర
మభృత్యుండు. పిశాచంబులు సఖులు. మంచంబుకోడు కై
దువు. ఇంటింట బిచ్చంబె కూడు. పునుకలపేరు హారంబు.
ముదియెద్దు పడినాగె తేజీ. ఇన్నిమంగళంబులు గలమీకుఁ
సంగరజయం బబ్బుట కేమియాశ్చర్యం' బని పరిహాసంబు
లాడు శైలరాజకన్యకం గనుంగొని నవ్వి యవ్వృషభాం
కుండు తారకాసురవైరి నవలోకించి షణ్ముఖా! నీవు పోయి
తచ్ఛిరంబు గొనిరమ్మనుటయు నతండును గరుడుని వెనుకం
బఱచి కూడం జాలక తదీయపక్షవిక్షేపజాతంబులైనవా
తూలంబులచేఁ ద్రిలోకంబులం దిరుగుచు నెట్టకేలకు గరు
డునిఁ గూడె. అంతలో భాగ్యవశంబునఁ బ్రయాగ దోఁ
చుటయు వినతానందనుండు త్రివేణికామధ్యంబున సుర
ధునిశిరంబు వైచిన నీటిలోనం బడక మున్నె కుమార
స్వామి తూఁటి యెత్తుకొని వచ్చి మహాదేవునిసన్నిధినునిచె.
అతండు దానిం గరాంబుజంబునం బట్టుకొని హిమశైల
బాలికకుం జూపి దానవహూకులు దమూపరులు సత్యవ్రత

పరాయణులు జితేంద్రియులు జితక్రోధులు మాతాపితృ భక్తులు నైన వారల శిరఃకపాలంబులు నేను హారంబుగాధరి యింతు. ఈయుత్తమశ్లోకుని యుత్తమాంగంబు తన్మధ్యంబున నాయకరత్నంబుగాఁ దాల్చెద నని ధరియించె. అంత నా గాంతకుండు సత్వరంబుగాఁ జని మురాంతకున కవ్వృత్తాం తం బెఱింగించి తదనుమతంబున యథేచ్ఛముగాఁ జనియె నని న విని జనమేజయుండు జైమినిం గనుంగొని తరువాతి వృత్తాంతంబు వినవలయు ననుటయు.

గద్య.

ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగచొక్క
నాథమహీనాథకరుణాకటాక్షసంపాదితగజతురంగమాం
దోళికాప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధ
మాన సముఖమీనాక్షీ నాయకతనూభవమీ
నాక్షీదేవీ కటాక్షలబ్ధకవితాసంప్రదాయ
వేంకటకృష్ణప్పనాయక ప్రణీతం బైన
జైమినిభారతంబున నశ్వమేధపర్వ
మ్మనువచనకావ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

—:o:—

శ్రీరస్తు!

# జైమినిభారతము

## తృతీయాశ్వాసము.

క. శ్రీపాండ్యధరాభరణా!
భూపాలకమకుటరత్నపూజితచరణా
రూపరతిస్మర నిర్వా
జోపకృతీ! విజయరంగచొక్కనరపతీ!

అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రునిం గనుంగొని, తదనంతరంబ హంసధ్వజుండు బలపరాక్రమసంపన్నుం డయినకొడుకు లిరువురు సమరంబునం గూలుటయు సైన్యంబులు పరాజయంబు నొందుటయు నాకర్ణించి కోపాటోపదీపితుండై చతురంగబలంబుల నెల్లంగలయం గూర్చి సమరసముత్సాహదోహలంబులైనవీరకాహళంబులును నిస్సాణంబులును భూనభోంతరంబుల బూరటిలం జేయ నిజభుజపరాక్రమంబుచే మాధవునాధరింపం దలంచి సింహనాదంబులు నట్టహాసంబులు నార్పులుం బెడబొబ్బలు జంకెనలు గజఘీంకారంబులు శింజినీటంకారంబులు వీరహుంకారంబులు భుజాస్ఫాలనంబులు ధ్వజపటపటాత్కారంబులు రథచక్రఘోషంబులు హయహేషారవంబులు

రత్నభూషణంబుల ధగధగలు కైదువుల ధళధళలు నీలచేల
నిగనిగలు నొక్కుమ్మడిం గ్రమ్మ సాగరంబు పొరలిన
తెఱంగున నాహవయజ్ఞంబునఁ బ్రాణంబు లాహుతులు
సేయం దలంచి సాహసంబున మోహరించివచ్చునాహంస
ధ్వజుం గనుంగొని కంసవైరి కరుణాకలితమానసుండై దగ్గ
నం దేరుడిగ్గి పీతాంబరంబు నలెవాటు జాఱ వనమాలికా
పరిమళంబులు మీఱ గంధసింధురగంభీరగమనంబున నె
దురు వచ్చుటయు నమ్మహీనాథుండును దోడనే యరదంబు
దుమికి భక్తివినయసంభ్రమంబులు మనంబునం బెనంగొనం
జనుదెంచి పాదారవిందంబుల వ్రాలిన శ్రీవల్లభుండు శుభ
లక్షణలక్షితంబులును శార్ఙ్గమౌర్వీకిణాంకితంబులును లక్ష్మీ
విరచితమకరికాపత్త్రాభిరామంబులుం గరికరోపమానంబు
లునైన తనభుజంబులం జాఁచి లేవనెత్తి యామండలేశ్వరుని
నిండుకౌఁగిటం జేర్చి భక్తవాత్సల్యంబునం గన్నుల బా
ష్పంబు లొలుక నూఱడించుచు "రాజచంద్రా! జననమర
ణాదిసుఖదుఃఖంబులు బ్రహ్మకునైనం దప్పవు. నీసూను
లిరువురు సమరయజ్ఞంబు సాంగంబుగా నెఱవేర్చి ప్రాణా
హుతులుగావించి మమ్ముం దృప్తి నొందించి మాసాయు
జ్యంబునొందిరి. వారికై వగవం బనిలేదు." అనిన విని
హంసధ్వజుండు "కంసాంతకా! దేవరపాదపద్మంబులు సే
వింపంగోరి కయ్యంబునకుం బూనితి. నామనోరథంబు ఫలి
యించె. ఇహపర సౌఖ్యంబులకు నిదానంబైన తావక

దర్శనంబు లభించె. ఇంక నాకు దుఃఖంబు గలుగదు" అనిన విని గోవిందుం డను నరాధిపా! నీసఖ్యంబు మాకు దొరకె, నీ వాప్తబంధుండవు, పాండవులు నాకుం బ్రియులగుట నీకు నుం దెలిసి యుండుం గావున నిఖిలసేనాసమన్వితుండవై యశ్వంబు రక్షించుచు నర్జునితోం గూడ వచ్చి ధర్మనందనుని యాగంబు నిర్వహించి యాతనిచేం బూజితుండవై వచ్చుట నాకుం బ్రియం బని సవ్యసాచిసమేతంబుగాం దత్పురంబునకుం జని యతనిచేం బూజలుగాంచుచు నయిదు రాత్రులు వసియించి యంబుజనాభుండు హస్తినాపురంబునకుం జనియె. తదనంతరంబ విజయుండు హంసకేతునితోడం గూడం దురంగంబుం బరలించుకొనిచనుట యునయ్యశ్వంబు పవనజవంబున నుత్తరాభిముఖంబుగాం జని చని యొండతాం కునం గొట్టువడి యొకవనాంతరంబు జొచ్చి నవరత్నఖచిత సోపానంబులును నమృతోపమానంబులైన తేటనీళ్ళును జెంగలువలు తెలిగలువలు తెలిదమ్ములుం జెందమ్ములు నందంబు మీఱ నొక్కసరోవరంబు సొచ్చి కంఠదఘ్నజలంబుల

—: సవనాశ్వము గోళిగయై పులి యగుట. :—

నిలిచి సలిలంబు గ్రోలి తనిసి వెలుపలికి వచ్చి యందఱు నరు దంది కనుంగొన గోళిగయయ్యెం గ్రీడి యది కనుంగొని విచారంబు నొందునెడ నయ్యశ్వాంగన వేఱొక్క కొలనికిం జని జలంబులు గ్రోలి తోడనె బెబ్బులి యయ్యె

ననిన విని 'మునీంద్రా! యట్లగుటకుం గారణం బేమి'
యని యడిగిన జనమేజయునకు జైమిని యిట్లనియె.

—: స్త్రీమండలవృత్తాంతము. :—

'తొల్లి దాక్షాయణి శంభు నుద్దేశించి నియమంబులతోఁ
దపం బాచరించుచుండ దుర్మదాంధుఁడైన యొక్కరక్కసుం
డద్దేవిని జెనకం జూచిన హుంకారంబుచే వాని భస్మంబు
గావించి యిది మొదలు లేజంతువు లీజలజాకరంబు సొచ్చిన
దోడనే యాఁడుజన్మంబుఁ జెందుఁగాక యని శపియించెఁ
గావుననీఘోటకంబునుఁ గోడిగ యయ్యె. అది యట్లుండె ముున్ను
కృతయుగంబున నకృతవర్ణుం డనుమునివరుండు తీర్థయాత్ర
సేయుచుఁ బుణ్యస్థలంబులు నదులు నదంబులు తటాకంబు
లు నవలోకించుచుఁ దత్సరోవరంబునకు వచ్చియఘమర్షణ
స్నానంబు గావించునెడ నొక్క మొసలి యతనిపాదంబులు
పట్టుకొని తివియుటయుఁ బెనంగి విడిపించుకొని నేఁడు మొదలు
లేజంతువు లిందుఁ జొచ్చిన వ్యాఘ్రంబు లగుఁగాక యని
శాపం బొసంగె. అదికారణంబుగాఁ బెద్దపులి యయ్యె.'
అవ్విధంబుగనుంగొని పార్థుండు ముందుతోఁచక శ్రీకృష్ణ
దేవుని మనంబున ధ్యానంబు సేయుటయు నాహరికరుణా
కటాక్షంబుచే వ్యాఘ్రం బెప్పటిఘోటకం బయ్యె. అంత
భేరీపటహాదివాద్యంబులు మ్రోయ రయంబునన నేకదేశం
బులు క్రమించుచుం జని యాఁడుమండలంబునకుం జనియె.

తద్దేశంబునకు రాణి నీలనిభవేణియు రాకేందుబింబ వదనయుఁ గుందకోరక సమాన రదనయుఁ బల్లవాధరయుఁ గంబుకంధరయుఁ బర్వతోపమానవక్షోరుహాయు మల్లికా మృదుళబాహాయు నణుమధ్యయు నతిపుణ్యసాధ్వియు జల జనిభపాణియు సైకతశ్రోణియు రంభాసమోరుకాండయు ............రాజీవరక్తచరణయు రత్నమయసర్వాభర ణయునై హావభావవిలాసవిభ్రమంబులు నింపుమీఱుచు... .................. ..పురుషునిమనంబెఱింగి శృం గారవిలాసంబులం బ్రొద్దులుపుచ్చుచు............. ......సరసవాగ్విలాసంబులు నెరపుచుఁ బ్రమీలయను నామధేయంబు గాంచి నరులకు సురలకసురులకుసిద్ధులకు సాధ్యులకు నసాధ్యమైనధనుర్విద్యాకౌశలంబునం బొలు పొందుచు ధైర్యవీర్యసాహసంబు లుగ్రశాసనంబులుక్క మెఱయ లక్షయోనుంగులు నన్నియ గుఱ్ఱంబులు నన్నియ రథంబులును విమతనృకలనం బరఁగిన పదిలక్షల కన్నెలు గదాముసలముద్గర భిండిపాల తోమరశక్తి ముసుండిశరశరా సనఖడ్గఖేటకా ద్యాయుధములతో గరిడిసాధనల నెప్పుడుఁ జరించుచుండ నఖండితవైభవంబున రాజ్యంబేలుచు నుండు. తద్దేశంబునకు మార్గవశంబునం బోయిన పురు షులను జేరం బిలిచి యంగలి యిందుముఖు లమృతమధు రాలాపంబుల.................................. ....నాహ్లాదంబు పుట్టించి వశీకరించి యొక్కొక్కపురుషుని.

తో<sup></sup>

తోఁబెక్కండ్రు వనితలు......................................................................క్రీడించుచుండ నొక్కమాసంబులో నాపురుషుండు.............................................పరలోకంబున.... కరుగు. వానితోఁ గూడ రమించిన యక్కాంత లందఱు నగ్నిప్రవేశంబు సేయుదురు. అందొక్కయువతికి గర్భంబు నిలుచు, అది కనియెనేని యాఁడుఁబడుచుం గాంచుఁ గాని పుత్రునిం గాంచదు. ఇది యాదేశంబునందలి నడవడి. జనమేజయనరేంద్రా! విజయభుజ విక్రమరక్షితం బైన యశ్వరత్నం బవ్వీటిసమీపంబునకుం జని వచ్చిక మేయు చు నుండ నెడఁగ జీవంకకనుబొమ్మలవంకలకుఁగొంకిన చందం బున గుడుసువడం దిగిచిన సింగాణివిండ్లును, గలికిచూపుల కలికి వెనుక దాఁగినవితంబునసంపపాదులలోనం బాదలుల కోరకోలలును, నట్రువ గబ్బిగుబ్బలు గనుంగొని భ్రమ పడినచందంబున బిఱబిఱఁ దిరుగుచక్రంబులును, బెడంగుజ డలయుందంబునకు వణంకెడు చందంబునఁ దళతళ మని కత్తులు మెఱయవీరశృంగారరసంబులంగనారూపంబుగై కొ న్నకైవడి వీర మీఱురాకేందుముఖులు తేజీలుదువాళింపు చుఁ గోకిల లొక్కుమ్మడిఁ గాకలీస్వనంబు లొనరించుకరణి వీరాలాపంబులు నార్పులు నట్టహాసంబులు పంతంబులు మెఱయం బారు దీరుటయు నందొక్కసుందరదరసగుఱ్ఱంబు మీఁటి యధ్వరహరిం బట్టికొని వచ్చి తమయేలికసానిసమ్ము ఖంబున (1) నిలిపి రాజరాజేశ్వరీ! యీహయంబుదొరజునిచే

విమ్రంబడినది. హాయగతుణార్థంబుగా బరాక్రమోపార్జ
నం డగు నర్జునుంపు చనఁబెంచి యున్నవాఁ' డని పలుక
రించిన, నయ్యంగనామణి బంగరురంగులం దురంగలించు
తురంగశాలలోనఁ గట్టుటకు నియమించి, యంతరంగంబున
నెంతయు సంతసం బెసంగ నేఁటితో నాకోరికలు నెఱ
వేఱె. సుఖంబు సమకూరె.........................
సందియంబు లేదు. ఇందుకొఱకు కాపురంపకనందనుం డిచ్చ
టికి వచ్చె..............................................
.,..............................................
..............................................ఇది
మొదలనుదినంబును..............................వానితోఁ
డం గూడెను. నాపాలిదైవంబులగు వేఁడెదనని మొదవీడని
కోరికలు పొడము, నప్పుడంతుక పదివన్నియ బంగారునకు
మెఱుంగు పెట్టినహారంగునఁ బైగోజవ్వాదికిఁబువ్వుఁదావి
గట్టినరీతిఁ జన్నారిజాబిల్లిమీఁద సుధారసంబు చిలికించిన
విధంబున రంగైనయంగంబున శృంగారింపఁ దొడంగి, యం
గజునిచక్రంబులంబోలెఁ దళుకుతళుకున్నఁ జెక్కులఁగుల్కు
కళ్కురత్నంబులకమ్మలు వెట్టి చివురాకుఁ గెమ్మోవి కెంపుల
సొంపు మీఱునుపాణిముత్యపుముంగర ధరియించి, వింత
వింతమణులకంటసరములుకంటెయు నేవళంబునుముత్యాల
దండలు సందిటికడెంబులు ప్రత్తికాయతాయెతులు కంక
ణంబులు రవలగాజులు కడెంబులు మొలనూలు నొడ్డా.

ణంబు నందెలు పాడగంబులు పాదరసములు మెట్టెలుఁ బిల్లాణులు వీరముద్రికలు మొదలగునానావిధభూషణంబులుఁ గైసేసి, తనయనురాగరసంబు వెల్లువగట్టెనో!యననందం బగుచందురకావిపావడపైఁ దన (మనో)మాలిన్యంబు వెలికుఱికిన తెఱంగున మవ్వంపుఁ జువ్వ నివ్వటిల్లు రాయంచయంచుల మిం చుపై రాణిదుప్పటంబు గట్టి మట్టుమీఱిన మదనానలంబు తన్నుఁబట్టుకొనిన తెఱంగున నిండు తగటి అవిక కుంకుమపూఁతపొంకంపుసిబ్బెంపుగుబ్బలగబ్బుమీఱ నింపుముస్తీదు చేసి చిలుక తేజీవజీరుని తేజి తెఱంగునఁగను పట్టు మరకతంపుఁబిడెంపు బాఁకు చేపట్టి, విరవాజిసరుల తావియుఁ బైగోజవ్వాజిపట్టెల వాసనయు దిక్కుల గుమ్ము గుమ్మని క్రమ్మ గిలుకుపావలు మెట్టి, నెమ్మిమై మేఘమండలంబు వెలువడు క్రొక్కారుమెఱుంగుతీవియు వోలె నంతిపురంబు వెలువడి యాప్తలైన చెలికత్తెలు వెంటరా బంగరుగు...మ్మలం బోలు నండజయానలు దడలం జేరికైదండ లొసంగ, నవరత్నఖచితం బగుబంగరుబెత్తంబుల మొత్తంబులు చెలంగఁ గటికవారలు రాజరాజేశ్వరీ!రాజపరమేశ్వరీ! అష్టదిగ్రాజమనోభయంకరీ! కేరళదేశాధీశ్వరీ! స్వామినీ! పరాకు, హెచ్చరిక, జతను,సావధానత, అని హెచ్చరికలుదెలుప, నల్లనల్లనవచ్చి డాలు మీఱుపగడాలకంబంబులు దారవజ్రంబులబోదెలు జీవదంతంపుదంతెలు, ఈ శంపునీశంపు దూలంబులు కెంపుటోడుబిల్లలపైకప్పడంబును

నానారత్న విచిత్రంబులు బాలభానుప్రభాభాసమానంబులు గగనలక్ష్మీనివాసంబులు నైన తమ్మి రేకులఁ బోలుపొందు కనక కలశంబుల నలసిల్లు ద్వారంబులును జంద్రకాంతమయంబులైన వజ్రమణిమయ గజరాజశోభితంబులైన పార్శ్వంబులం గనుపట్టు సోపానంబులు హెచ్చురతులపచ్చరాతిన్నెయుఁ గలశంబులు తుండంబులఁ గైకొని యభిషేకంబు లొనర్చుదార వజ్రంపు టేనుంగు లిరుగడలం గడలుకొన మూర్తీభవించిన సామ్రాజ్యలక్ష్మివలె నొప్పుచు లక్ష్మివిగ్రహంబులం బోలు పొందు ద్వారదేశంబులం గలిగి జాళువా సరిగకుట్టుపని పూవుల ప్రతిమలం బ్రతి లేని తెరలును, క్రొత్తముత్తెంబుల జల్లులమేలుకట్లును, నెమిలిఱెక్కల ఛాయలం బ్రశిక్షుణాంబుః వింత లైన కాంతులు మంతు మీఱి రత్నగర్భ యైన పుడమి కన్నకరణి నున్నతివాసుల నొప్పుచు సుధర్మాస్థానంబు శరణిఁ బ్రభాశోభితంబైన వాటంబును బ్రభావిజిత మేరుకూటంబును నగు కొలువుకూటంబున... బాలభానుకిరణంబులతో వాదంబులు సేయు పాదంబులును, బసిఁడిగట్టు పైతట్టు వలెఁ గనుపట్టు విస్తారంబును గలిగి... గోమేధిక పుష్యరాగమరకతముక్తాప్రముఖనిఖిలరత్నవిరాజితంబైన గ్రహనక్షత్రనికర తారకానికరకోరకితంబైన యాకసంబు తెఱంగున (రమ్యంబు) ను నఖిలసురాసురపూజితంబు నైనసింహాసనంబునం గూర్చుండి సామదాన భేదదండచతురోపాయ లగు మందయానలు సందడించి కొలువ నొక్క చక్కఁ జక్కెరబొమ్మలు చక్కెరయు

క్కఁ అలకన్న మిక్కుటంబైన చొకాటంబులు నైనదండతారావళీప్రముఖ ప్రబంధంబులు విన్నపంబు సేయ మఱియొక్క దిక్కున రాకేందువదనలు మీమాంసా వ్యాకరణాదిశాస్త్రంబు లనర్గళ ప్రవాహంబులు గా నుపన్యసింప, వేఱొక్క చాయఁ బల్లవాధరలు బ్రహ్మాండపురాణంబు విష్ణుపురాణంబు పద్మపురాణంబు మొదలగు నష్టాదశపురాణంబుల కథలు వినిపింప, మఱొక్క దిక్కున నీలవేణులు చిత్తరుబొమ్మలవలె శిరఃకంపంబు సేయుచు జంత్రగాత్రంబులతోయి గీత ప్రబంధంబులు ఘననయ దేశీయంబులు వినికిసేయ నొక వంక మకరాంకవిజయపతాకలం బోలె రంభోర్వశీమేనకాదుల నెంత లేదనుబిరుదపాత్రలు చక్కని చారి మొదలగు పదియాఱు నాట్యంబులు, నభినయంబులు గనుఁగొనిపింప నొక్క ప్రదేశంబునఁ గలకంఠకంఠులుపరి హాసంబులు వినోదంబులు గాఁ బ్రసంగంబులు సేయ నిరువంకల రవలకంకణంబులు ఘల్లుఘల్లనఁ బంగారు జాతులు కనకదండమండితంబులైనధవళచామరంబులు వీనఁ గత్తి కేడెంబు సురె చికటారి సిడెము వంకిపట్టిసబాణముసలముద్గరభిందిపాలములు బరిచి సేజా మొదలగుముప్పదిరెండాయుధంబులును గుంచెకాళంజియుఁ జేయిపావడ యడపంబును గిండి సురటియు నిలువుటద్దంబులు మొదలగుమహారాజచిహ్నంబులఁ బూనియూడిగంపుఁ జెలువలూడిగంబులు సేయ సాక్షాత్కరించిన వీరమోహినిచందంబున సింహాలగంబున నుండె. (2)

---

(1)(2) నడుమనున్న గ్రంథ మొక్క ప్రతిలో మాత్రమే యున్నది.

అంతఁ గుంతీసుతమధ్యముండు కాంతాజనులు మఘువాజిం గొనిపోయి రని చారులు పలుకరించిన నవ్వి తగిన రాయబారులం బనిచి గుఱ్ఱంబు విడువు మని మందలించిన నాఁడ, నమ్మండలేశ్వరి ముఖచంద్రమండలంబున వెన్నెలయునుంబోలె మందహాసంబు గందలింపఁ "గిరీటి మేటివీరుండని వింటిమి. అతని రణకలాకౌశలంబు పరీక్షింపక యెకవ్వడిం గడప నీయము. నే నిదె సమరసన్నాహంబుగా నరుగుదెంచెద. పార్థుని రమ్మనుండు. పొం"డని బహుమానంబులు చేసి పంపిన, నియోగులు వేగంబె యరుగుదెంచి యవ్విజయునకు వివరించిరి. అంతఁ దురంగమాతంగశతాంగవీరభట మహార్భటీసమేతంబుగాఁ బ్రమీల మోహరించి

—: ప్రమీలావిజయులయుద్ధము.: —

రథచక్రఘోషంబును గేతనపటాత్కారంబును గార్ముకజ్యానాదంబును లలితచతురసింహనాదంబును భూనభోంతరంబు దీటుకొన శతముఖతనయునిం గాంచి తనకులుకుఁజూపులంబోని వాలుతూపులు వింట సంధించి రథరథ్యకేతనసమేతంబుగా నించుటయుఁ, బార్థుండును నంగనతోడికయ్యంబునకు రోయుచుఁ దీనికతంబున మూఁడువాఁడితూపులు సంధించియేయుటయు నది తోడనే ఖండించి తీవ్రముఖంబులైనశిలీముఖంబులచే దశదిశాముఖంబులు గప్పి తక్కినబోటులు ఘోటకంబుల మీఁటి సామజంబులఁ బురికొల్పి రథంబులం దోలి చిలుకుటమ్ములచే గ్రుచ్చియు నీఁటెలం బొడి

చియుఁ బట్టిసంబుల నఱికియు శూలమ్ములం గ్రుమ్మియు వంకులఁ జిమ్మియు జముదాళ్లం బొడిచియు గదల నడిచియు ముసలంబుల మోఁదియు ముద్గరంబులఁ జిదిమియు గిరుసుకత్తుల విదళించియుఁ జిఱుతకడ్డియలఁ గొట్టియుఁ దారసిల్లిన నయ్యిరువాఁగును బూర్వపశ్చిమసముద్రంబులవలెం దాఁకి తుములంబుగా సమరంబు గావించు నెడఁ, బ్రమీల యింద్రనందనుం జూచి "కిరీటి! మమ్మునీబోఁటికిం గెలువ గూడదు. నీకె కాదు. అనిమిషసిద్ధసాధ్యగరుడోరగాదులేనియు నన్ను గెలువలేరు. నీకు గుఱ్ఱంబు గావలయునేని దురభిమానంబు మాని ప్రియంబున నన్ను వరియించిన

—: ప్రమీల యర్జును మోహించుట. :—

హాయంబు నిత్తుం గాక లేక యున్న నిన్నుం బోనిత్తునే! నీయగ్రజుం డైనయుధిష్ఠిరుండు సోమపానంబు సేయ నిమ్ము నీవు నాయధరామృతపానంబు సేయుము. అతండు కురుదేశం బేల నిమ్ము. నీవు నా.... దేశంబేలుము. ఈదేశంబునకునీవె యొడయఁడ వయ్యెదవు." అనిన ధనంజయుండు దరహాసంబు నెమ్మొగమ్మునం గనుపట్ట "జవ్వనీ!................... నిన్నుం గూడిననరుండు మానమాత్రంబునఁ బంచత్వంబు నొంది యధోగతికిం జను. అంతట యువతిమండలం బేలువాఁడెవ్వండు? ధర్మజునకు మరల హయంబు నేర్చువారెవ్వరు!" అనినం బ్రమీల వాలారుమెఱుంగుఁజూపులం జూచుచు "నీవు దైవయోగంబున మా దేశంబునకు వచ్చినవాఁడవు

ఇంక నెచ్చటికిఁ బోవంగలవు? ఎట్లయిన నీప్రాణంబు లప హరింపక మాన. నామహోగ్రబాణంబులచే నీమేనుజల్లెడ క్రంతలుగా గాయంబులం బడి వేదనం బొరలుచు వృథా ప్రాణంబు లప్పగింప నేల?" అనినఁ గన్నులఁ గెంపు నిం పుచు నిలింపపతినందనుండు నారి నాఱమ్ములు సంధించి యే సిన, నవ్విలాసిని యన్నియు నారసమ్ముల వానిని రూపఱం జేసి వెండియు నేనుఁడి బాణంబులు మేనం గీలించి మఱి యు వేలకొలంది తూపులవాన గురిసిన, సురపతితనూభ వుండు సమ్మోహనాంగి సమ్మోహనాస్త్రంబు వింట సం ధించిన నవ్వాలుఁగంటి యయ్యస్త్రంబుతోడం గూడ గాండీవగుణంబుఖండించిన, నరుండు కోదండంబునవేఱొం డునారిం గూర్చి యున్నారిం బరిమార్పక మాననని కట్టలు కం గనుబొమ ముడిపాటు గదియించుటయు, నాకాశవాణి "అర్జునా! నిర్జరుల కైన దీనిం గెలువశక్యంబుగాదు. నీవు పదివేలయేఁడులు పోరినం జయంబు చేకూరదు. రిత్త యా యాసం బేమిటికి? ఒక్కనాఁటిరాత్రి దీని......దనియించు హాయంబు గాని యథేచ్ఛంబుగాఁజను" మనిన నర్జునుండు ——:ప్రమీల యర్జును నంతిపురంబునకుఁ గొనిపోవుట:—— నమ్ములు విల్లు నరదంబున నునుచుటయు నయ్యంగన యతి త్వరితంబుగా వచ్చి యాలింగనంబు సేసి పురంబునకుం దో డుక పోయి యంతిపురంబున బంగరుపడుకటింటం బువ్వుల పాన్పున.. ...లీలావినోదంబునం బ్రొద్దుగడపి మఱునాఁడు

మత్తమాతంగతురంగమణిభూషణావళులతోడం గూడ మఖ
వాజి నర్పించి ప్రొక్కుటయు నయ్యర్జునుండు సాదరం
బుగా వీడ్కొని చనియె. అని చెప్పి మఱియు జైమినిము
నీంద్రుండు జనమేజయనరేంద్రునిం గనుంగొని యిట్లనియె.

## —: వృక్షదేశవృత్తాంతము. :—

తదనంతరంబ యత్తురంగంబు వృక్షదేశంబునకుం జని
యె. అందలి విశేషంబులు వినుము. అచ్చటి మానవపశు
పక్షివృక్షసంఘంబులు ప్రాతఃకాలంబునం బుట్టి తోడనే
యౌవనంబు నొంది మధ్యాహ్నకాలంబునం గాపురంబు
సేసి సాయంకాలంబున మరణంబు నొందు. అనుదినంబు
నివ్విధంబున జననమరణంబు లొందుచుండు. ఇదియద్దే
శాచారంబు. పార్థుండవ్విశేషంబులుగని యచ్చెరువొం
దుచుం బోవునెడ స్వకర్మానుసారంబు గాం బుట్టిన యేకపా
దులు ద్విపాదులు త్రిపాదులు ననేకపాదులు వికటపాదులు
నైనజనులును, గుందేలు, ఎద్దు, ఎలుంగు, వానరంబు, ఏనుం
గు, జింక, గుఱ్ఱంబు, పంది, పసువు, పులి, మార్జాలము
మొదలగు జంతువులవలెం గనుపట్టు ముఖంబులు గలిగిన
ప్రజలును, ఒంటికొమ్ములు రెండుకొమ్ములు మూండుకొమ్ములు
నాలుగుకొమ్ములు వంకరకొమ్ములు నిడుదకొమ్ములు గలిగిన
మానవులును గూబ కోకిల ఎండ్రకాయ మొదలగువాని
వలె వికృతంబులు కపిలవర్ణంబులు విషమంబులు నైనకన్ను
లుం గనుపట్టు జనులునుం గలిగి వింతవింతలైన దేశంబులతి

క్రమించి పోవుచు నత్తురంగం బగ్రభాగంబునఁ బిశాచని
శాచరశాకినీడాకినీబేతాళాదుల కాలయంబును సింహశర
భశార్దూల గండభేరుండ వేఁదండగండకశశవ రాహాదినానా
మృగసమూహంబులకు శరణ్యం బైనయరణ్యంబు ప్రవే
శించె. అందుఁ బాపంబులు కాఁపురము సేయుతావును
నశుభంబుల కాలయంబును జనలోకభయంకరంబు నగు
దనుజపురం బొక్కటి కలదు. అప్పట్టణంబున మూఁడుకోట్ల
దానవులు పార్శ్వంబులం గొలువ నిర్దయచిత్తుండును దం
ష్ట్రాకరాళవదనుండును గ్రూరకర్ముండును గీలునకుఁ బదివేల
దిగ్గజంబుల సత్తువ గలవాఁడును భీషణాకారుండును నైన
బకాసురతనయుండు భీషణుం డనునామధేయంబు గల
వాఁడు రాజై యుండు. తత్సమీపంబునం దొక్కపర్వత
గుహలోఁ బ్రాణిహింసాదీక్షితుండును భీషణాసురునకుఁ
బురోహితుండును నైన బ్రహ్మరాక్షసుం డుండు. వాఁడు
నిడుపులైన ప్రేవులజందెంబులును నెత్తుటిపట్టెవర్ధనములును
కపాలజపమాలికయుఁ బచ్చిచర్మం బనుమొడికాషాయవస్త్రం
బును నేనుంగుతలకమండలువును గర్ణపవిత్రంబులును వెన్న
ముకయూఁతకోలయుం గలిగి మేదోహోత యనునామధే
యంబున వర్తించువాఁడు నర్జునుని యశ్వమేధాశ్వంబు
వచ్చుటం జూచి భీషణాసురుని చెంగటికివచ్చి దీవించి యి
ట్లని విన్నవించె. "దానవేంద్రా! మీతండ్రి యగుబకా
సురుని బలాతిశయంబున భీముఁడు చంపె. వానితమ్ముం

డగునర్జునుం డశ్వమేధాశ్వంబు వెంబడి మనవీటిచెంగటికి వచ్చె. తండ్రి నిజంపినపగ దీర్చుకొనుటకిదియేసమయంబు నీవు నరమేధం బనుయాగంబు సేయుము. నేనొద్గాత్రంబు సవరించెద. నేఁజేయు వ్రతంబులువినుము. ఆషాఢమాసంబునఁ బౌర్ణమాసియందుసన్న్యాసులరక్తంబులనుజలంబులేయాహారంబుగాఁ దపంబు సేసితి. శ్రావణమాసంబున విధవలందల దీయకయే పండుటాకులకరణి మ్రింగి వ్రతంబు సలిపితి. భాద్రపదమాసంబునఁ బాశుపతవ్రతదీక్షాపరుల గుండెకాయలు కందమూలఫలంబులం బోలె నశనంబు సేయుచు నియమంబు నెఱవేర్చితి. ఆశ్వయుజమాసంబున బ్రహ్మచారులఫలాహారంబు సేయుచునిష్ఠాసమన్వితుండనై యుంటిని. ఇవ్విధంబునఁ జాతుర్మాస్యవ్రతంబు సలిపి కార్తికమాసంబునఁ గన్నియల భక్షించి పారణసేసితి. ఈపురంబునఁ బెక్కండ్రు బ్రహ్మరాక్షసులు గలరు. వార లిత్తెఱంగున నియమంబు నడుపం జాలరు పుణ్యకాలంబు వీటింబుత్తురుం. అది యట్లుండెనిప్పుడుబ్రహ్మరాక్షససహస్రభోజనంబు సేయ సంకల్పించి నరునిబలంబులనెల్లదారవోయుము. అనిన విని భీషణుండు కొద్దిగా నవ్వుచు నీకుంగావలసినభోజనం బెద్ది. ఏమాత్రంబు భక్షింపఁ జాలుదువు. తెలియం బలుకు" మనియె.

తదనంతరంబ యాబ్రహ్మరాక్షసుండుబలపరాక్రమవంతు లున్నతాకారు లాజానుబాహులును మూర్ధాభిషి

క్షత్రియులైన రాజకుమారుల వేయిమందిని గజతురగవీరయో
ధుల తలమొగళ్ళు కూరలుగా మెసవంగలవాఁడ నింతమా
త్రంబు దయచేయవలయు నని దనుజనాయకుండు నవ్వి
చేతం జేయప్పళించి "బ్రహ్మరాక్షసోత్తమా! ప్రాణహింసా
యజ్ఞంబు నేఁ జేయం బూనితి. తగినయాగోపకరణంబులు
సంపాదింపుము." పొమ్మని యనిపి భూమి గ్రక్కదల దిక్కు
లు పిక్కటిల్ల రణభేరి చఱవం బనిచి హుంకారాట్టహాస
సింహనాదభుజాస్ఫాలనభేరీభాంకారభయంకరంబుగా నాప్త
బలంబులతోఁ బురంబు వెలువడి శాత్రవశోషణుండైన
భీషణుండు భండనంబునకుం గడంగునప్పుడు జగడంబు సూచు
వేడుక మీఱ పోలదిండిపడంతులు బంతులుగా వెడలి
రెండు యోజనంబులు మూఁడు యోజనంబులు నాల్గు యోజ
నంబులు నిడివియైన చన్నులును, దావాగ్నిదగ్ధంబులైన కొం
డచఱులం బోలె భీకరంబులగు మొగంబులు, ప్రళయకాల
మేఘమాలికలం బోని యాకారంబులును గలిగి భువన
భయంకరంబుగా ముచ్చటలాడుచు వచ్చి పర్వతశిఖరంబు
లెక్కి పాండవసైన్యంబుఁ జూచి యర్జునరథధ్వజంబున
మంతు మెఱయు హనుమంతునిం జూచి "వీఁడు గదా తోఁక
చిచ్చున లంకసివుఱు సేసినమర్కటంబు. సప్తమంత్రికుమా
రులఁ బంచసేనాగ్రగుల జంబుమాలి నక్షయకుమారుని మా
రిమసంగిన క్రోఁతి. వీఁడేమిటి కీడవచ్చినాఁడు? వీఁడు దాన
వుల వేరుపిత్తు" అని కలంగఁబడు సమయంబున నొక్క బలు

రక్కసి వారల నోడకుం డనిభయంబు దీర్చి తా నొక్కతె యు నాకసంబున కెగసి నల్లమబ్బుకరణి మైపెంచి హుంక రింపుచు వేడెంబులువాఱుటయు మూఁడుయోజనంబుల నిడివి యైనదానిచన్నులచేతం గొట్టువడి యర్జునసైన్యం బులు దైన్యంబునొందె; నింత దక్కినరాక్షసవనితలు నవ్వి ధంబుననె కుచతాడనంబులఁజతురంగబలంబులం గీటడం గించుటయుఁ గేతనస్థితుం డైనవాయుపుత్త్రుండు మహోగ్ర కోపంబున గర్జించి వాలంబు పెంచి వారలకంఠంబులు బిగి యించి పర్వతశిఖరంబులం గొట్టియుఁ బయోరాశిలోన నైచియుఁ బదిదిక్కులం ద్రిప్పివైచియు ముష్టిఘాతంబుల మోఁకాటిపోటుల మోఁచేతికుమ్ములనఱచేతిపెట్టులఁ బెడ చేతిదెబ్బలఁ జెంపకొట్టులఁ బాదఘాతంబులం గడపి య ద్దానవభామలం దెగటార్చుచుండె.

## —: అర్జునుండు భీషణుం జంపుట :—

అంత భీషణాసురుండు రథచక్రఘోషంబును ధను ర్గుణరావంబును దుందుభిధణంధణాత్కారంబు నురోదసీ గహ్వరంబునం బ్రతిధ్వనులుసంపాదింప బిరుదకేతనప్రభలు రవిమండలంబుఁ గబళింప నమరేంద్రనందనుం దాఁకుటయు నుభయబలంబులు గభసంబుగాఁ బోరసంబయ్యె నప్పుడు దానవేంద్రుం డింద్రనందనుమీఁద నైదుశరంబు లేయుట యుఁ గిరీటి మూఁడుబాణంబులు నాటించె. అసుర యూ ఱు తోమరంబు లడరించుటయు సురేంద్రసూనుం డయిదు

నాగసంబులం గ్రుచ్చి యొక్కయర్ధచంద్రబాణంబునం గోదండంబు ఖండించిన, దైత్యేయుండు వేఱొక్క కార్ముకంబు సజ్యంబు గావించిన, సవ్యసాచి దానిగుణంబుతోం ద్రుంచె. రాత్రించరుండు చక్రంబుం బ్రయోగించిన నరుండు నడుమన తునుమాడె. బకతనూభవుండు ఖడ్గంబు జడిపించిన, బకవైరితమ్ముండు మొసలివాళ్లెలందికి ఖండించె భీషణుండు భీకరశక్తి వైచుటయు, ఫల్గునుండు దానిం బదితునియలు గావించెం. రాక్షసేశ్వరుండు పర్వతంబై చనుదెంచిన, నరుండు వజ్రాస్త్రంబు వేసె. పుణ్యజనుండు మహారణ్యంబై క్రమ్మిన, వివ్వచ్చుండు చిచ్చుబాణం బేసె. క్రవ్యాదుండు నీలజీమూతం బగుటయు, భీమానుజుండు వాయవ్యాస్త్రం బేసె. మఱియు నసుర సింహశార్దూల మృగ వృశ్చికాది రూపంబులం జనుదెంచిన, ధనంజయుండు నమ్మైబాణంబులం జదిపె. అవ్వేళ నొక్కమునీంద్రుండు పార్థుకడకుం జేరి బహువిధంబు లగుకథాప్రసంగములు గార్యకలాపంబులుం బలుకుచు మోసంబు సేయం జూచిన, దానిం దానవమాయగాం దెలిసి విజయుండు గపటమౌనిం బరిమార్చె అంత నప్పాలదిండి గదాదండంబు కేలం గైకొని కదియ వచ్చుటయుం బాండుతనూభవుండు గల్పాగ్ని కీలాకల్పంబును గనకపుంఖవిరాజితంబును గంకపత్రవిచిత్రంబును నగుబాణం బొక్కటి యేర్పఱిచి గాండీవంబు గుణసుపడం దిగిచి, యే యుటయు వజ్రాయుధంబున ఖండితంబైన శైలశృంగంబు

కరణి దైత్యునిశిరంబు పుడమిం గూలె. అవ్విధంబునదను జూని వధియించి తత్పురంబునం గలసమస్తవస్తువులుం జేకొని యవ్వలం బోవునెడ, నయ్యశ్వంబు మణిపురంబుచాయకుం జనియె.

అంతఁ బద్మరాగమణిమయాకారంబు లైనప్రాకారంబులును బాతాళంబు నంటిన యగడ్తలును నమరావతీపురంబున కంతటంతటం గనుపట్టుగోపురంబులును నింద్రసౌధం బైనవైజయంతంబుతోఁ బంతంబు లాడుసౌధంబులును నిజధర్మంబు దప్పనిచాతుర్వర్ణ్యజనంబులును శత్రుచమూభయంకరంబు లగు చతురంగబలంబులును వివిధవస్తుసమృద్ధంబు లైనయంగడివీథులును బల్లవకుసుమఫలభరితంబు లైన యారామంబులును నానావాద్యఘోషితంబు లైన దేవాలయంబులును గలిగి, యలకాపురంబు నదలించుచు నమరావతి నెదిరించుచు నతులితైశ్వర్యధుర్యంబును నాశ్చర్యకరంబును బభ్రువాహనభుజాపరిపాలితంబును నైన మణిపురంబు గనుపట్టిన, నింద్రునిముద్దుపట్టి హంసధ్వజునిం జూచి ముందటిపట్టణం బెవ్వరిదనుటయు నతండు "భవదీయకుమారుండును బాలభానుసమానతేజుండును నగు బభ్రువాహనుం డేలుపట్టణం బిది. వైరివీరనరపాలకులకంఠంబులనియెడుకదళీకాండంబులకు అంపం బనం బ్రసిద్ధిగాంచి బలపరాక్రమసంపన్నుం డైనయీకుమారునికి మాఁవంటి రాజులు వేవురు సహస్రహాటకభరితంబు లైనశకటంబును

కానుకగా నిచ్చి పొడగన వత్తురు. నీవు తండ్రివని తాను కుమారుండనియు మేర దప్పక యితం డూరకున్న లెస్స గాక యెదిరించి తురంగంబు పట్టించినేని యెట్టువంటి వారికేనియు నెదిరింప శక్యంబు గాదు." అనిపలుకు నవసరంబున, సుబుద్ధి యనం బరఁగిన బభ్రువాహనుని సేనాపతి వేడుకగా నరాశంబుగా నచ్చి మగుడునప్పు డత్తురంగంబుం గాంచి పట్టుకొని వచ్చె. అప్పుడు సామవేదమయం బైనబింబంబునం గనుపట్టుచు నాదిత్యుండు పశ్చిమసముద్రంబునం గ్రుంకె. పక్షు లంతరిక్షంబున వివిధనాదంబులు సేయుచు గూండ్లు చేరం జనియె. తారకానికరంబు లింతంతటం దోఁచె. దిగంతంబు లంతంతకుం గొంచెంబు లయ్యె. చీఁకటులు వేఁకటులయినకరణిం బెరిఁగె. ఇవ్విధంబున సద్యుం డస్తమించు సమయంబున సుబుద్ధి పురంబునకు వచ్చె. కెంపుగోడలు మగరాలనెలకట్లు పగడాలకంబంబులు దంతపుఁదలుపులు బంగారుసోపానంబులు ముత్యాలచూరుమొగ్గలు కుందనంపుబొమ్మలు చీనాంబరంబులమేలుకట్లు నగరుసాంబ్రాణిధూపంబులు గలిగి, పెంపొందుకొలువుకూటంబున మూర్ధాభిషిక్తులైనమండలాధీశ్వరులు కొలువునకై సందడింప, రెండవమాఖండలుండునుంబలె బభ్రువాహనుండు కనకరత్నమయంబు లైనకరదీపికాసహస్రంబులు పగలువత్తులు వియత్తలంబు పట్టపగలింటికరణిం జేయ నిండోలగంబున నుండె.

ఆసమయంబున బంగరుపల్లంబులు పక్కెరలు మో
ముట్టులు సింహపుందలాటంబులు చామరంబులు కనకమయం
బులైన కళ్లెంబులుం గలిగి నశకసింధ్వారట్టకాంభోజాదిహ
యంబులం దెప్పించి కనుంగొనుచుండు నవసరంబున సుబుద్ధి
భూజానికి మ్రొక్కి యత్తురంగమశ్రేష్ఠంబు కానుకగా నర్పించె.
అవ్విభుండు దానియాకారరేఖాలక్షణంబుల కాశ్చర్యంబు
నొందిసమీపంబునకుం దెప్పించి మొగంబు నిమిరి లలాటం
బునం గనుపట్టు కనకపట్టికతీసి, రాజాధిరాజపరమేశ్వరాష్టది
గ్రాజమనోభయంకర రాజమార్తాండుం డైనయుధిష్ఠిరునిచే
విసృష్టం బయ్యె. నిటలాక్షు నెక్కటికయ్యంబున గెలిచిన
కిరీటి యిత్తురంగంబున కంగరక్షకుం డనుదెంచె. ధారుణీ
శూరులు గలరేని పట్టుదురుగాక. అనియెడు బిరుదుగ
ద్యంబు చదువుకొని బభ్రువాహనుండు సుబుద్ధినిం జూచి
సాదరంబుగా "మాపెద్దతండ్రియు నసమానపరాక్రముండు
నైన యుధిష్ఠిరుండశ్వమేధంబు సేయ దీక్షించి విడువంజను
దెంచిన దీహయంబు. దీనికి మాతండ్రి సహాయంబుగా వచ్చె.
ముక్కంటి నొంటి పోట్లాటం గెలిచిన నెఱజోదు. ఇం
ద్రుని యర్ధాసనం బెక్కినమహామహుండు. కాలకేయాది
దానవులం గీటడంగించిన త్రైలోక్యమల్లుండు. చిత్రాంగ
దానాయకుం డిచ్చటికి విజయంబు సేసె; ననిన నాభాగ్యం
బెంతని వర్ణింతు! ప్రభాతకాలంబున మాతండ్రి సమ్ముఖం
బునకుం బోవలయు. వలయు వస్తువ్రాతంబులు సమకూ

ర్పుము." అని యానతిచ్చి మంత్రుల నిజనివాసంబుల కనిచి బభ్రువాహనమహీకాంతుం డంతిపురంబునకుం జనియె. అంతం బ్రభాతకాలం బగుటయు, మణిపురాధీశ్వరుండు నిదుర మేల్కాంచి కాల్యకరణీయంబులు నిర్వర్తించి మణిభూషణాంబరగంధమాల్యాలంకృతుండై సామంతమంత్రిపురోహితదండనాయకులు గొలువ, శుభలక్షణవిరాజి యైన తేజి నెక్కి కంచుకులు సాహోనినాదంబుల హెచ్చరికలు దెలుపం, బౌరపురంధ్రీనివహంబులు గుసుమాక్షతలు సల్ల, వందిమాగధవైతాళికులు పాఠకులు బిరుదు గద్యంబులం గైవారంబులు సేయ, శంఖభేరీ మృదంగబిరుదకాహళంబులులియం, జతురంగవాహినీపరివృతుండై మేరుశైలంబు కైలాసరిగియుం, బెల్లగించి తేనిమాత్రంబె కాని యంతకంటెం దక్కువ కాని బంగారు వెండి రాసులును, మలయశైలంబు తేనిదోషంబ కాని యంతకంటె గణనకు మించిన గంధసారంబులును, గంధమాదనగిరి తేలేదనినమాత్రంబె కాని యంతకుం గడమ లేని కర్పూరంపుం బెళికలును, రోహణాచలంబు తేకున్న మాత్రమె కాని యంతకంటె వెలితివడనిం రత్ననికరంబులును, దంష్ట్రికిం గానుకలు దెచ్చి మేలు మేలని సకలరాజులుంగొనిచూడ బభ్రువాహనుం డధ్వరాశ్వంబు గొనుచు వచ్చి మెక్కినగుఱ్ఱంబు డిగ్గి విప్పచ్చు చెంతకుం జేరి క్రొత్తముత్తియంబులు పాదంబులపయిం బోసి సాష్టాంగదండప్రణామంబు సేసి నిన్నం దప్పిదంబుగా మాటాడుమ హ

యంబుఁ బట్టితెచ్చె; నీయపరాధంబు సహింపుము. బిడ్డ లెంత నేరక నడిచినం దండ్రికి సహించు టుచితంబె కద. అని వెండియుఁ బాదంబులపయిం బడియె.

అంతఁ బాండవమధ్యముండు గంగానదీశాపంబువలన విపరీతకాలం బగుటం జేసి బుద్ధిభ్రంశంబు నొంది యాగ్రహం బుడుపలేక రత్నమయంబగునతని కిరీటంబు వీడిపడం దన్నుటయు సందలిరాజులందఱు హాహాకారంబులుచేసిరి. అప్పుడు బభ్రువాహనుండు మొగంబున వికారంబు నొందక చేతులు గట్టుక యూరకున్న సాత్యకి తనయునింగృపఁజూడు మనియె. కర్ణనందనుం డింత కోపంబేమిటి కనియె. హంసకేతనుం డింతగర్వం బేమిటి కనియె. నీలధ్వజుం డింకనైన మన్నింపు మనియె. ప్రద్యుమ్నుం డిది యేమి రిత్తగొడవ లనియె. కృతవర్మ యిది తగవు గా దపకీర్తి యనియె. అనుసాల్వుం డయుక్తం బనియె. యౌవనాశ్వుం డీచందంబు నీవంటివాని కర్హంబు గాదనియె.తక్కినరాజు లందఱు వేనవేలభంగుల విన్నవించినఁ బార్థుం డంతకంతకునగ్గలంబగు కోపంబునఁ జూఱుచుఱం జూచుచు "నోరి పందా! ముందఱ బఱతెంచు గుఱ్ఱంబు పట్టికొని యాపిఱుందన వచ్చునీదళంబులం గనుంగొని ప్రాణభీతిచేఁ గదనంబునకుం బ్రాలుమాలి కాళ్లమీఁదం బడియెదవు. నీవు నాకు జనియించుట కల్ల. చిత్రాంగదావధూటికిం గోమటివానికిం బుట్టినవాఁడవు. నాకెదుఱుగానుండక పొమ్మనిన నారాచశరామనుండు

పొక్కపడుచు నన్ను నే మన్న సేమి సేసినం గొఱంత లేదు. పరమపతివ్రతాతిలకంబును సీతాసమానచారిత్రయు నుభయకులపవిత్రయు నైనమాతల్లిని దూషించితివిగావున నే విసంజాల; ని వేమి సేతువు, నావినయం బింతకు దెచ్చెఁ, బెక్కుమాటలేమిటికి? ఎక్కటిపోరునన్ జయించెదో, దళంబులు సహాయంబుగాఁగొని పోరెదో, ఆయత్తమ్ము గమ్ము, లెమ్ము. నేను క్షత్రియకుమారుండ నగుటయు, వైశ్యపుత్రుండ నగుటయుఁ, జూచెదవు. అని తెచ్చినకానుకలు పురంబునకు మగుడ ననిచి, యశ్వంబు లాయంబునకుం గొని పొమ్మని మొగంబున గంటువెట్టుకొని గిఱుక్కున మరలి రెండుగడియలదూరం బవ్వలికిం జని, సుబుద్ధి యనుసేనాపతిం జూచి సైన్యంబుల నొక్కముఖంబుగా మోహరింపం యుయమనుటయు సైన్యపతియుఁ గనకకింకిణీఘంటికా కేతనపతాకాలంకృతంబు లైనయేడుకోటులు రథంబులును, గీలుమదంబునం బొదలు భద్రగజంబు లర్బుదంబులును, జటులధాటిని రాఘాటంబులును, మనోహరంబులును నైన తెల్లగుఱ్ఱంబులు రెండర్బుదంబులును, సమరకర్కశులు బాహుబలధురీణులు నైనవీరభటులు మూఁడర్బుదంబులును, గ్రందుకొనఁ గాలచక్రాకారంబును నాహవభయంకరంబును, నగుమోహరంబు సంఘటించె. అప్పుడు కపికేతనునిపాలికిం దోఁచు ధూమకేతుచందంబునసీలమణిదండమండితం బైనమయూరధ్వజంబును గనకమయనిర్వక్రంబు లైనచక్రంబులును దిర

స్ఫురితవజ్రాయుధంబు లైనయాయుధంబులును మరకతమణి నిభాంగంబు లైనతురంగంబులునుం గలిగి సఫలితమనో రథం బైనరథంబు నెక్కి బభ్రువాహనుండు బాణబాణాసన తూణీర కరవాల ఖేటక కవచ తలత్రాణ శిరస్త్రాణంబులు మెఱయ భద్రగజంబులమీఁదం గముకించు సింగంపుఁగొదమ తెఱంగున నెదురుగా మోహరించి నిలిచె.

తదనంతరంబ యుభయబలంబు లొండొరులం దాఁకి పూర్వపశ్చిమసముద్రంబుల తెఱంగున నేనుంగు లేనుంగులు నశ్వంబు లశ్వంబులును రథంబులు రథంబులును గాల్బంట్లు కాలుబంట్లును సేనాపతులు సేనాపతులును దొరలు దొరలునుం గాఁ దలపడి నెత్తుటేఱులు మాంస పర్వతంబులు మేదోమస్తిష్కపంకంబునుం గలుగునట్లుగా ఖడ్గాఖడ్గి దండాదండి బాహాబాహి కచాకచి యుంగాఁ బెనంగునెడ బభ్రువాహనుండు తేరు గదియం దోలించి క్రీడి నుద్దేశించి "తండ్రివి గావున వందనంబు సేసెద. నేను వచ్చినయెడ మేర మీఱినమాట లాడితివి. నాపరాక్రమంబు చూడం గోరి యవ్విధంబునఁ బలికితఁ నేమి. నీతలపు నెఱవేర్చెద. ఇంక శంకింపఁ బని లేదు. కార్ముకంబుఁ గైకొనుము. నీవు గురుండవు గావున మున్నుగా బాణంబులు నాపయిం బ్రయోగింపుము." అని పలుకు నవసరమ్మున ననుసాల్వుండకుక్కనూరు నెదిరించి కార్ముకంబు గుడుసుపడం దిగిచి తొమ్మిదియమ్ములు నిగిడించుటయు నది సర

కుఁగానక చిత్రాంగదానందనుండు చిలుకతెక్కలు గీలు-
కొలిపిన వాలికలకోరికోలలు నూఱు ప్రయోగించిన, వాఁ
డవి నడిత్రోవ నేతునియలుగావించి శతసహస్రసంఖ్యాకంబు-
లగుకంకపత్రంబు లేసె. ఈచందంబున సింహవిక్రము
లైనయయ్యిరువురు శిలీముఖనఖంబుల మేనులన్ గ్రుచ్చుచుఁ
జూచిన మోమగుల తెఱంగున దురంబు సేయునవసరంబునఁ
బాండుపౌత్రుండు నాలుగురాచరంబుల నశ్వంబులను
నయిదు ప్రదరంబుల సారథిశిరోధియు నేడువాఁడితూపులఁ
గార్ముకంబును నెనిమిదివిశిఖంబుల రథంబునుం దుత్తుమురు-
గావించిన, ననుసాల్వుండు నూతనశతాంగారూఢుండును
సజ్జీకృతకార్ముకుండు నై చండకాండంబులం బాండుపౌత్రు-
నిం దూఱించుటయు, నతండును రోషావేశంబున శస్త్రవర్షం-
బులు గురిసి క్రమ్మఱ విరథునిం గావించిన, ననుసాల్వుండు
గదకరంబునం గైకొని యెదురుగా నడిచినఁ, దొమ్మిదిచిలు-
కుటమ్ము లురంబున నాటించిన, నతండు రిమ్మవట్టి భూతల-
మ్మున వ్రాలె. అంతఁ బ్రద్యుమ్నుండు విద్యుల్లతాసంకాశం-
బైనబాణాసనంబు మండలాకారంబుగా దిగిచి ప్రదరవర్షం-
బులు గురియుచు ననుసాల్వునకుం బ్రాపై యెదిరించిన,
బభ్రువాహనుండు బాహువిజృంభణంబున లక్షలకొలందు-
లగుతీక్ష్ణబాణంబులు ప్రయోగించిన, శ్రీకృష్ణకుమారుం-
డనంగుం డనుపేరు యథార్థంబుగా నావరింపంబడి యేదు-
వెరఁగినచందంబునం గనుపట్టి సమస్తవ్యాపారంబులు మఱచి-

ముందు వెనుక దోఁచక తిరుగుడుపడుచు నుండు సమయం బునఁ బార్థకుమారుండు చతురంగబలంబులం గసిమసంగు టయుఁ, బ్రద్యుమ్నుండు గొంతతడవునకుం దెలివిం జెంది బభ్రువాహను దేహంబును దనయట్లు శరమయంబు గా వించి యతనిసైన్యంబులలోనం జొచ్చి కఠోరంబులును గాలదండోపమానంబులును గనకపుంఖ పుంఖితంబులును నైనకాండంబు లకాండప్రళయ జలధరంబుగతిం గురిసిన, మ్రగ్గుమదావళంబులును, బడుమావంతులును, గెడయురౌతు లును, దున్నుకొనుగుఱ్ఱంబులును, నఱవఱలైన యరదంబు లును, జచ్చినరథికసారథులును, బొలిసినవీరయోధులును, దుమురులైనచక్రగదాకుంతతోమరముసలముద్గరపట్టిసాది సాధనంబులును, జినిగినమైజుళ్ళపులును, ఛిద్రంబు లైన శిరస్త్రాణంబులును, బాడైయైనచిందమ్ములును గాలికిం బోవు చామరంబులును, జూర్ణంబు లైనభూషణంబులునుం గలిగి మృత్యువిహారస్థానంబునుం బోలె రణాంగణంబు దుర్నిరీ క్ష్యంబయ్యె. అప్పుడు శాకినీఢాకినీభూతభేతాళకూష్మాండబ్ర హ్మరాక్షసప్రేతసంఘంబులుచొరబడిగజకళేబరంబులహాయ కంకాళంబుల వీరభటశరీరంబుల మంచిదిగా నేర్పఱిచి చర్మ ములందిత్తులుగా నొలిచి, జానుజఘనపార్శ్వకంఠాదిస్థానం బులం గలపలలంబు కపాలపాత్రంబులవడ్డించి, పునఃకగిన్ని యలఁ గ్రొత్తనెత్తురులు నించి, చుట్టంబులుం దామును బం తులుదీఱి యాకంఠపూర్తిగా మెసవి చిట్టిముకలు చప్ప

రించి లో నున్న మెదడు పీల్చి, రక్తపూరంబులు గళగళం గ్రోలి తృప్తిం జెంది యాడందొడంగె. అం దొక్కఁడానికి కిరీటకుండలాభిరామంబు లైనరాజులశిరంబులు పదియుఁ బదియు నైదు మింటికెగుర వైచి యచ్చనగం డ్లాడె. ఒక్క శాకిని యేనుఁగుదంతంబు బిఱబిఱఁ ద్రిప్పుచుఁ జౌపదంబుల నటింపం దొడంగె. వే ఱొక్క ప్రేతం బేనుఁగుచర్మంబు మునుంగుచెఱఁగుగా నిడి యభినయింపుచు దేశీయనాట్యం బుసేసె. ఒక్క బేతాళుండు భుజంబుల మేనిచట్టంబులుదగి లించికొని సరిబేసియాటలాడందొడంగె, భూతగణంబులు కరతాళంబులు ఘటియింపఁ బూతనాగ్రహంబులు కపాల కుండలంబులు వసల శల్యహారంబులు పొదలఁ జకచకఝం కృతులతోఁ జిందులు ద్రొక్కం దొడంగె. ఒక్క భైరవుండు గండు మిగిలి....... ...............దశదిసలు గగ్గోలుగా నా ర్చుచు దువాళింపందొడంగె. ఇవ్విధంబున నతిభయంకరం బగు రణాంగణంబున నవక్రపరాక్రముం డగుచక్రికుమా రుండు విజృంభించె

అయ్యవసరంబున బభ్రువాహనుండు తెప్పిఱి రుక్మిణీనంద నునకు నడ్డంబుగా రథంబుదఱిమించి లెక్కకు మిక్కుటంబు లైనయుక్కుటలుఁగులు చెక్కుటయు గూఁటిలో నొదిఁగిన గువ్వలచందంబునఁ గొంతతడవు రౌక్మిణేయుండు తన్నుం గప్పినయట్లు తీవ్రవిశిఖంబులచేఁ జిత్రాంగదాసుతునింగప్పిన నతండు గమకించి కృష్ణతనూభవు రథంబుఁ బెక్కుశకలంబు

లుగా ఖండించిన జనార్దనతనూజుండు వేఱొక్కరథంబధి రోహించిన నదియును ఖండించె. ఇవ్విధంబున నరగడియ లో నిరువదియరదంబులు ద్రుంచిన మీనకేతనుండు కపికే తనకుమారకునికరలాఘవంబుఁ గొనియాడుచునతండెక్కిన రథంబుతునకలుసేసినఁ, బాండ్యపతి వేఱొక్కరథంబెక్క నదియునుం ద్రుంచిన మఱియొక్కస్యందనం బధిరోహించె. ఇత్తెఱంగున యాదవకుమారుండు త్రుంచిన యరదంబులు లెక్కపెట్టం దరంబు గా దయ్యె. అంత నయ్యిరువురు దివ్యాస్త్రయుద్ధంబు సేసి తనివిసనక చక్రంబు గదయుఁ గత్తి కేడెంబు గండగొడ్డలియుం బ్రాసంబు ముసలంబునుం గైకొని యురవళ్ళు మీఱుపకువళ్లు మెఱయ సాహసమొలఁకు వలు చూపఱకు నయనానందంబు సేయఁ బ్రాపునం దూఁ చినచందంబున నెక్కువతక్కువలు లేక పెనంగుచు మనో గతంబులైనక్రోధాగ్నిజ్వాలలు వెలి కుఱికెనో యను తెఱం గున గాయమ్ములం, గ్రమ్ము రుధిరమ్ములుకుంకుమరసమ్ములకరణి నెమ్మేను లలంకరింపఁ గోదండంబు లూఁదికొని వింటికొప్పు లం దమమోములు చేర్చికొని సొమ్మసిలియుండిరి. అప్పుడు బభ్రువాహనుండు గాండీవగుణధ్వని చెవులం బడుటయు మూర్ఛ తెప్పిఱి శరశరాసనంబులు గైకొని తొల్లి కుశుండు శ్రీరామచంద్రునితో నెదిరింపం గడంగినచందంబున గాం డీవితో భండనంబు సేయం జనుదెంచె.

## —: కుశలవోపాఖ్యానము :—

అనిన విని జనమేజయుండు జైమినిం గనుగొని సీతాకుమారులం దైనకుశునితో శ్రీరామచంద్రుం డేమిటికి యుద్ధంబు సేసె ననిన మునీంద్రుండు నరేంద్రునిం జూచి దురితహారంబును శుభకరంబును మనోరథప్రదంబును విఖ్యాతంబు నైనకుశలవోపాఖ్యానంబు వినిపించెద. సావధానచిత్తుండవై వినుము. శ్రీరామభద్రుండు తండ్రి పంపునం బదునాలుగు సంవత్సరంబు లరణ్యంబునం దపంబు గావించి రావణకుంభకర్ణమేఘనాదప్రముఖ రాక్షసుల సమయించి తన ప్రవేశంబు వలన ననలునిం బావనంబు సేసిన జానకీదేవిం జేపట్టి సౌమిత్రివిభీషణసుగ్రీవజాంబవత్ప్రముఖులైన యోధవీరులు గొలువ, నయోధ్యానగరంబునకు వచ్చి, పురజను లెదుర్కొనం బుష్పకంబు డిగ్గి వసిష్ఠమహామునికభివాదనం బొనర్చి తల్లులకు మ్రొక్కి, తనకు వందనంబు సేసినభరతశత్రుఘ్నులం గౌఁగిటం జేర్చి సుమంత్రుండు మొదలగు మంత్రిజనసంతానంబు దీఱ వారివారి నాదరించి పతివియోగదుఃఖితయు నిజవియోగక్లేశితయు నైనకౌసల్యకడకుం జని దండప్రణామం బొనర్చుటయుఁ దనయునిఁ గౌఁగిటం జేర్చి గద్గదస్వరంబున "అన్నా! రాఘవా! మున్ను వసిష్ఠాదిమునులు నన్నుం జూచి "నీకుమారుం డక్షయకుమారుం డాద్యుండు నప్రమేయుండు నచ్ఛేద్యుండు నభేద్యుండు నఖిలలోకాధీశ్వరుండు" నని పలుకరించిన దబ్బఱగా నెంచి

యుండితి. ఇప్పుడు జలధిబంధనంబును దశముఖసంహారం బును జేసి బ్రహ్మరుద్రాదిదేవతాపూజితుండవై యేతెంచుట కతన, దద్వాక్యంబులు నిజంబు లనితోఁచె" ననిపలుకుసంబ పలుకులకు శ్రీరఘువీరుండు సంతసించుచుఁ బురందరవైభ వంబున నయోధ్య వేంచేసి పట్టాభిషిక్తుండై రాజ్యపరి పాలనంబు సేయుచుండ, వృక్షంబులు సర్వకాలంబులం దును గిసలయకుసుమఫలభరితంబు లయ్యె. ధేనువు లపా రంబుగా క్షీరంబు లీయం దొడంగె. తగినవతి వారకుట వలన ధరణీతరుణి నిశ్చలత్వంబు నొందె. తస్కరభయంబు లున్న యయ్యె. పుత్రశోకంబులు లే వయ్యె. వైధవ్యం బులు రావయ్యె. ప్రాణులు రోగంబు లెఱుంగరైరి. నెల మూఁడువానలు గురియసాగె. ధాత్రీతలంబు దున్నకయె పండె. ధారణపోఁకకుఁ బుట్టెఁడయ్యె. ఈతిబాధలొక్కటి లేవయ్యె. ఇవ్విధంబున శ్రీరామచంద్రుండుగుణత్రయంబు తోడం గూడినపరతత్త్వంబుచందంబున ననుజత్రితయంబు తోఁ గూడ జలధివలయవేల్లితం బైనజగతీతలంబు నేలు చుసీతాసమేతంబుగా సిష్టావభోగంబు లనుభవించుచుఁ దొ మ్మిదివేలసంవత్సరంబులు ధాత్రిపాలనంబు సేసి "యపుత్రు లకు లోకంబు లేదుగదా" యని యూహించి మనుజమా త్రునిచందంబునఁ బిత్ర్యాణంబు దీఱునుపాయంబు యో జనసేయుచుఁ బుత్రార్థియై సంతాపంబునం గుందుచుండ, జానకి శ్రవణానక్షత్రచతుర్థపాదంబునఁ జరమలగ్నంబునసజ

నిం బట్టణంబు వెడలింపం జాణుముహూర్తంబునఁ బ్రథమ గర్భంబు దాల్చె. అంతనాలవమాసంబునఁగడపటిదినంబు ప్రభాతకాలంబున లక్ష్మణుండు సీతాదేవింగొనిపోయియడ విలో విడిచి వచ్చునట్లుగాఁ గల గని దిగ్గన లేచి మనం బునం గలంగుచు సంధ్యాదివిధులు నిర్వర్తించిగురుండైన వసిష్ఠమహామునితో నిశాచతుర్థయామంబునం గన్నకల తెఱం గెఱింగించిన నమ్మునీంద్రుండు రఘూద్వహుం జూచి "భావికార్యంబు గాక మానదు. శీఘ్రంబుగా జనకపుత్రికి బుంసవనాదికర్మంబు లాచరించి గర్భసంరక్షణంబు సేయం దగు తమ్ముని బంపి సత్వరంబుగా జనకుని రప్పింపుము. ఐదవమాసంబునందు శుక్లపక్షసప్తమీదినంబున నిరువురకుఁ జంద్రతారాబలంబులు పొసంగియున్నయవి. నాఁటికి ధను ర్లగ్నంబున సీమంతపుంసవనంబులు సేయందగినయవి" అని ముహూర్తనిర్ణయంబు సేసిన రఘువీరుండు జనకునిం దో డ్కొనివచ్చుటకు సౌమిత్రిం బనిచి వసిష్ఠ వామదేవాదు లునిచినలగ్నంబునఁ బండ్రెండుగడియలదూరంబు చౌకం బుగా నింద్రనీలమయంబులును వజ్రఖచితంబులును వైడూ ర్యనిర్మితంబును దప్తకాంచనఘటితంబులు నైన స్తంభం బులు నిలిపి పెండ్లిచవికె వేయించె.

తదనంతరంబ జనకమహీపతియు యుధాజిత్తు మొద లయినబంధువులు వచ్చుటం జేసి సప్తమీదినంబున వసిష్ఠ మహాముని వామదేవాదులతోడం గూడ నాజ్యతిలచరు

హోమంబులు గావించి సీతాదేవికొప్పున ములుపందిముం డ్లతోఁ గూడ సూత్రవేష్టంబు సేసి, గోదుమపూసలపేరు నత్తికాయపూసలపేరు నాగమోక్షవిధానంబున నాజగదంబ గళంబున నిలిపి, శంఖభేరీమృదంగఝల్లరీమురజగంభీరధ్వనులు దిశామండలంబు నిండ బ్రాహ్మణులకుఁ గనకరత్నాంబరగజతురగాదిదానంబులు గావించి, మహీసురులతోఁడం గూడ బాంధవులం బంతులు తీర్చి బంగరుపళ్ళెరంబులం బహువిధాన్నంబులు భుజియింపం జేసి భూసురాశీర్వాదంబులుగైకొని మహోత్సవంబు సేయుటయుజనకమహారాజు తనకోరిక నెఱవేఱుటవలన నానందభరితమానసుండై యమ్మహోత్సవంబు చూచి తనయేలురాజ్యంబు నెల్ల నల్లున కొసంగి విశ్వామిత్రునితోఁ గూడఁ దపోవనంబునకుం జనినఁ, గాకుత్థ్సుండు సర్వసర్వంసహావలయంబు నేకాతపత్రంబుగా నేలుచున్నయెడ నొక్కనాఁడేకాంతంబునజానకీకాంత కాంతునితో నిట్లనియె. "వల్లభా! నాయుల్లంబున నొక్కకాంక్ష యున్నది. నీవు నెఱవేర్పవలయు. గంగా తీరంబునం దపంబు సేయు తపసియిల్లాండ్ర తోడం గూడ వనంబుల విహరింపుచు నుండం గోరెద" అనిన రావణాంతకుండు గుండెజల్లన నీయొప్పులకుప్ప యింతయొప్పనికోరిక గోరునే? యని వగలం బొగులుచుఁ దొల్లిపదునాల్గుసంవత్సరంబు లడవులలో నిడుములు పడినదియునుం జాలక యిప్పుడు నదియ కోరె. నేను దొలుతఁ గన్నదుస్స్వప్నంబను

లతిక కిది ఫలం బయ్యె నని నిశ్చయించి "ఔమ్మా! యటుల కానిమ్ము, రేపటికినిన్ను వనంబులకుం బనిచెద" ననియభ్యంతరమందిరంబున కయ్యింతి ననిచి యున్నసమయంబునం బ్రతిహారి యరుగుదెంచి పౌరవృత్తాంతంబులు దెలుపుటకుం జారులు వచ్చియున్నవా' రనిన రఘువీరుండు వారలం బిలిపించిన నందఱు వందనంబులు సేసి కేలుమోడ్చి వరుసగా నిలుచుటయు, "నేంటి కెవ్వియేనియువింతలు గలవేని దెలుపుఁడు. నన్ను నాతోఁబుట్టుగుల జనకనందన నుద్దేశించి జను లేమనియెదరు? వెఱవక పలుకుం" డనినం జారులు భయకంపితులై "దేవా! తారకమంత్రంబునకు నీవర్థము. పంచమహాపాతకంబు లనియెడిచీఁకట్లకు దేవర నామాక్షరంబులు చండభానుకిరణంబులు త్రిలోకపావనుండవైననిన్నుం దలంచినయంతం బాపంబులె పుణ్యంబులగు. అట్టిదేవరతోడ దుష్టచిత్తులైనపౌరులమాటలు పలుక నలికెదము. అయినను స్వామివార లడుగుటంజేసి వినినమాట దాఁపక తెలిపెదము. "ఈపురంబుననొక్క చాకిత, మాగండు తిరస్కారంబు సేసె నని యలిగి పుట్టినింటికిం బోయినం దానితండ్రి కూఁతురా! జనంబులదేహంబులు సోఁకి మయిలవడినకోకలు శుద్ధి సేసి ధారణయోగ్యంబులు సేయునట్టియుత్తమకులంబునకు మయిలగల్పించితివి. ఇంటిజగడం బింటిలోననె యడంపక యింతదూరంబు వచ్చుట తగవు కాదు!" అని కూఁతుం దోడ్కొని యల్లునికడకు వచ్చిన

వాఁడు నెయ్యి వోసినయగ్ని చందంబున భగ్గనమండుచు "నిల్లు వెడలి నాలుగుదినంబులు వేఱొకచోట నుండి మగుడ నాకడకు వచ్చినపడంతి నేలుటకు రక్కసుండు గొనిపోయిన సీతం దెచ్చికొనిన రాఘవుండను గాను" అని యన్నిచుండు దుర్భాషలు పలికినఁ, జెవులు మూసికొని వానిమామ కొమరితం దోడుకొని యింటికిం బోయె. మలినాంబరములకు నిడఁగా మిగిలిన యెంగిలిగంజి ద్రావుచుఁ బొట్టపోసికొనునీచునియందు నిట్టిదుర్గుణంబులె కాని మంచిమాట లేమిటికిం బొడము! ఐన నీవృత్తాంతంబు దేవర కెఱింగింప వచ్చితి" మనిన మనుకులతిలకుండు మనంబు జల్లన మేను మ్రాన్పడఁ గొంతతడవుండి ధైర్యంబవలంబించి చారులం బొమ్మని యారాత్రి నాలవజాము బ్రహ్మకల్పంబు గడపినకరణిం గడపె.

అనంతంబ వేగుటయు భరతలక్ష్మణశత్రుఘ్నులు సత్వరంబుగా రామభూమీశ్వరుసమ్ముఖంబునకు వచ్చి చింతాక్రాంతుండును వివర్ణవదనుండును బాష్పాకులితనేత్రుండును నై రాహుగ్రస్తుం డైనపూర్ణచంద్రుండునుం బోలె కాంతివిరహితుండై యున్న యన్న నవలోకించినమాత్రంబున ఖిన్నులై తత్పాదంబులకు మ్రొక్కి పలుక వెఱచి మెల్లమెల్లన "జగద్వల్లభా! దేవరపాదసేవయె సకలపురుషార్థంబులకుం గారణంబు అని యెంచు నట్టి మా యెడం దయచూడ కుండుటకుఁ గారణం బేమి యనిన

రఘువరుండు చార్యులవాక్యంబులు పలుకరించి దుష్టపురు
షునిచే నిందితం బగు వేదంబుకరణి క్షుద్రజనులచేఁ బరమ
సాధ్వి యగుసీత నిందం జెందె. అశనిపాతసకాశం బైన
లోకాపవాదంబునం గలుగుభయంబు డెందంబు ప్రక్క
లింపం దొడంగె. జన్మమరణభయభీతుం డగుయోగిపురు
షుండు మాయనుం బోలె పరమసాధ్వియైనసీతను బరిత్య
జించెద, అనినవిని భరతుండు భయకంపితస్వాంతుం డయి
"అయ్యా! నీవంటివివేకి యిట్లానతీయం దగునె. కపిలధే
నువును సంపాదించి యంటువడె ననుచు నడవిలో విడువ
నడచువాఁడునుం గలఁడె. తొలుతలంకాపురంబున దశ
ముఖుని సంహరించినపిమ్మట ననలంబులోనం జొచ్చి బ్రహ్మ
పురందరబృందారకబృందంబులు వినుతింపం గందకుండ
నున్నయిన్నారీమణిం జూచి యీపతివ్రతాతిలకంబుతనకుం
గోడ లైనకతంబునం బుణ్యలోకంబులుగలిగెఁ, గాకున్నం
బుత్రశోకంబున మృతిం బొందినవారలకు గతి గలుగ
నేర్చునె! అని దేవదానవరాక్షసవానరవీరులు వినుచునుండ
మనతండ్రి యగుదశరథమహారాజు గొనియాడినట్టిశుభచరి
త్రయు నిక్ష్వాకుకులపవిత్రయు సౌజన్య పాత్రయునగుజనక
పుత్రికను ఘోరమృగపక్షిగణాకీర్ణంబును నిశాచరవిహార
స్థానం బైన కాననంబునఁ ద్యజించుటకంటెఁ బాపంబు
లేదు. కావున నిట్లుచేయుట యనుచితిం" బనినలక్ష్మణుండు
రోషారుణలోచనుండై "లోకమాత యగుసీత నిట్లాడిన

నరాధమునిం బరిమొండెంబులు సేయవలయుగాకిగానియా యంబ బరిత్యజంప నగునే యనుటయు శత్రుఘ్నుండును నట్లన పలికిన రాఘవుండు భరతాదులం జూచి "జానకి లోకపావని యగుటనేనెఱుంగుదు నైన లోకాపవాదంబు పుట్టినయెడ నర్థంబు నైన ననుజుల నైన హితుల నైన దేహంబు నైనం దృణంబుగాఁ ద్యజింతు ననినయెడ నిది యేమి యెచ్చు. మనవంశసంభవులును మానధనులు నైన హరిశ్చంద్రాదులు తొల్లికీర్తి కొఱకుఁగానసర్వస్వంబునుం బరిత్యజించిరి. కీర్తిహీనులు జీవన్మృతులుగా నెఱుంగుదు. తొంటి రాజర్షులు తనువు లైనం బరిత్యజించి కీర్తిసంపాదించిరి. అట్లగుటకతనఁ బావనచరిత్ర మైనసీత నుజ్జగించి కుప్పసం బూడ్చినసర్పంబు తెఱంగునఁ బ్రకాశించెద" అనినరఘువీరుని తెగువ గనుంగొని భయంబున మాటాడ వెఱచి భరతశత్రుఘ్ను లప్పటికిం దలంకి చనిరి.

తదనంతరంబ దుఃఖంబునం జిక్కినయన్నయొద్ద లక్ష్మణుండొక్కరుండ నిలిచె. అప్పుడు కాకుత్స్థుండు లక్ష్మణుని జేరంబిలచి "సీతను గంగాతీరంబున నడవిలో విడిచి రమ్ము కాదేని యీఖడ్గంబుచే నాశిరంబుఁ దెగవ్రేయుము. జానకిం గానలో విడిచిన పాతకంబు నాకుం గాని నీకుం బనిలేదు." అనిన విని భుజగంబుకరణి నిట్టూర్పులు నిగిడించుచు గమనోన్ముఖుండై యన్నకు మ్రొక్కి యరదంబు

నెక్కి యనేకంబు లైనయపశకునంబులు గనుచు సీతాంగన యుండు నంతఃపురంబునకుం జనుదెంచి యయ్యంబ పాదారవిందంబులకుం బ్రణమిల్లి "తల్లీ! నీవల్లభుండు నీకోర్కి చెల్లింపం దలంచె. విచ్చేయు" మనుటయునాయమ్మ తా నొక్కసారి వేఁడినఁ జన విచ్చి పంపె. పెనిమిటికిం దన మీఁద నెంత ప్రేమయో యని సంతసించుచు శ్రీరాముని పాదుకలు మునుగగాఁ గైకొని రత్నభూషణంబులునురజిత కనకంబులు నంబరంబులు సుగంధంబులు నానావిధంబు లగుభక్ష్యంబులు పావణించి రథంబుమీఁద నునిచి యత్తలకు మ్రొక్కి కౌసల్యతో ని ట్లనియె. "నాదుకోరికి సమకూర్చుటకు సుమిత్రాసూనునిం గూడఁ బయనంబు సేసి గంగాతీరవాసిను లయినసువాసినులం జూచిరమ్మని మీ కుమారుండు పనిచె" ననిన గోసలరాజతనూజ భూమిజం జూచి "అమ్మా! కోమలాంగివి. ఘోరవనంబుల కెట్లు చని యెదవు. ఎండచే నెమ్మొగంబు గందు. తనులత వాఁడు. ఇ దేమికోరిక మానుము" అనుటయు "సమస్తభయనివారకుండైన శ్రీరఘువీరుండు నామనంబుననుండుటకతనవంతరవంతయును గాదు. మీకరుణ గలిగి యుండ నశుభంబు లేశంబును లేదు. మనసుకొదవలు మాని నన్నిం బంపు" మనుటయు నయ్యమ్మ యేమియు ననక యూరకుండినఁ దక్కినవారలవీడ్కొని యవ్వేలంది యుత్తరీయంబుఁజక్కఁ జెక్కిపచ్చనిగుఱ్ఱంబులు పూన్చిన రథంబు నెక్కి కదలు

టయు సుమిత్రానూనుండు గద్గదస్వరంబుతో సారథిం జూచి "యశ్వంబులు కన్నీరు నించి తలలు వంచుచున్న

—:లక్ష్మణుఁడు సీతాదేవిని వనంబునకుఁ గొనిపోవుట:—

యవి. ఇదియేమి యనుటయు "దేవా! నేనశ్వహృదయంబు చక్కఁగానెఱుంగుదు. సమరంబుల యందు నిరాఘాటంబుగా సంచరించు నీఘోటకంబు లిట్లుండుటచే నెద్దియేని యునొకదుర్దశ రాఁగల దని తోఁచుచున్నది. అయిన నానేర్పుఁజూడు" మని గుఱ్ఱంబులఁ గండంబులు దట్టి ధేయని వాగె సడలించిన వాయువేగంబున సరదంబు పోవు నెడ వాయసంబును బాలభరద్వాజంబును గరుడుండును గగనంబునం గట్టె. కుందేలు నక్క మొదలగుమృగంబులు రథంబునకు నడ్డంబుగాఁ బఱపం దొడంగె. అయ్యమ్మకు దక్షిణనేత్రం బదరె. అప్పుడు సీతాదేవి రామానుజుం గనుగొని "బెట్టుగా దుర్నిమిత్తంబులు దోఁచుచున్నయవి చేవెట్టి కలంచినగతి నాయుల్లంబు దురపిల్లుచున్నయది" కరుణాసముద్రుండును శౌర్యసముద్రుండునునగు శ్రీరామభద్రునకు శుభంబు గలుగుం గాక. ఏవీరుండు ఖరదూషణాదిరాక్షసులం బదునాల్గువేలనొకముహూర్తంబున నుక్కడంచె? నేమేటి వెలయించుకొని పోవుమారీచమృగంబు మస్తకంబు ఖండించె? నేమహానుభావుండు గొండలు పఱపించి సముద్రమున సేతువు గట్టించె; నేజగపట్టి రావణకుంభకర్ణాదుల వధియించి లోకత్రయంబున సౌఖ్యంబు

సంపాదించె, నేనయానిధి విభీషణునకు శాశ్వతంబుగా లంకాసామ్రాజ్యం బొసంగె. శరణాగతసంరక్షణవ్రతుం డును రాజేంద్రుండును ననంతకల్యాణగుణసాంద్రుండు నైనయాశ్రీరామచంద్రుం డయోధ్యానగరంబు నేలుచు నాచంద్రతారకంబుగా సుఖంబున నుండుఁగాక" అని పలుకుచుఁ గొంత దవ్వు చని జానకీదేవి యుభయతీరంబులం బొడమినతరులతానికరంబులపుష్పవాసనలం బరిమిళితంబులును బూర్వసముద్రపరిచుంబితంబులును నై సప్తశతప్రవాహముఖంబులం గనుపట్టుచుఁ జక్రవాకపక్షిమారుతసంచరద్వీచీకలాప మైనదివ్యాపగం గనుంగొని వకుళతిలకసహకార నమేరుప్రియక మేదురం బైనతటంబున జనకతనూజయు సుమిత్రాసుతుండును రథంబు డిగ్గి కువలయమనోహారంబును సత్కవిసేవితంబును సుధాప్రకాశంబు నై రాఘవుని కీర్తిం బోలుచున్నగంగం గనుంగొని సంతసంబునంగొనియాడుచు నావికుండు దెచ్చినయోడ నెక్కి యవ్వలిగట్టునకుం బోయి స్నానంబులు సేసి ధౌతపరిధానంబులు ధరియించి పాదచారంబునఁ జీమలకుందూఱఁగూడనికాఱడవి తెరువుఁ బట్టి యకుంఠితంబు లైనకంఠీరవంఠోరఘోషంబులం ఘూర్ణిల్లు మదగజంబులు జంబుకంబులు వృకంబులు వాలుమెకంబులు మొద లగుమెకంబుల భయంకరఘోషంబులును నడవియీఁగలఝుంకృతులును నిలకోళ్లజీంకృతులును వనమహిషంబులభాంకృతులునుం జెవులు వ్రక్కలు సేయ భీక

రం బైనయకాననంబు నవలోకించి భూపుత్రి సుమిత్రాపుత్రునితో నిట్లను. జీర్ణంబులు నీరసంబులు ఛాయవర్జితంబులు నైన వృక్షషండములచేఁ బ్రవేశింపఁగూడనియరణ్యంబు గనుపట్టుచున్నయది గాని పావనంబు లైనతపోవనంబులు గానరావు, వికటంబులుఁ దీక్ష్ణకంటకంబులు నైన బలుసు, తుమ్మ, చండ్ర, వెణుతురు, కొరింద మొదలగు పొదలు గనుపట్టుచున్నవి గాని పుణ్యసేటెక లయిన యతివరమఠవాటికలు గానరావు. కాఱుచిచ్చువలనం బెచ్చుపెరిఁగినపొగ లెగయుచున్న యవిగాని హోమధూమంబులు గానరావు.(1) సివంగులు చిఱుతపులులుం గనుపడుచున్న యవిగాని మునిబాలకులు గానరారు. పాషాణకర్కశంబులైనకాపథంబులు గనుపట్టుచున్నయవి గాని నడయాడు మార్గంబు గానరాదు. దశరథరాజనందను నెడఁబాయనోర్చిన ననుబోఁటిపాపకర్మురాలకి మంచిది యేల కానవచ్చు"నని సంతాపంబు నొందుసీతాసతి నవలోకించి సౌమిత్రి మొగంబు వాంచి బాష్పపూరంబులు రాల్చుచుఁ "దల్లీ! లోకాపవాదనిమిత్తంబుగా నిన్నుఁ గాంతారంబు నొందించి రమ్మని రాఘవుండు కృపావిహీనుండ నగు నన్నుం బనిచె" నని యొడి తీవ్రభాషణంబు లశనిపాతంబు రీతిఁ గర్ణరంధ్రంబులు సోఁకుటయు సురగాలిచేత వ్రాలిన కుసుమవల్లియుంబోలె మూర్ఛఁజెంది పుడమిం బడియొడ లెఱుంగకయున్న జనకపుత్రింజూచి సౌమిత్రి పటాంచలం

బున విసరి యుపచారంబులు సేయఁ దెలివినొందక యుండు టయుఁ "త్రికరణంబుగ శ్రీరామచంద్రుని చరణారవిందం బులయందు నిజభక్తి గలవాఁడ నేని జనకనందన బ్రతుకుం గాక" యని ప్రతిన సేయుటయుఁ గన్నులు తెఱచి యాయ

—:లక్ష్మణునియొద్ద సీతదుఃఖించుట:—

న్నులమిన్న యన్నువపక్షియుంబలె విలపించుచుఁ 'నన్నా నీయన్నయు నీవును బదునాలుగేండ్లు నరణ్యంబునఁ గాపా డితిరి. ఇప్పు డిట్లు నట్టడవిలోఁ దిగ విడువం దగునే? మఱఁ దులలో నీవు నాయెడ భక్తి విశ్వాసంబులు గలవాఁడవు. తొల్లి దండకావనంబున నేఁ దెమ్మనినపువ్వులు దెచ్చి యిచ్చి తనూభవునికైవడిం గాపాడిన దయాపరుండ వగునీ విట్టినిర్దయత్వంబున కొడిగట్టితివే! అపకీర్తికి వెఱవని సుగ్రీ వునకు విభీషణునకు నిట్టిచెయిదంబులు సెల్లుం గాని నీకుం జెల్లునే? తండ్రీ! యే మనంగలదాన? నాపాపకర్మంబు నాకు వనవాసంబునం గోరికగాఁ బరిణమించెఁ, గావున నెల్ల కార్యంబులు పరామర్శించి చేయు మీయన్న నిష్కారణం బుగా నన్నుఁ గాఱడవిలోన విడిచి రమ్మనునె! మున్ను నానిమిత్తంబుగాఁ గొండవిల్లాని కోదండంబు బెండువలె విఱిచివైచె. నాకోఱకుఁగా మారీచమృగంబు మస్తకంబు ఖండించె. నన్నుఁ దెచ్చుటకై పాథోనిధిం గలపుచే బంధిం పించి సేనల దాఁటించె. నన్నుం జెందుటకై పదిమొగం బుల రక్కసునిశిరంబులు ఖండించె. అట్టి గుణాభిరాముం

డును దయారసధాముండు నైన శ్రీరామచంద్రుండు కాఁకులు దూఱని కాఱడవిలో నన్ను విడిచిరమ్మనియెనే! ఇదినాపూర్వజన్మకృతదుష్కర్మఫలంబు గాని నీవేమిచేయుదువు! మీయన్న యానతి చేసితివి. మీ ప్రతినలు నెఱవేఱె. వేగంబు సాకేతనగరంబునకుఁ బొమ్ము (2) అని మఱియు జనకనందిని సుమిత్రానందనుం గనుఁగొని "తమ్ముఁడా! వసిష్ఠ విశ్వామిత్రులు జనక దశరథులుం జూచుచునుండ నాఁడు వివాహసమయంబునఁ జిప్పకూఁకటియొప్పు మీఱుచు రత్నఖచితంబులైన కర్ణభూషణంబులం బొలుపొంగుచుఁ, దెలిదమ్మిరేకులం దెగడుకనుఁగవయు బింబాధరంబును మందహాసంబునం జెలువొందఁ, బూర్ణేందుసన్నిభంబైన రామదేవునిముఖాంబుజంబుధ్యానంబు సేయుచునుండంగలదాన; నన్నెడఁబాసినవిరహవేదన సైరింపం జాలక రాఘవుం డేతీవియలం గౌఁగిలించుకొనియెనో యయ్యడవితీఁగలలో నన్నుం ద్రోసిరమ్మనె; నాదురదృష్టంబు నేమందు? అత్తలకెల్లం గేలుమోడ్చితి ననుము. పూర్ణగర్భయు నిరపరాధయు నైనజానకిని నిష్కారణంబుగా నట్టడవిలో విడిచి వచ్చితి ననుము. వత్సా! నీకు మేలగుంగాక! శ్రీరామభద్రునకు భద్రంబగుంగాక! భరత శత్రుఘ్నుల నడిగితి ననుము." అని పలవించుభూమినందనం గనుంగొని లక్ష్మణుండు, "సాధ్వీశిరోమణీ! దైవయోగం బిటు లుండె. ఏల వగచెదవు? అల్లవే

(1)-(2) నడుమ నున్న గ్రంథ మొకప్రతిలోఁ బోయినది.

తాపసాశ్రమంబులు గనిపించుచున్నయవి. భాగీరథియు భూమిదేవియు వనదేవతలు నిన్ను రక్షించుచుందురుగాక! నీయోర్పును నీపాతివ్రత్యంబును నిన్నుం గాపాడు" నని యూఱడం బలికి కన్నీరు ఱెప్పల నప్పళించుచుఁ బ్రదక్షిణంబు సేసి లక్ష్మణుం డలంఘనీయం బైనరాఘవుని శాసనంబునకుం జలంకుచుఁ దిరిగి తిరిగి చూచుచుఁ బశుబాలకుండు దోలుకొనిపోవ నంబారవంబు సేయుచు వత్సంబు విడువ నోపని ధేనువు తెఱంగునఁ బలవరించుచు జనకరాజనందని చూచుచు నుండ, హుటాహుటి రథంబుఁ దోలుకొని రామానుజుండు దవ్వుగా నరిగి యదృష్టిగోచరుం డగుచు నయోధ్యకుం జనియె. ధరణిపుత్త్రియు నరణ్యరోదనంబు సేయుచు మూర్ఛ నొంది పుడమిపైవ్రాలినం బక్షులు ఱెక్కలచే నీడ గల్పించుచు నంబరంబునం దిరిగె. చమరీమృగంబులు వాలంబుల నల్లనల్లన విసరె. సింహశరభ శార్దూలాదులు చుట్టునుం బరివేష్టించి కాపాడుచు నుండె. మదపుటేనుంగులు కరశీకరంబులచే జలధూమ్రంబులు నించె. భానుండు కిరణంబుల వేఁడిమి సోఁకకుండ వెన్నెలకరణి నెండగాసె. వాయుదేవుండు శైత్య మాంద్య సౌరభ్యంబులతో మెల్లమెల్లన విసరుచు సేద దేర్చె

—: వాల్మీకి సీతను దనయాశ్రమమునకుఁ గొనిపోవుట: —

నయ్యవసరంబున వేదవేదాంగ కోవిదుండును దత్త్వవిశారదుండును నైనవాల్మీకి నిఖిలవిద్యారహస్యంబులు దెలిసిన

శిష్యులు పెక్కండ్రు పరివేష్టింప యాగార్థంబుగా సమిధలును యూపంబులును దర్భలుఁగుసుమంబులుఁ గందమూలంబులు సంపాదించుటకై యయ్యడవికిం జనుదెంచియప్పరమపావనిం గనుంగొని "అమ్మా! నీవెవ్వతెవు? ఏకతంబున నేకతంబ యివ్వనంబున శోకించెదు." అని నమ్ముని యాదరణవాక్యంబులకు వేసవియెండం గొట్టువడిన మయూరి మేఘగర్జితంబునకుం బలె నాహ్లాదంబు నొంది వీడియున్నధమ్మిల్లంబు చక్కనొత్తి గద్గదస్వనంబున "అయ్యా! యేను మిథిలాపతిపుత్రికను; నావల్లభుండగు శ్రీరాముఁండు లోకాపవాదభయంబునఁ గల్లనిజంబులు విచారింపక కానలకు వెడల నడిచె. ప్రాణంబులు త్యజింపఁ జూచిన భ్రూణహత్యాదోషంబు వచ్చుచున్నయది కావున సాహసంబు సేయ నెంచినదానం గాను. ఏను జేసినపురాకృతకర్మంబున నిటువంటిదురవస్థ ప్రాప్తం బయ్యె. నిన్నుం జూచిన మజ్జనకునింబోలెనున్నది. నన్నురక్షింపు" మని చరణంబుల పయి వ్రాలిన వాల్మీకి దయాకులితమానసుండై "సాధ్వీ! శోకింపకుము. మీతండ్రి యగుజనకునకు నేను సఖుండ. నీవు శీఘ్రంబ బలపరాక్రమసంపన్నులు నుత్తమచరితులునైనపుత్త్రుల నిరువురం గనియెదవు. గర్భక్షోభంబుగాఁ దెగువ సేయం దలఁతురే" అని యూరార్చి జానకిం దోడ్కొని యాశ్రమంబునకు జనియె.

—: కుశలవుల జన్మవృత్తాంతము, :—

తదనంతరంబ యావాల్మీకిమునీంద్రుండు మునిభామల రావించి యాసతీమణిగర్భంబునకు హాని రాకుండం గాపాడుండని యాజ్ఞాపించిన వారలు జానకిని బర్ణశాలలోనికిం దోడ్కొని పోయి నివాతస్థలంబున దర్భలపయిం బఱచిన కృష్ణాజినంబుపై నునిచి పాదపద్మంబులం గడినముండ్లు మెల్లనఁ దివిచి వెచ్చనికరంబులఁ బాదంబులం గాఁచి కొంచెంబుగాఁ గారనూనె పంకించి తలచిక్కు వాపి ముడిచి చెక్కుటద్దంబుల గాఱుకన్నీరు పయ్యెదచెఱంగుతి నొత్తి మొగంబు పుడికి పుడమిపయిం బొరలాడినకతంబున దుమ్మైన వలువ పరిహరించి పలుచనినారచీరలుగట్టి కందమూలంబులు నడవికూరలు లఘుతరంబుగా నారగింపంజేసి పూఁటపూఁటకు నుపచారంబు లొనరించుచుఁ బోషింప నను దినంబును బుణ్యకథాప్రసంగంబులఁ బ్రొద్దులు గడపఁ దొమ్మిదినెలలతిక్రమించుటయు, సౌమ్యగ్రహంబులైదు నూర్యునిం గూడక యుచ్చకేంద్రస్థానంబుల వెలుంగుచునున్న శుభలగ్నంబున జనకపుత్రిక యిరువురు కొమరులంగనియె. అప్పుడు దిక్కులు ప్రసన్నంబు లయ్యె. పరిమళమారుతంబులు వీచె. దివ్యదుందుభులు మొరసె. పుష్పవృష్టిగురిసె. అగ్నిప్రదక్షిణార్చులం గనుపట్టె. అప్పుడు తాపసాంగనల వృత్తాంతం బెఱింగింప వటువులం బనుచుటయు వార "లక్కయమడబిడ్డలం గనియె" నని చెప్పినవాల్మీకి వేగంబ

వచ్చి సీతాసుతులం జూచి సంతసంబున నుప్పొంగి సూర్యవై శ్వానర తేజస్కు లైనకలవకుఁ గుశలవంబులచే నభిమంత్రించి రక్షయొనర్చి జాతకర్మంబు నిర్వర్తించి కుశలవు లనునామకరణంబు సేసి పెనిచిన వారలును ననుదిన ప్రవర్ధమానులై పెరిఁగి కరికలభంబులభంగి నొప్పుటయు, వాచంయమశ్రేష్ఠుం డైనవాల్మీకి చౌలంబు సేసి యుపనయనమ్ముగావించి య మ్మహోత్సవంబునకుఁ గామధేనువుం దలంచుటయుఁ, దోడనె వచ్చి జీలకఱ్ఱసన్నబియ్యంపుటన్నంబులరాసులు నొలుపుఁ బప్పులతిప్పలు నేతిదొరువులు పిండివంటలకొండలు కూరలరాసులు నానవాలకాలువలు పనసరసాలకదళీఖర్జూరాది ఫలసమూహంబులును నిర్మించిన బంగరుపళ్ళెరంబులనునిచి బంతులు సాగించి మునిసతులు వడ్డింప షడ్రసోపేతంబుగా నారగించి మునీంద్రు లాశీర్వాదంబులు గావించి కర్పూర తాంబూలంబులు బహుమానంబులు గైకొని పోవుటయు, సూర్యచంద్రులం బోలెఁ దేజోవిరాజితు లైన యక్కుమారులకు నాలుగు వేదంబులు షడంగంబులు నానాపురాణంబులు నాగమంబులు నధికరింపఁ జేసి ధనుర్వేదంబు సాంగంబుగా నేర్పి దివ్యాస్త్రసంధానంబు నాకర్షణంబు నుపసంహారంబును లాఘవలక్ష్యశుద్ధిం జిత్రత్వదృఢత్వంబులును దెలియం జేసి సంగీతశాస్త్రంబు సమర్థంబుగాఁ దెలిపి శ్రీమ ద్రామాయణం బుపదేశించుటయు, నేకసంధాగ్రహణంబున గ్రహియించి కుశలవులు వీణయు, దాళంబునుం

పన్నుండును తేజోవిరాజమానుండును జంద్రకందర్పసదృశ రూపరేఖాకలా విలాసభాసురుండు నయ్యెఁ దండ్రిగండం బున మూలానక్షత్రంబున జనియించె. అంతఁగొన్ని దినం బులకు నారాజు వైరిరాజులతోఁ బోఁజుదీరి యాజిగావించి వెను దివియక శాత్రవులు ప్రయోగించిన యాయుధంబు లచే భిన్నభిన్నాంగుఁడై సంగరాంగణంబునంబడి యింద్ర సదనంబునకుం జనియె. అట్లు గండదోషంబునఁ దండ్రి మరణంబు నొందుటయుఁ దల్లి యతనితో నగ్నిప్రవేశంబు సేసె. శత్రువులచే రాజ్యంబు గోలుపోయి మంత్రులు య థాయథలుగాఁ జనిరి. ఇట్లు మాతాపితృ విహీనుండును రాజ్యభ్రష్టుండునైన యబ్బాలకుం దోడ్కొని కొందఱు దాదులు కౌంతలపురంబునకువచ్చి యబ్బాలకునిం బెంచు చుండి రెండుమూఁడేండ్లలోన నాదాదులును బరలోకంబు నకుంజనిన ననాథుండైన యమ్మహీనాథుకుమారునిం జూచి పౌరనారీజనులు కరుణచే నొక్కపుణ్యవతి జలకంబులార్చె; నొక్కసీమంతిని హితంబును మితంబునుగా నాహారంబు వెట్టె; నొక్కసతీమణి వానికటితటంబున బంగరుచెఱంగుల యొల్లియ గట్టె; మఱియొక పురంధ్రీరత్నంబు కూఁకటి కూడదువ్వి కొండెవైచి సిగబంధుచుట్టె; వేఱొక్కపతి వ్రత యబ్బాలకునెత్తికొని ముద్దాడుచునుదీవించె. ఇవ్విధం బున వారిజాక్షులు గారామునఁ బెంచుచునుండ నైదేండ్ల ప్రాయం బగుటయు నారాచక్కొమారుం డుండంద యాట

లాడుచుం దుష్టబుద్ధి యనం బరఁగిన యారాజుమంత్రి గృహంబునకుం జనిన, వానికొలువులో దైవజ్ఞులైనమహామునులు శుభలక్షణలక్షితుం డైనయబ్బాలు నీక్షించి హర్షించి, 'యీముద్దులబిడ్డం డెవ్వరివాఁడో వీని లక్షణంబు గనుంగొనిన భూమండలం బేలం గలం' డనిన విని దుష్టబుద్ధి యీర్ష్యాసూయాపరవశుం డై యమ్మునుల మాటలు వినియు విననిచందంబున నూరకుండి వారలం బోవంబనిచి యబ్బాలకునిం గాంచి "ఋషులవాక్యంబు తప్ప" దని తలంచి పెచ్చు పెరిఁగిన మచ్చరంబు మొందుకొనఁ జండాలురం బిలిచి, "యీకొండికవానిందోడ్కొనిపోయి నట్టడవిలో శిరంబు ఖండించి రం" డని పంచినఁ గాలకింకరులం బోని యమ్మాలలు, మద్యంబులు ద్రావి మదోన్మాదంబున దాఁటుచు, హరిభక్తాగ్రగణ్యుం డతిపుణ్యుండు సుకుమారుండు నైనయారాజకుమారునిం దోడుకొనిగండక పుండరీకమాతంగతురంగ మహిషవరాహఖడ్గగవయగంధసింధురసింహశరభాదిమృగగణశరణ్యం బైనయరణ్యంబుసొచ్చియందొక్కశిలాఫలకంబున నమ్ముద్దులబాలకుంగూర్చుండనిడి కత్తులుదుస్సి, మద్యపానమదోన్మత్తతం బేరెమ్ములు వాఱుటయుఁ బ్రహ్లాదునికై వడి నారాకొమారుండు హృదయంబున బెదరక వరద! వాసుదేవ! వైకుంఠవాస! వనమాలికాభరణ! వారణాపదుద్ధరణ! వారిజాక్షా! యని దివ్యనామసంకీర్తనంబు సేయుచు ధీరుండై యున్న యెడం గృపా

ణంబు జళిపించి యారాచపట్టిని గొట్టం దలంచి హరికటా క్షంబువలనం జేసూడక యందఱు నేకవాక్యంబుగానీచిన్ని పాపనిం జంపు మని యాపాపాత్ముండు పంచిన మన మే గతిఁ జేయంగలవారమని చంపకయక్కుమారునిపాదంబు చిటికెనవ్రేలు కోసికొనిపోయి దుర్మంత్రియగు దుష్టబుద్ధి ముందరం బెట్టి, మ్రొక్కి, నతండునుం బ్రమోదంబు నొందె. అమ్మహామునుల వాక్యంబులు దబ్బఱ సేసితిఁ గదా యని యుబ్బుచు నుండె.

అంత నక్కుమారుండు, నుద్దండవేదండకపుండరీక మండలమండితం బైనయమ్మహారణ్యంబున నంగుళిచ్ఛేదన వేదనం బొరలుచుఁ బట్టపగలింటి యెండతాఁకునఁ గొట్టు వడి యాఁకట సొటసొట వోవుచు వదనకమలంబు వాఁడఁ జిప్పకూఁకటి యల్లన నాఁడ గన్నుల నశ్రుజాలంబులు జాఱఁ, గమలాక్షా! దీనరక్షావిచక్షణా! లక్ష్మీపతీ! క్షమాపతీ! ఆపన్నశరణ్యా! అనాథనాథా! అంబుజోదరా! ఆదినారా యణా! నీవే దిక్కని వెక్కివెక్కి యేడ్చుచు వేఁడియునుక లోనం బొక్కుచు స్రుక్కుచు నున్నయెడ నావనదేవతలు నందలి మృగంబులుఁ బక్షులు హితోపచారంబులు సేయు చు రక్షించుచునుండె. అవ్వేళ మృగాకీర్ణప్రాంతరం బయిన కాంతారంబున నచ్చోటి చెంచులకుం బోయలకునధీశ్వరుండు పరిపూజితలక్ష్మీశ్వరుండును బుళిందనామధేయుండునునక్కాం తలునిదుర్మంత్రికి విధేయుండునగు నొక్కపాళెగాండ్ర దొర

వేఁటాడుచు దైవవశంబున నవ్వనంబు సొచ్చి యచ్చోటికి వచ్చి యశ్రుధారా పరిపూరిత నేత్రుఁడు నుపవాస శోషిత గాత్రుండునై కమలమిత్రునిం బోలు తేజంబున విరాజిల్లుచుఁ జరణాంగుళిఖండనవేదనం జాలఁగుందియు ముకుందా! గోవిందా! అరవిందనయనా! ఇందిరారమణా! నంద-నందనా! యనుచు శ్రీహరిం దలంచుచున్న యాచిన్నారా

—:చంద్రహాసుఁడు పుళిందునకు దొరకుట:—

కుమారునింజూచి యా పుళిందకుండు దానును శ్రీహరి భక్తుండు గావునఁ గరుణాంతరంగితమానసుండై కన్నీరు నించుచు "నిక్కుమారుం డెక్కడివాఁడో? అక్కటా! యక్కటికంబు లేక యీచక్కని బాలు నిక్కరణిం జేసినయుక్కివు లెవ్వరో!" యని వగచుచు గుఱ్ఱంబు డిగ్గి దగ్గఱకు వచ్చి వెఱవకు మని బుజ్జగించుచు "నే నపుత్రకుండను గాన శ్రీహరిసేవామహత్త్వంబున నిప్పుడు నాకుఁగొడుకు కలిగె. కన్యకాపుత్రుండును, గుండుండును, గోళకుండును, సంగీకృతుండును, గన్యాదానకాలంబునఁ బ్రథమపుత్రుండు తన కొడుకని నిశ్చయింపఁబడినవాఁడును, గ్రయలబ్ధుండును, దల్లిదండ్రులచేధారాపూర్వకంబుగా నీయంబడినవాఁడును, నెద్దియేనియు నొక్కయాపదవలనఁ దనకుఁ దానేచేరినవాఁడును, దేవరన్యాయంబున జనియించిన వాఁడును, దనకు ధర్మపత్నియందుజనియించినవాఁడు,నిప్పుడుగురుఁబుత్రులనం బరఁగుదురు. అందులో వీఁడు తనకుఁదానె చేరెం గావున

స్వయంప్రాప్తుం డనం బరఁగు" నని తనయునిం గా నంగీకరించి యబ్బాలునిశోకంబు నివారించి తురంగంబుపై నిడికొని తనయేలెడుచందనావతీపురంబునకుం జని, వెంబడి వచ్చిన బంధుపరివారంబులఁ బరిజనంబుల నర్హప్రకారంబున నిండ్లకుం బనిచియంతిపురంబునకరిగి, దైవజ్ఞులు నుపాస్యులు నైనజోస్యులం బిలిపించి వారి యనుమతిని శుభలగ్నంబునఁ దనపట్టపురాణి యగు మేధావినీరమణిం బిలిపించి "యశోదాకుమారునికరుణవలన నీకుంగుమారుండు గలిగెఁ గైకొమ్మా" యని చేతికిచ్చుటయు,నచ్చిగురుఁబోణి మచ్చిక హెచ్చ గ్రుచ్చి కౌఁగిలించుకొని సన్యంబులు సేఁపుటవలనఁ బరిపులకితగాత్ర యై యక్కుమారు నాపాదమస్తకంబు నిమిరి వామపాదంబునఁ జిటికెనవ్రేలు లేమికి మనంబునం బురపురం బొక్కుచుఁ, శ్రీహరీ! యవ్యాజకృపాలహరీ! నరహరీ! నీవు కృపనొసంగిన యిక్కుమారునకు నంగవైకల్యంబు రాఁదగునే? యని యంతరంగంబునం దలంచినయంత నయ్యింతి పాతివ్రత్యమాహాత్మ్యంబు వలన నెప్పటియట్ల చిటికెనవ్రేలు మొలచిన నానందంబు నొందె. ఆపుళిందకుం డయ్యిందువదనతోడంగూడఁ గొడుకు నంకతలంబున నునిచికొని చంద్రుని నవ్వునట్టిమొగంబు గలుగుటం జేసి చంద్రహాసుం డనునామకరణం బొనర్చి దాదిటొమ్మున దూదిపాన్పునం బెనిచె.

అంత శుక్లపక్షంబున విదియచందురుండునుంబలె నక్కుమారుండభివృద్ధింబొంద నమ్మహీమండలంబున నెల మూఁడువానలు గురిసె. సకలసస్యసమూహంబులుదున్నకయ పండె. ధేనువులు నపారంబుగా క్షీరంబులు గురిసె. క్షామక్షోభంబులు విరిసె. బాంధవకులం బానందంబున మెఱసె. అంత నద్ధరాకాంతుండు నందనునకు నుపనయనంబు గావించి వేదవేదాంగంబులును దద్రహస్యంబును మన్వాదినీతిశాస్త్రంబులును ధనుర్వేదంబును విలువిద్యయందలి లాఘవ లక్ష్యశుద్ధి చిత్రత్వ దృఢత్వంబులును దివ్యాస్త్రజాలంబులును కత్తి,జముదాడి,వంకి,బాణా,పట్టా, సురియ, గద, గుదియ మొదలగు భద్రాయుధంబుల సాదనలును,అశ్వారోహణ గజారోహణ రథారోహణ పదలాఘవవిచక్షణత్వంబునుం దెలియంజేసి సకలజనులు నానందంబునొంద నప్పాళిందకుండు యౌవనరాజ్య పట్టాభిషేకం బొనర్పఁ గందర్పకోటివిలాసుం డైనచంద్రహాసుండుధరణీచక్రంబు నవక్రపరాక్రమంబున శక్రునిచందంబునం బరిపాలించుచు,రుక్మాంగదుని తెఱంగున శ్రీవిష్ణుభక్తిపరాయణుండై తన దేశంబునందలిజనులెల్ల నేకాదశీవ్రతంబువిష్ణుపంచమీవ్రతంబు శ్రీజయంతీవ్రతంబును మొదలైనవైష్ణవవ్రతంబులను యథావిధిగా నాచరింపంజేయుచు నట్లు చేయనివారల దండించు. పదియాఱేండ్ల నూఁగుమీసంపుఁ గొమరుఁబ్రాయంబునఁ దండ్రిచే ననుమతిఁ బడసి తురంగ

మాతంగ శతాంగవీరభటపటలీచటులం బైన సేనాసమూహంబులతో సరుదులు గెలిచి, బిరుదులు గైకొని, యట నంగవంగకళింగకాశ్మీరకర్ణాటకరూశకైవర్తకాది నానాదేశంబులు గెలిచి తుంగంబు లగు మత్తమాతంగంబులును వేగజితకురంగంబు లైన తురంగంబులును జిరత్నంబు లైన రత్నంబులును గిరిశిఖరంబులకన్న వాసు లైన హేమంపురాసులును మొదలగు సంపదలు గైకొని నిలింపపతిసాంపున భూతలంబు గంపింప సేనా పరంపరలతోడం గూడ నానందం బైన చందనావతీపట్టణంబునకు వచ్చి తలిదండ్రుల పాదంబులకు వందనంబులు గావించి నిజభుజోపార్జితంబులు నూర్జితంబులు నైనధనకనకరత్ననికరంబులచే బొక్కసంబు ప్రిక్కిటియం జేసి, మాతాపితృశుశ్రూషణంబును బంధుమిత్రామాత్యాశ్రితపోషణంబును విద్వత్కవిసంతోషణంబునుం జేయుచు నున్నకుమారునిం గనుంగొని కనుంగవ చెంగలింప నప్పుళిందభూపతి యొక్కనాఁడు తనయునిం గరంబున నిమురుచు "నన్నా! మనము కుంతలాధీశ్వరునిం గొలిచినవారము. అచ్చట మనకుం బ్రాపకు లతనిమంత్రి యగుదుష్టబుద్ధియుఁ దత్పురోహితుం డగు గాలవుండును. కనకంఁ గనకటంకంబులు పదివేలు నైదువేలు రెండువేలు వేర్వేఱ యమ్మువ్వురకు మూటలు గట్టి ముద్రవేయించి పంపుమనినఁ జంద్రహాసుం డట్లే యగుంగాక యని బొక్కసంబునకు వచ్చి యొంటెలమీఁద వేసడంబులమీఁద బలీ

వర్గంబులమీఁద రాజునకు మంత్రికి ధనంబు లపారంబుగా బెటికలఁ బెట్టించి తండ్రి చెప్పినక్రమంబున ముదుపులు గట్టించి యామూఁడువగల ముడుపులును బురోహితుల కి మ్మని పంపుటయుఁ, దీర్పరులు నేర్పరు లైనని యోగులు కౌంతలంబున కేగి రాజునకు మంత్రికిఁ బురోహితునకు బ్రణమిల్లి చంద్రహాసుం డిచ్చినపత్రిక నొసంగి యెప్పుడు నీయందగిన యప్పనంబుకన్నఁ బదియింత లధికంబు దెచ్చితిమి. కైకొని రాజున కిమ్మని యమ్మంత్రికి నొప్పగించి తక్కిన యమ్మూఁడువగల ముడుపులను నొక్కబంగరుపళ్ళెరంబున నునిచి తత్పురోహితుం డగుగాలవునకు నిచ్చినఁ, దద్వృత్తాంతం బంతయు దుర్మంత్రి యైన దుష్టబుద్ధి యాలకించి ఘనపుళిందున కింతసంపద గలుగుటకుఁ గారణం బేమి? యని యసూయామలీమసం బైనమానసంబునఁ గుంతలాధిపునిం జేరి చంద్రహాసుని తెఱంగు విన్నపంబు సేసి యతనితండ్రి యగుపుళిందునిం బట్టుటకు రాజుచే ననుమతిఁ గైకొని పవనజవం బైనతురంగంబునెక్కి యపారదళంబులతో నాఱు యోజనంబులదూరం బొక్కదినంబులోనం జని చందనావతీపురంబు ముందరం గాంచి తనయొద్దియోధవరులఁ గల యం గనుంగొని మున్ను సింహశరభశార్దూలాది మృగసంకులం బైనయాయడవిలోని దైన యిది యిప్పు డమరావతీపురంబు నిరసించుచు నిలింపపతిసంపదలం బోలి సంపదల పెంపు దలిర్చుచు నున్నయది. అని పలుకుచు నరుదేరఁ

బుళిందకుండు ప్రియసుతునితోడం గూడ నెదుర్కొని మ్రొక్కి తోడ్కొని వచ్చి నిజమందిరంబున విడిదిపట్టు గావించె.

అంతనానావిధంబులును మనోహరంబులు నగువస్త్రవ్రాతంబు లర్పించిన నాదుష్టబుద్ధి కపటంబు మనంబున నుంచి వెలుపల వాత్సల్యంబుదోఁప నవ్వుచుఁ జంద్రహాసుం గనుంగొని "పుళిందకా! పున్నమచందురునింబోలెనయనానందుండైననీనందనుండు సౌభాగ్యలక్ష్మీసమేతుండై యొప్పుచున్నవాఁడు. ఇతండు నీ కేచందంబునం గలిగె" ననినఁ బుళిందుండు దుర్మంత్రి నవలోకించి "మృగయావినోదంబుగా వనంబునకుం జని కుంతలపురంబునకు రెండామడ దూరంబున దురవగాహంబైనగహనంబునఁ బాదాంగుళిచ్ఛేదవేదనాదోదూయమానమానసుండై శ్రీహరిం దలంచుచునున్న యీచిన్నవానిం గనుంగొని శ్రీవిష్ణుభక్తునింగా నెఱింగి తోడ్కొనివచ్చి కన్నకొడుకకన్న మిన్నగా నెన్నికకెక్కం బెంచితిని. నాఁటికై దేండ్లబాలుం" డనిన విని తాను మున్ను చేసినయకృత్యంబు మనంబునం దలంచియాచిన్నవాఁడు వీఁడె యని నిశ్చయించి మాలబంట్లపయిం బండ్లు గీఁటుచు నసూయాకోపంబులు మనంబున నణంచికొని యిచ్చట నితని నేమేనియుఁ జెనకఁ దలంచితిమేని మనకే దోషంబు వచ్చుఁ గావున నుపాయంబున వీనిం గొంతలపురంబునకుం బంపి యచ్చట మత్సుతుం డైనమదనునిచే

విషంబు పెట్టించి చంపించెద* నని యూహించి తనతన
యునిపేర స్వహస్తలిఖితంబుగ నొక్కపత్రిక వ్రాసి ముద్ర
వైచి చంద్రహాసునిచేతి కిచ్చి వినయంబును నెనరునుం
దోఁచునట్లుగాఁ జేరంబిలిచి యీపత్రికం గొని నీవొక్కరుం
డవు కొంతలంబునకుం జని నాపుత్రునకు నిమ్ము. అచ్చట
నీకు సకలశోభనంబులు గలుగు ననినఁ, జంద్రహాసుండు
మ్రొక్కి యక్కమ్మగైకొని మనోమారుతవేగం బైనతురం
గంబు నెక్కి నిమిషమాత్రంబునఁ గొంతలంబునకుం జని
తత్పురప్రాంతంబునందుఁ జంచచ్చంచరీకఝుంకారసంకులం
బైన యొక్కయుద్యానవనంబు మధ్యంబున హృద్యంబైన
పద్మాకరంబు పొడఁగని రాయంచ జక్కవబెగ్గురులగములు
కరువలిచే నగయుపుష్పాదుల సప్పళించిన విప్పగు నల్లగలు
వల నల్లసిల్లు తేనెసోనల నానిన చలిగాలిమొలకలవలనం
బథిశ్రమంబు దీఱఁ దురంగంబునుసాహిణివశంబు సేసిపల్లవ
పుష్పఫలభరితంబైనసహకారవృక్షంబునీడ బడలిక దీఱం
బవ్వళించి నిదురించుచు నుండ నాకొంతల మహీకాంతుని
కూఁతురు చంపకమాలినియు దుష్టబుద్ధితనయ విషయయు
మన్మథునారాధింపంగోరి సఖీజనులతోడంగూడ నవ్వనంబు
నకు వచ్చి పల్లవితంబులు కుసుమితంబులు ఫలితంబులు
నగుపొన్నలు పొగడలు గోరంటలు సెమంతులు చూతం
బులు పారిజాతంబులు జాజులు విరజాజులు మల్లెలు మొల్లలు
పోఁకమ్రాఁకులు మొదలగుతరులతానికరంబుల సుమం

బులు గోయుచు విరిగుత్తుల నొండొరుల వ్రేయుచు నొయ్యారంపునడలచే వనమయూరంబుల గర్వంబులు డించుచుఁ బూలరెమ్మలు వంచుచుఁ బూలకై మదించుచు సఖులఁ జేరం బిలుచుచు సరసంపుటెలుంగులచే మత్తకోకిలంబుల మదంబు లడంచుచుఁ బువ్వుఁదీవియల వంచుచు మేని మెఱుంగుల వనంబెల్ల నింపుచు నిటలంబుల నటించుకుటిలాలకంబులచేఁ దుమ్మెదలం గదుముచుఁ బల్లవంబులంజిదుముచుఁ గోసినవిరులు పయ్యెదలలో నదుముచుఁ దళుకువాలారుఁజూపుతూపుల బాలకురంగహృదయంబుల నాటుచుఁ దేనియవాఁకలం దాఁటుచు దనూసౌరభంబులచేఁ గుసుమసౌరభంబులు మాటుచుఁ బువ్వులుగోసి కమలాకరంబు డాసి వేడుకమీఱ జలక్రీడ లాడి విగళితహారమణిగణంబులచేఁ గమలాకరంబు రత్నాకరంబుగాఁ జేయుచుఁ దత్తటంబునం దువ్వటంబులు గట్టి సొమ్ములుపెట్టి కుంకుమకస్తూరిక లలంది యవ్వేలందులు మన్మథపూజ సేయుచునుండిరి.

అయ్యవసరంబున నమ్మంత్రికుమారిక యక్కాలనిగట్టునఁ దియ్యమామిడిచెట్టునీడ నిదురించుచున్న చంద్రహాసునింగాంచి యందియలు మొలనూలుమువ్వలు రవలమెట్టెలు మ్రోయకుండ మెల్లమెల్లనం జని యక్కుమారవరునిరూపరేఖాసౌందర్యకలావిలాసంబులకుంజొక్కిచక్కెరవిలుతుని బారికిలోఁజిక్కి చేరం జని యడపపుసంచిత్రాటం

గట్టియున్నకమ్మ విడిచి చూచి తండ్రి చేయివ్రాలుగాఁ దెలిసి యవ్వక్కణ మాద్యంతంబునుం జదివికొని నిజజనకునివిష మబుద్ధికిం బరితాపంబు నొందుచు "మాపరేఖావిజితరమా కుమారుండైనయీ రాకొమారునకు విషము నొసంగి" యని వ్రాసినాఁడు. ఇంతనిర్దయుండు జగంబునం గలండే యని వగచి "విషము నొసంగి" యని వ్రాసినయక్షరంబుల *నడుమ యకారంబు వ్రాసి యెప్పటియట్ల ముద్ర వైచి యడపపు సంచిత్రాటం గట్టి పెన్నిధిం జూచి విడువఁ జాలని పేదవడు వున నవల నడు గిడంజాలక కొంతతడవు చూచుచునుండి పరాధీన గావున దీనమానస యై యెఱుంగనియట్ల రాజ పుత్రికడకుం జని తదనుమతిఁ బడసి నిజగృహంబునకుం జనియె. అంతఁ జంద్రహాసుండు నిదుర మేల్కాని, సరసీ జలంబులం బ్రక్షాళితపాణిపాదవదనుండై నడగని నెక్కి వడిగ నప్పురంబునకు వచ్చి యెడనెడ శుభశకునంబులు షొడగనుచుఁ బ్రధానివాకిటికిం జని పణిహారిచేఁ దనరాక మంత్రికుమారున కెఱింగించుటయు, నతండు పుళిందకుని సుతుండు చంద్రహాసుండు వచ్చినాఁడనిన విని ససంభ్రమం బుగా నెదుర్కొని గాఢాలింగనంబు గావించి సంతసంబున నేకాంతప్రదేశంబునకుం జని పుళిందుని సేమం బడుగుచుఁ

* "నడుమ యకారంబు వ్రాసి" యనుటకు మాఱు "మకారము యకారంబుగ దిద్దియనుట లెస్సగానుండును."

దండ్రిముద్రవైచిన పత్రిక నొసంగినఁగైకొని “శ్రీమత్సకల గుణసమృద్ధుఁడైన దుష్టబుద్ధి కుమారుండగుమదనునిదీవించి పుత్తెంచిన శుభప్రయోజనంబు- పుళిందునిముద్దుపట్టి, కుల స్థానపౌరుషంబులు గలమేటి, యెల్లప్పుడు మనకుమహోపి తుండు, వీనిం గనుంగొనిన యాక్షణంబున సందేహంబుమాని విషయనొసంగినావచ్చునంతలో నెల్లకార్యంబులు చక్కఁ బెట్టునది” యను వక్కణ చదివికొని సంతసించి నాసహో దరికిఁ దగినవరుండు దొరకె మేలుమేలనుచు, మౌహూర్తి కుల రావించి యారాత్రి శుభలగ్నంబు గలుగుట వలన వివాహంబు గావించి మహేంద్రవైభవంబున సముచితవిధా నంబు లాచరించుచుండె. అక్కడ దుష్టబుద్ధి, చంద్రహా సుం జింతకుఁ గొంతలంబు నేరి మత్కుమారునిచే నీయం బడిన విషంబువలన నిహతుం డాఁగదా! నాతలంపు నెఱ వేఱు. మునులవాక్యంబు లబద్ధంబులయ్యె; నని సంతసిం చుచుఁ బుళిందకునిం బట్టి సంకెల వేయించి యతనిపట్ట ణంబు చూఱలాడించి మూఁడవనాఁటి వేకువజామున నతి త్వరితంబుగ బెస్తల జంకించుచు బంగరుపల్లకి నెక్కి కొంతల పురీప్రాంతంబునకువచ్చునెడ నొక్కకృష్ణసర్పం బడ్డంబుగా వచ్చి మానుషభాషణంబుల నిట్లనియె. “నేనీపట్టణంబులో బహు నిక్షేపంబులు రక్షించుచుంటి. వానికిం గర్తయగు వాఁడు వచ్చెఁ; నింక నేనుఁ బోయివచ్చెద” నని పలికి రసా తలంబునకుం జనియె. అంత నయ్యమాత్యుండు పామువలి

కినమాట పాటిసేయక పురంబుసొచ్చి చూతపల్లవతోరణా
లంకృతంబులును, రంభాస్తంభసంభృతగేహాళీద్వారంబులు
ను, జందనోదకసంసిక్తభూతలంబును, నగురుధూపధూపితం
బునైన రాజవీథియుఁ దన నగరునుం గాంచి పట్టణాలంకర
ణంబునకు హేతువేమి యని యడిగి చంద్రహాసునకు విష
యను వివాహంబు సేయుటగా నెఱింగి వీఁపునెటుక్కుమనఁ
దటుక్కున గృహంబుసొచ్చి "యేనేమి వ్రాసితిని దానేమి
చేసె' నంచుఁ బండ్లుకొఱుకుచుఁ గుమారుని బిలిపించి
"యోరీ దురాత్మకా! నేఁటివఱకు నాయానతి దాఁటవు.
ఇప్పు డేమిగావించితి"వనిన మదనుండు కరంబులు మోడ్చి
స్వహస్తలిఖితం బైనపత్రికఁజూపుటయు నతండు నావక్క
ణంబుసూచి యచ్చెరువందుచునుండ, మదనుండు తండ్రి
నవలోకించి "దేవరయానతి శిరంబునం బూని ప్రాణపదం
బైనముద్దుచెల్లెలిని నొసంగితిని. ఇతని కెప్పు డెడరు వచ్చు
నప్పుడు ప్రాణంబులు విడువం గలవాఁడ నని ప్రతిన గొం
టి" ననుటయుఁ దనయుని విశ్వసింపక కపటంబు మనం
బున నణంచి కుమారికయు నల్లుండు వచ్చి దండంబు
వెట్టినఁ గైతవంబుగా దీవించి బాలహారిణమ్ములఁ జూచిన
క్రోల్పులివితంబున మనంబునవాలుమ్మని వ్రయుచుఁ గైత
వోపచారంబుల వారల నాదరించి నాగవల్లి చేయించి
యారాత్రి నిద్దుర పట్టక మఱునాఁటివేకువఁ "గూఁతురుఁ
గోడుకునాకులంబు చెఱిచిరి. ఇంక మీఁదటంజంద్రహాసుం

హెచ్చరిక పడియెనేని ప్రమాదంబు వచ్చు" నని దండంబు నం దలపోసి 'యెత్తెఱంగుననైన వీనిఁ జంప యమ్మహామునులవాక్యంబసిద్ధంబు సేసెద' నని నిశ్చయించి బ్రహ్మఘ్నుండు గోఘ్నుండు శిశుఘ్నుండు గురుఘ్నుండు మాతృఘ్నుండు పితృఘ్నుండు మిత్రఘ్నుండు యజ్ఞఘ్నుఁడు బంధుఘ్నుండు స్త్రీఘ్నుండు ననంబరఁగిన పదుగురు కొండెగాండ్రం బిలిపించి "నాఁటికి మీరు సేసిన నేరంబు సైఁచితి. నేఁటికేనియు నాశాసనక్రమంబున నడువుండు. సంధ్యారాగసమయంబునఁ బురంబునకు బయట నరణ్యసమీపంబుననున్న కరాళకాళికాకోవెలలో మీరలు డాఁగియుండుఁడు. ఆసమయంబున నొంటిగాఁ గాళికను సేవింప నెవ్వఁడు వచ్చునో వానింబట్టుకొని రెండు తుండెంబులుగా నఱకివైవుండు. ముందువెనుకలు చూడంబని లేదు. ఇట్లు చేసితిరేని నాకు నడుచు రాజ్యంబులో నర్ధరాజ్యంబు సిత్తు. మత్ప్రియపుత్త్రుండైన మదనునితోడ, 'సందేహింపకుం' డని పంపుటయు, నా చండాలు రియ్యకొని మద్యపానంబు సేసి క్రొత్తగా సానలు దీఱిన కత్తులు గేలం గైకొని మూఁడవజామునఁ గాళికాసదనంబునకుం జని యడంగి యుండిరి. ఆసమయంబున దుష్టబుద్ధి చంద్రహాసుని రావించి నెనరు దోఁప నిట్లనియె. అల్లుఁడా! నీకు శుభంబు గలుగునట్లుగా మత్కులధర్మంబుం దెలిపెద. మాయింటఁ బెండ్లియైన యల్లుండు సంధ్యారాగసమయంబునఁ బురిసమీపచండికాసదనంబునకుం జని

సేవసేసిరావలయును. ఇది తరతరంబుల నడచు కులాచారంబు. నీవు నట్లాచరింపుము. అనిన విని చంద్రహాసుండట్లయగుంగాక యని సమ్మతించె. అంతఁ గుంతలదేశాధీశ్వరుండు నిజశరీరపతనారిష్టంబులుగని పురోహితుండగు గాలవురావించి నమస్కరించి కనకపీఠంబున నునిచి 'మునీంద్రా! నాశరీరచ్ఛాయ శిరంబు లేకయె కనంబడియెడు నిది యరిష్టంబని విందు. రాజ్యంబు మీఁదియాసం దొఁ అంగితి. హరిచరణసరోరుహంబులు భజియించి ధన్యుండ నయ్యెద. అరిష్టలక్షణంబులు వినంగోరెద; నెఱింగింపు' మనవుడు గాలవుం డిట్లనియె.

—:అరిష్టలక్షణంబులు:—

రాజేంద్రా! తొల్లి దత్తాత్రేయుం డలర్కునకు నేతెఱం గెఱింగించె నీకుఁ జిత్తసమాధానంబు గలుగునట్లుగాఁ దత్క్రమంబు దెలిపెద. ధ్రువు వసిష్ఠు నరుంధతిని జూచినఁ దెలియకుండిననరునకు సంవత్సరంబులోపల, నగ్నియందుఁ గిరణంబులు సూర్యబింబంబునఁ గిరణరాహిత్యంబుం గనువాఁడు పదునొకండు నెలలలోపల, బక్కవాఁడు బలిసినను బలిసినవాఁడున్నట్లుండి బక్కచిక్కినను నెనిమిదినెలలలోపల, నడచునప్పుడు వ్రేళ్ళనియు గుదికాళ్ళనియు ఖండితంబులైనట్టు లడుగుజాడం గనంబడియెనేని యేడునెలలలోపలఁ, గాకి గ్రద్ద గూబ శిరంబున సోఁకెనేని యాఱు నెలలలోపల, నభ్యంగసమయంబున మేని చర్మం బదరెనేని

యయిదునెలలలోపల దననీడ వేఱొక్కలాగున నుండెనేని నాలుగునెలలలోపల యమునిదిక్కున మేఘరహితంబైన గగనంబున మెఱపుగనంబడియె నేని మూఁడు నెలలలోపలఁ, దనబింబంబద్దంబునఁ దలలేకకనంబడియెనేనిరెన్నెల్లలోపలఁ దనశరీరంబున నిర్వ్యాజంబుగా శవగంధంబుగలిగెనేని పక్షంబులోపల, జలకమాడినఁదడి తోడననశించెనేనియు హృదయమధ్యంబుననలందినచందనంబు శీఘ్రంబ యెండె నేని యు నీరుగ్రోలిన దాహంబు నిలువ దేని యు నయిదుదినంబులలోపల యమసదనంబునకు వేంచేయుట నిశ్చయంబు. మనుజులలోచనంబులలోఁదనరూపంబుగానరాదేని వీనులలో వ్రేళ్ళు సొనిపినయెడఁ బ్రాణఘోషంబు వినంబడదేని శీఘ్రంబ శరీరహాని సంభవించు. తన నీడఁ దాను భక్షించునట్లును గేశంబులు నుముకయుఁ దినినయట్లును దిగంబరుండైన జైనసన్న్యాసినవ్వుచు దగ్గఱ గంతులువేసినట్లును నాపాదమస్తకంబుఁ దైలంబు నలందికొని భూతలంబునం బడి నిద్రించునట్లును భయంకరాకారులైన బంటురౌతులు వెంటఁబడినట్లును గుదియలవారు పొడిచినట్లును నల్లనిశూద్రులు తఱిమి తాళ్ళువేయునటును నీలిచీరగట్టికొనినకాంత దక్షిణాభిముఖంబుగాఁ బోవ దాని వెంబడిఁబోవునట్లును స్వప్నంబు గన్నవారికి మరణంబు ధ్రువంబు. అరిష్టంబులు సంభవించినయప్పుడు జపహోమసురార్చనాదులుచేయించి సర్వసంగంబులు నిరసించి యిం

ద్రియ వికారంబులు జయించి నదీజలంబు సముద్రజలంబు నం జేర్చినయట్లు జీవునిఁ బరమపురుషుండైననారాయణుం జేర్చితత్త్వరహస్యకోవిదు లైనపురుషులు ధన్యులగుదురు. అని గాలవమునీంద్రుండు పలుకుటయుఁ, గుంతలాధీశ్వరుండు గుఱుసంబు నూఁద్చు మహానాగంబు తెఱంగున రాజ్యభోగంబులు విడువం దలంచి మంత్రికుమారుం డైనమదనునిం బిలిపించినఁ నతండు వచ్చి మ్రొక్కి యేమి కార్యం బున నియోగించెద" వనిన మీయల్లుం డగు చంద్రహాసు నీక్షణంబ పిలిపింపుము. మత్కుమారిక యగు చంపకమాలినిం బరిణయంబు సేసెద ననుటయు, వల్లె యని ముకుళితహస్తుం డై యతివేగంబునం దనగృహంబునకుఁ జనియె.

—:చంద్రహాసునకుఁ గుంతలరాజ్యపట్టాభిషేకము.:—

అట్టియెడ సంధ్యారాగసమయంబునఁ జండికాపూజనంబునకుం దగిన పూజాద్రవ్యంబులు గైకొని యొంటిగాఁ బోవునట్టి మఱంది నవలోకించి మదనుండు "రాజనందనా! కుంతలనాథుండు నిన్నీక్షణంబ తోడితెమ్మనె" ననవుడు నతండు "మామయానతిం జేకొని శాంభవీపూజనంబునకుఁ బూజాద్రవ్యంబులు గొనుచుం జనియెదఁ జండికాపూజానంతరంబ వచ్చెద" ననిన మదనుండు "దేవపూజనంబు నీకు బదులుగా నేను జేసి వచ్చెద నీవు రాజసమ్ముఖంబునకుఁ బొ" మ్మనియతనిచేతనున్న గంధపుష్పాక్షతాదిపూజాద్రవ్యంబులు గైకొని తా నెక్కిన గుఱ్ఱంబును ఛత్రచామరాదులు

నతనికిం నొసంగి నంపిన, నాచంద్రహాసుండు సత్వరంబుగా జని ప్రణమిల్లి నిలుచుటయుం, గుంతలవిభుండు గాలవసం యమీంద్రునిశాసనంబునం జంద్రహాసునకుం జంపకమా లినిం బెండ్లిసేసి తనసింహాసనంబున నునిచి పట్టంబు గట్టి సమస్తరాజ్యంబు నతనికొసంగి విరక్తుండై తొల్లియనుభవిం చిన భోగంబులం దలంచి రోవగించుచుం దపోవనంబునకుం జనియె.

అప్పుడమ్మంత్రికుమారుండు నగరప్రాంతంబునం గాం తారసమీపంబున రుద్రకాంతాసదనంబునకుం జనుటయు నమ్మహాధ్వాంతంబున నకొ్కవెలలోన డాఁగియున్న పరశు హస్తులు పైఁబడి యాయుధంబులం గ్రుమ్మి పడవైచిరి. ఇక్కడం జంద్రహాసుండు చంపకమాలినివివాహంబైకుంతల రాజ్యసింహాసనారోహణంబునమహోత్సాహంబు నొంది వందిసందోహంబులు కైవారంబులు సేయ వేలకొలందులగు వేత్రపాణులు సాహోనినాదంబుల నెచ్చరికలు దెలుపుచు ముందటంగ్రందుకొను సందడులు తొలంగింప మెఱుంగుల పరంపరలంబోలె శతముఖసహస్రముఖంబులుం గలదివ్య టీలు పెక్కువేలు నివ్వటిల్లఁ జంద్రజ్యోతులు నేకసహస్రం బులు ప్రకాశింపఁజంపకమాలినీసమేతంబుగా శచీసమేతుం డైనయాఖండలుండునుంబలెం దెల్లయేనుంగునెక్కి యక్క జంబైనవిభవంబునం బురప్రవేశంబుగాం జనుదెంచి మంత్రి గృహంబువాకిట మదావళంబు డిగ్గి యంతకమున్న చారు

ంచే నిజవృత్తాంతంబు విని కలంగి యెదురువచ్చిన మామ గారికిం బ్రణమిల్లి మదనుండు కాళికాగృహంబునకుం దనకు బనులు వోవుట యుఁ దాను రాజుసముఖంబునకుం జనుదెంచుట యు మొదలగు వృత్తాంతంబు నాద్యంతంబు సవిస్తరంబుగా నెఱింగించిన నమ్మంత్రి నిప్పులు ద్రొక్కిన గతిం బొక్కిపడి ముఖవికారం బణంచికొని కైతవప్రియం బున నల్లునియుల్లంబు పల్లవింపం జేసి నగరికిం బోవం బనిచి యయ్యమాత్యవర్యుం డత్యాహితంబునఁ దలయుఁ జీరయు వీడఁ గాళికాగృహంబునకుం బఱచి ఖండితశిరస్కుండైన కొడుకుం గని సంతాపంబు నొంది "శ్రీవిష్ణుభక్తునకు ద్రో హంబు దలంచిన పాపాత్ములయత్నంబులు ఫలించునే" యని యాదేవిబలిపీఠంబునం బెట్టుగాఁ దాఁకి భగ్నశిర స్కుండై ప్రాణంబు లెడఁబాసె. అంత వేగుఁజా ముకుట యుఁ జండికం బూజసేయ నర్చకుండువచ్చి గోవెలవాకిటం బడియున్నమంత్రినిఁ దత్కుమారునిం జూచి యెట్లు పొలి సిరో! ఏమిదుర్నిమిత్తంబో! యని మొఱ్ఱలిడుచుఁ బఱతెంచి చంద్రహాసున కెఱింగించుటయు నతఁడు పాదచారియై కాళి కాగేహళీప్రాంతంబునం బడియున్న సచివుఁ దత్కుమా రునిం గాంచి శోకసంతప్తుండై వీరల బ్రతికింపక పోయితినేని నాకపకీర్తి పాయ దనుచుఁ జతురస్రంబుగా బాహుమాత్ర ప్రమాణంబున నారుద్రాణిసన్నిధిని హోమకుండంబు త్రవ్వించి పావకునిఁ బ్రజ్వలింపం జేసి శర్కరా తిల పాయస

—: చంద్రహాసుఁడుదుష్టబుద్ధినిమదనునిబ్రతికించుట. :—

ఘృతంబులతోఁ గూర్చి తనమేనిమాంసఖండంబులు ఖండించి వేల్చి "దేవీ! నీవు శ్రీవిష్ణుదేవునిచిచ్ఛక్తివి, గావున, నీకుం బ్రియంబుగా శిరంబు పూర్ణాహుతి గావించెద"నని ఖడ్గంబు జళిపించునంతలో నవ్వైష్ణవశక్తి యప్పుడమితేని కరంబు వట్టికొని 'వీరప్రతాపా! నిసాహసంబునకు మెచ్చితి వలయువరంబు గోరు మనుటయు "మంత్రిని నతని కుమారుని ముందుగా బ్రతికింపుము. నాకు నారాయణ చరణారవిందంబుల దృఢభక్తి నొసంగు" మనిన నాభద్రకాళి యు, నట్లొసగు, నదియునుం గాక బలపరాక్రమసమున్నతులైనసుతు లిరువురు నీకుంగలిగెద రని చంద్రహాసుని డాయం బిలిచి హస్తమస్తకసంయోగంబు గావించి భగవంతుండైన రమాకాంతుని స్వరూపగుణవిభూతివిశేషంబులు, జీవాత్మపరమాత్మస్వరూపంబులును, సంసారనివృత్తి ప్రకారంబును, మోక్షస్వరూపంబును దత్త్వవిజ్ఞానంబునుం దెలిపి చండిక యంతర్ధానంబునొందుటయు,నయ్యమాత్యుం డును దత్పుత్త్రుండునునిదుర మేల్కనినచందంబున సమాగత ప్రాణులైరి. తోడనె యాచంద్రహాసునిపయిం బుష్పవృష్టి గురిసె. దేవతలు గొనియాడిరి. అంతనాచంద్రహాసరాజేంద్రుఁడు నమాత్యునిం దత్కుమారునిం దోడ్కొనిపురంబు నకు వచ్చి యాదరించి గృహంబున నునిచి, తల్లిదండ్రులైన మేధావినిం బుళిందునిం బిలిపించి, వినయంబున మ్రొక్కి

యభీష్టభోగంబులు సమర్పించి చంపకమాలిని యందును విషయయను యోషామణియందును బద్ధాత్ముండు మకరధ్వజుండు నను నిరువురు కుమారులం గాంచి బహుయాగంబు లాచరించి ముకుందచరణారవిందన్యస్తమానసుం డై ము న్నూఱుసంవత్సరంబులనుండి రాజ్యపరిపాలనంబు సేయుచు నున్నవాఁడు.

అని నారదమునీంద్రుం డర్జునా! యివ్విధంబుననీర్ష్యాసూయాపరుం డైనయాదుష్టమతి నరకంబునం బడకయుండుటకుఁ గారణంబు గలదు వినుము. మున్ను దానుభజయించు సాలగ్రామంబు శ్రీ తులసీ దళంబులతోడం గూడ మ్రింగియుండె. అది కారణంబుగా నతని కిహంబున దైవానుకూల్యంబు తప్పెంగాని పరలోకబాధ లేదాయె. సాలగ్రామతీర్థంబు శిరంబునఁ జల్లికొనిన మానవులకు నేఁబదికోట్ల యోజనంబులవిస్తారం బైన భూమండలంబునం గల పుణ్యతీర్థంబు లెల్లనాడినఫలంబు లభించు, సాలగ్రామంబు ధరించుటవలనఁ జతుర్దశ లోకంబులు ధరియించినపుణ్యంబు దొరకు. సాలగ్రామదానంబున భూ చక్ర దానఫలంబు గలుగు. సాలగ్రామ పూజవలన సకల దేవతలఁ బూజించిన సుకృతంబు చేకూరు. సాలగ్రామ వర్ణనంబువలన సకలవేద పారాయణఫలంబు సిద్ధించు. సాలగ్రామంబు సన్న్యాసియు ననునీరెండును శ్రీవిష్ణుదేవునకు స్థావరంబు చరంబునైన దేహంబులని బ్రహ్మకొనియాడుచుండు.

అంతకంటె శ్రీతులసియధికంబని పెద్దలు మందలింతురు. శ్రీకృష్ణదేవుండు శిరంబున నెమిలిపించెమును గర్ణంబులమకరకుండలంబులను నురంబునఁ గౌస్తుభంబును ధరియించు నంతకంటె శ్రీతులసీదళంబతిశయం బని ధరియించుచునుండు. ఇక్కతవిన్నవారలకభీష్టంబులు చేకూరునని పలికి నారదమహాముని దేవలోకంబునకుం జనియె. అంతనర్జునుండు విస్మయంబు నొంది తోడిరాజులతోఁ జంద్రహాసునిం గొనియాడుచుఁ గౌంతలంబు చేరంబోయిన నారాజకుమారులు

—: చంద్రహాసునికొడుకులు యఘూశ్వంబులంబట్టుట :—

బలపరాక్రమసంపన్నులయిన మకరధ్వజ పద్మాక్షులును మున్నాడి పఱతెంచిన జన్నంపుఁ దేజులఁ బట్టికొనిపోయి తండ్రి సముఖంబునఁ బెట్టిన జంద్రహాసుండు గనుంగొని “యివి ధర్మనందనుని యఘూశ్వంబులు. వీని సంరక్షించుటకుఁ గిరీటి వచ్చుచున్నవాఁడు. అతని మున్నాడి యిత్తురంగంబులు పాఱివచ్చె. కుమారులారా! మీరలు పదియైదు దినంబు లీ రెండుగుఱ్ఱంబులను రక్షించుచుండుఁడు. ఇంతలో వారలు రాకుండిరేని ధర్మసుతునియాగంబుకొదవపడకుండునట్లుగా మనమేపంపుదము.” అని పలుకుచుండు నంతలోఁ బార్థుని మొలగోలుమూఁకల కలకలంబు భూనభోఽంతరంబులు, దిక్కులు ప్రక్కలింప వినంబడుటయుం జంద్రహాసుండు ముఖచంద్రహాసచంద్రిలు గ్రంథుకొనఁ గొడుకులంజూచి మీరలుసకలసైన్య సమేతంబుగా మోహరింపుం డనుటయు, వారలు తత్పురంబు బయలు వెడలి

యర్ధచంద్రవ్యూహంబుగా మోహరించియుండునెడ శ్రీకృష్ణదేవుం డింద్రనందనునితో "వీఁడు చంద్రహాసుం డనుమహారాజు; పరమవైష్ణవుండు; ఇతండు విద్యచేత విజ్ఞానంబుచేత వృద్ధుండగు నైనను సమరాంగణంబున యౌవనస్థుండు సుమ్ము." అని పలుకునవసరంబునఁ జంద్రహాసుండు నిజసేనలఁ దలకడచి వచ్చి యర్జునునియరదంబున శంఖచక్రగదాపద్మహస్తుండును గౌస్తుభమాలికా కిరీట కేయూర మకర కుండల మేఖలాదామ మంజీరాది దివ్యభూషణభూషితుండును, సనకసనందనాదిమహామునిధ్యానగమ్యుండును నైన శ్రీగోపాలదేవునిం గని భక్తిభయవినయసంభ్రమంబులు మెఱయ శరశరాసనంబులు పాఱవైచి మాణిక్యరథంబు డిగ్గనుఱికి "యదునందనా! శ్రీకృష్ణా!యని సాష్టాంగదండప్రణామంబు గావించి లేవకుండిన శ్రీవాసుదేవుండు తాను నరదంబు డిగ్గి నిడుదభుజంబులు సాఁచి లేవనెత్తి కౌఁగిలించికొనిసవ్యసాచిం జూచి "నాకితండునిజభక్తుండు, త్రికరణంబుగా నన్ను నమ్మినవాఁడు. బ్రహ్మరుద్రాదులకేనియు నజేయుండు. ఇతనితోడ సమరంబు వలదు. కౌఁగిలించికొమ్మనుటయు, గౌంతేయుండును "నాకురువంశంబు నేఁటికిఁ బావనంబయ్యె. నాజన్మంబు సఫలంబయ్యె." నని చంద్రహాసునిం గౌఁగిలించికొనియె. అంతఁ, గుంతలేశ్వరునియాజ్ఞవలనఁ దత్సుమారుండై నమకరధ్వజుం డశ్వమేధాశ్వంబుల రెంటిఁ గొని వచ్చి శ్రీహరిసన్నిధియందు నిచి కృష్ణార్జును

లకునమస్కరించిన, నయ్యవసరంబున రాజసమాజంబుల తోఁ దేజస్వియైనచంద్రహాసుండు సుధారసనిరాసంబులైన వాగ్విలాసంబుల నుపచరించి వాసుదేవునిఁ దనపురంబు నకుం దోడ్కొనిపోయి యచట దుష్టబుద్ధిమదనులఁ, జంపకమాలినీవిషయలఁ, బద్మాక్షమకరధ్వజుల, మఱియునుం దక్కినబంధుజనులఁ, గానిపించి శ్రీకృష్ణపదారవిందభజనాయత్తచిత్తుండై తనకుం గలరాజ్యం బంతయు ముకుందున కొసంగి, యనంతరంబ గాలవమహామునింబిలిపింప నతండు సచ్చిదానందమయుం డైనశ్రీకృష్ణదేవునివిగ్రహంబుఁ గనుంగొని పులకాంకితగాత్రుండును హర్షాశ్రుజడీకృతనేత్రుండు నై ముహూర్తమాత్రంబు తన్మయుం డై యూరకుండె. అంత రుక్మిణీకాంతుండు కుంతలేశ్వరుం డొనర్చు నర్చనల సంతసిల్లుచు దివసత్రయం బతనిపట్టణంబున వసియించి నాలవనాఁడు చంద్రహాసుండు తనకు మున్నర్పించిన రాజ్యంబు తత్పుత్రులైన పద్మాక్షమకరధ్వజుల కొసంగి పట్టంబుగట్టినఁ జంద్రహాసుండు నందనులం జూచి "యీనందనందనుని చరణారవిందంబులు భజించి మోక్షానందంబు నొందుఁడు. నాయట్ల కీర్తిఁజెందుఁ" డనుచు దీవించి బుద్ధి సెప్పి వారలచే వీడ్కొని చతురంగబలంబులు గొలువ నవ్యసాచికిం దోడై వెడలె.

అంత నశ్వమేధాశ్వంబులు నానాభూములు సీమలు జనపదంబులు నదంబులు ప్రాదంబులుఁ గ్రమించుచుఁ జను

చుండఁదత్తద్దేశాధీశులు మెప్పైనకప్పంబులుగొని భక్తియుక్తులై సేవింప విక్రమోపార్జనుం డైనయర్జునుఁడు హరియును హరులవెంబడిం జనుచెడ నవి యుత్తరసముద్రతీరంబునకుం జని యందఱుం గనుంగొనుచుండ సాగరమధ్యంబునకు దాఁటుటయు నమ్మహీపాలు రందఱు నివ్వెఱఁగంది నిశ్చేష్టితులై యంబుధిసాధించువిధంబు తెలియక విహ్వలత్వంబు నొంద శ్రీకృష్ణుండు మయూరధ్వజు నర్జునుం బ్రద్యుమ్ను హంసధ్వజు బభ్రువాహనునిం బిలిచి "మీరథంబులకు దశదిశాభాగంబుల గిరివనసముద్రాది దుర్గంబుల నడ్డంబు లేదు గావున మీ రేవురు నావెంబడి రం" డని సకలదళంబుల నచ్చటనిలిపి యంబుజాక్షుండురథారూఢుండై సముద్రంబు సొచ్చి వెదకియొక్కదీవియందు జీర్ణశరీరుండును శ్మశ్రుజటాపటలభూషితుండును భానుసహస్రతేజుండు నై చివికినవట పత్రంబులు గొన్ని శిరంబునకు నడ్డంబుగా వైచికొని యున

—: శ్రీకృష్ణాదులుబకదాల్భ్యనిజూచుట: —

వరతహరిధ్యానానందసాగర మగ్నుండును వరతపఃప్రాగల్భ్యుండు నగుబకదాల్భ్యం గనుంగొని యేవురుమహారథులతోడంగూడ రథంబులు డిగ్గి నమస్కరించుటయు నమ్మహాముని శ్రీకృష్ణునిం గనుంగొని యివ్వెన్నని కెన్నివింతలు! ఇమ్మూర్తుల కింతసందడి నెందులకుం గొనివచ్చె? అని యసహ్యపడుచునుండ నరుండు మెల్లన నత్తపోధనునిం జేరి కేలు మొగిచి "మీశరీరంబున వింతలు గనుపట్టు

చునున్నయవి నందునందులఁ బుట్టలుపెట్టె. అందున నూ ఱువేయుం బడగలుగలసర్పంబులు దర్పంబున నటియించు చున్నయవి. మోఁకాళ్ళ మోఁచేతుల మహావృక్షంబులు పుట్టె. కర్ణంబుల గూండ్లు కట్టుకొని యనేకపక్షిసహస్రం బులు సంచారంబులు సేయుచున్నయవి. మీరు జీర్ణంబు లగువటపత్రంబులు గొన్ని తలమీఁద నైచికొనియున్నవా రలు. ఇది యేమి?" యని యడుగుటయు, నమ్మహాముని నవ్వుచు "క్షణభంగురం బైనశరీరంబు నీటిబుగ్గచందంబున నెప్పు డెవ్వేళ నవిసిపోవునో తెలియదు. సంగంబులు దుఃఖ ప్రదంబులు, గృహారామక్షేత్రంబులు నశ్వరంబులు, అల్ప కాలంపుబ్రదుకున కింతమాత్రంబు చాలదే యని మఱ్ఱాకు శిరంబున కడ్డంబుగా నునిచికొని యున్నవాఁడ"అనిన విని యర్జునుం డాశ్చర్యభరితమానసుండై "తపోధనా! మీకెన్ని సంవత్సరంబు లయ్యె నానతీయవలయు" ననుటయు,నమ్మహా ముని పార్థునింజూచి నేను జనియించినతరువాత మృతు లైనరోమశులకు లెక్కలేదు. మార్కండేయుల నెన్నఁ దరంబుగాదు. నేను బుద్ధియెఱిఁగినవెనుక నిరువది బ్రహ్మ పట్టంబు లయ్యె. మున్నొకసమయంబున సప్తసాగరంబు లేకీభూతంబులై మహాప్రవాహంబుగా వచ్చునప్పు డిచ్చ టికి భూలోకంబు భువర్లోకంబు సువర్లోకంబునుం దేలి యా డుచు వచ్చె. అప్పుడొక్కమఱ్ఱిచెట్టిచ్చటనుండె. దానికి సహస్రశాఖలు గలవు. శాఖకు వేయేసి బ్రహ్మాండంబులు

ప్రేలుచునుండె. ఆమఱ్ఱిచెట్టు కొనచివురాకునందు నొక్కచక్కని చిన్నిబాలకుండు పవ్వళించి కోమలంబైనపాదాంగుష్ఠంబు ముఖారవిందంబున నిడి చీకుచు వెడవెడ నేడ్చుచు నవ్వుచు నుండె. వానిధర్మంబున నాప్రళయకాలమహామారుతంబునం గొట్టువడక యూనసముద్రంబు సుడులలోనం దగులక సంచరించితి. ఆసుద్దు లిప్పుడేమిటికి; అర్జునా! నీయొద్ద దీర్ఘబాహుండును నీలమేఘశ్యామలగాత్రుండును గమలనేత్రుండును, గౌస్తుభవనమాలికాకనకాంబరధరుండును నైనయితండు నీకు బావ గదా? మీతోడం గూడం దిరిగి తిరిగి యీచందంబయ్యె. రమ్మహాత్మునివారు లేక యొంటిగా సర్వంబునం దానయై హాయిగా నున్నవానికి నాభియందొక్క కమలంబు గలిగె. దానియందునాలుగు మొగంబులతోడు నొక్కండు గలిగె. వానికిం గలిగె నీచరాచరజగంబులు. అది చాలక నాంటి చిన్నవాండు యదుకులంబునం బుట్టె పదియాఱువేలనూటయెనమండ్రం బెండ్లియై మీవంటివారితో వియ్యంబు లంది యీసంసారం బేమిటికిం దెచ్చికొనియె? అని నవ్వుచు "నోయీ! త్రైలోక్యకుటుంబీ! యిందురావోయి!" యని శ్రీకృష్ణుం జేరంబిలిచి కౌంగిటం జేర్చుటయు, నాశౌరి యమ్మునికి నమస్కరించి "యిరువదిబ్రహ్మకల్పంబులు చూచినపెద్దవు. విష్ణుభక్తాగ్రేసరుండవు. కావున నీవే విష్ణుదేవుండవు. నీవరుగుదెంచి ధర్మపుత్రునియాగంబు సఫలంబుగా నెఱవేర్ప

వలయు" ననుటయు, దాల్భ్యుండు "దేవా! ననీ్నరీతిఁ బ్రస్తుతించి గర్వం బనువెట్టి వట్టింపఁగుము. నీచందంబునకు వెఱతు. తొల్లినాగర్వంబును బ్రహ్మగర్వంబును జెఱిచిన పుణ్యపురుషుండవు గావె? అక్కథ నీసఖులు వినం జెప్పెద నని పలుకం దొడంగె.

—: బకదాల్భ్యుఁడు విష్ణుమహిమ సెప్పుట :—

అర్జునా! తొంటిబ్రహ్మకల్పంబున నొక్కచతుర్ముఖబ్రహ్మదేవుండు నాయెదుట నిలిచి "మునీంద్రా! చింపినుఖ్ఖాకుచాఁటున నేమిటికిఁ దపంబు నేసెదవు? వలయువాంఛితంబుల నిచ్చెద. తపంబు చాలింపు" మనిన నతనిం గనుంగొని, నేనిరువదుండ్రు బ్రహ్మలం గంటి. వారిలో నీవు కడపటివాఁడవు. నీవేమివరం బిచ్చెదవు నే నేమిగైకొనియెద? నని నవ్వుచుండ నప్పుడు మాయిరువురనడుమ ధరణీచక్రంబు వ్రక్కలించుకొనియొక్క యుత్పాతమారుతంబువుట్టి మమ్ము నిరువుర నెత్తికొనివేఱొక్కబ్రహ్మాండంబులోఁబండుటాకులవలెం బాఱవైచుటయు నందొక్క యెనిమిదిముఖంబులబ్రహ్మ మీర లెవ్వ రెచ్చటినుండి వచ్చితి రనిన, నేనుఁ జతుర్ముఖబ్రహ్మను, సత్యలోకంబున నుందుదు, నిమ్మౌనినాశిష్యుం డనుటయు, నాయష్టముఖవిరించి నవ్వుచు "నోరి! నాలుగుముఖంబులవాఁడవు. నీ వేమి! బ్రహ్మపట్టం బేమి! శిష్యుఁ డేమి! పాండిత్యంబులు మాని మాకు దాసుల రై యుండుండ నిమె. అట్టియెడ నచ్చటమునువటికం బెఁబదింత

లధికంబుగ నొక్క మహామారుతంబు పుట్టి మమ్ము ముప్పుర నెత్తికొని మఱియొక్క బ్రహ్మాండంబునం జొక్కాకులుంబలెం బడవేయుటయు, నచ్చట, నత్యున్నతాకారులు నతివదాన్యులు నైనమహాపురుషులు మమ్ము ముప్పురంజూచి "మీర లెచ్చట నుండువార" లనిన, నయ్యష్టముఖబ్రహ్మ "నేను జగద్విధాతను, బద్మసంభవుండ" ననుటయువారు మమ్ము ముప్పురందోడ్కొనిపోయిపదియాఱుముఖంబుల బ్రహ్మసముఖంబున నిలుపుటయు, నతండు తనసముఖమువారిం జూచి యిమ్ముప్పుర మనయూడిగంబులలో నిలుపుం డని పలుకుచుండ, నర్జునా! యమ్మహాశ్చర్యంబె మనిపలుకుదు!నచ్చట దొంటికంటె శతగుణంబుగా వేఱొండు చండమారుతంబు దయించి, మమ్ము నలువుర నెత్తికొనిముప్పదిరెండు మోములతమ్మిచూలిసమ్ముఖంబునం బడవైచుటయు, నతండు నట్ల పలుక, నందొక్క చక్రవాలంబు పుట్టి, మమ్ము నేవుర నెత్తికొనుపోయి యఱువదినాలుగుమోముల యంబుజభవుని చెంతం ద్రోచె; నిట్లుక్రమక్రమంబున బహుపద్మసంభవులతోడంగూడం జనిచని కడపటసనకసనందనాదిమహాముని సేవితుండును సహస్రముఖుండునుదుర్నిరీక్ష్యతేజోరాశియు నైన యొక్క సహస్రముఖపరమేష్ఠిం గన నతండు మమ్ముం గనుంగొని ప్రత్యుత్థానంబు నేసి యర్ఘ్యపాద్యాదులొసంగి స్వాగతం బడిగి మీకృపాకటాక్షంబున నీలోకంబున నధికారంబు సేయుచు నున్నవాఁడ. నేనును నాశరీరంబును

మత్పరిజనంబులును మీయధీనంబులు. నాకేమి కైంకర్యంబు నియమించెదరు? అనినఁ దొంటిపద్మసంభవు లందఱు గర్వంబు లుడిగి మదంబులు మాని బ్రహ్మత్వాహంకారంబులు దొఱంగి దండప్రణామంబులు సేసి "దేవా! నీవు సాక్షాదధోక్షజుండవు. నీయైశ్వర్యం బపారంబు. నీమహిమ నీకు సహితమెఱుంగం దరంబు గాదు; మహాసముద్రంబున ఫేనబుద్బుదంబులు పుట్టుచందంబున నీయం దనేకకోటి బ్రహ్మాండంబులు పుట్టుచుం గిట్టుచు నుండు" ననివినుతించుటయు, సహస్రముఖుండైన యుప్వారించి వారల నాదరించి యాకమలసంభవుల నయ్యైపదంబుల నిలిపి నన్ను నిచ్చటికిఁ బనిచె. నాఁటఁ బడలికలు దీర్చుకొనుచు నిచ్చట నున్నాఁడ. కవ్వడీ! గర్వం బెవ్వరికిం గారాదు. అనినఁ గృష్ణార్జును లమ్మునిం బ్రార్థించి నవరత్నమయం బైనపల్లకియం దునిచి తోడ్కొని యచ్చటనున్న యాగహయంబుల మరలించుకొని సాగరంబు వెలువడి సమస్తరాజలోకంబు సంతసింపం జతురంగసేనాసమేతులై యవ్వలం మరలిరి.

—అర్జునుని రాకవిని సైంధవునిపుత్త్రుండు మృతుండగుట—

తదనంతరంబ యాగహయంబులు సింధుదేశంబు సొచ్చుటయుఁ, దద్దేశాధిపతియగు సైంధవునికుమారుండు [illegible]లుఁ పురనుండి మహారథికులతోడం గూడ గాండీవి యాగహయంబుల వెంబడి వచ్చెనని చారులవలన వినినమాత్రంబున గుండియ లవిసి దిగులునం బ్రాణంబులు పరిత్యజించె.

అంత దుర్యోధనుసోదరి యైనదుస్సల మృతుండగుతనయు
నిం గనుంగొని పదంబులు తొట్రుపడ నేడ్చుచునగరంబు
వెలువడి వచ్చి శ్రీకృష్ణునిపదంబులపయిం బడి హాకృష్ణా!
ద్వారకానాయకా! అనాథనాథా! పార్థుండు మున్ను నా
పెనిమిటిం జంపి యిప్పుడు నాబిడ్డనిం జంపె. అన్యాయ
మన్యాయము! నన్నుంగావవే" యని మొఱ్ఱయిడుటయు,
నర్జునుం డరదంబు డిగ్గి యయ్యమ్మకుం బ్రణమిల్లి "పుత్త్ర
శోకంబునం దల్లడింపకుము. మనపాల శ్రీహరిగలం"డని
పలుకుచు నంబుజనాభునిం దోడ్కొని యప్పట్టణంబునకు
వచ్చిన, నచ్యుతుండుకొలువులోనం గతజీవుండై పడియున్న
సైంధవకుమారునిం దనకరారవిందంబున నిమిరిన, నతండు
దిగ్గన లేచి నమస్కారంబు గావించిన, సభవార లందఱుం
బ్రమోదమానమానసులై "ద్రుపదరాజనందనయభిమా
నంబు గాచినభయత్రాతవు! ఆర్తి నొందిన గజేంద్రునిం
గాచినదయానిధివి గదా! గదాధరా!" యని వినుతించిరి.
అంత సైంధవకుమారుండు కృష్ణార్జునులకు మ్రొక్కి నృత్త
గీతవాద్యంబులతో మహోత్సవంబుగా వారలం బూజించె.
అంతఁ గౌంతేయుండు దోఁబుట్టు వగుదుస్సలకుం దత్పు
త్త్రునకును మత్తదంతావళంబు లనేకసహస్రంబులు, బహు
లక్షతురంగంబులు, నసంఖ్యాకరథంబులు నపరిమితధనక
నకరత్నభూషణాంబరంబులు నొసంగి ధర్మతనయునియజ్ఞం
బుఁ జూడరం డని ప్రార్థించి వారలు వెడలినయనంతరంబు

—: కృష్ణార్జునులు హస్తినాపురమునకు మరలుట. :—

సంవత్సరంబు సమాప్తప్రాయం బగుటంజేసి వారువంబుల స్వేచ్ఛావిహారంబులు నాని, హస్తినాపురి కభిముఖుండ య్యె, అప్పుడు శ్రీకృష్ణుండు రాజులం గనుంగొని ధర్మ పుత్రుం డసిపత్రవ్రతంబులు సలుపుచు బడలియున్నవాఁడు. నేను మున్నగాఁజని మీపరిణామస్థితులు దెలియంజేసెద తురంగంబులఁ గూర్చుకొని మీరు సాయంకాలంబునకరరం డని పలికి యాకంసాంతకుండు కరిపురంబు చేరం జని యు చ్చట గంగాతీరంబున రత్నకాంచనప్రభా దేదీప్యమాన సభాంతరంబున మహామునిసమేతుండైన ధర్మతనయుంగనుం గొని ప్రణమిల్లి ‟జననాథా! నీప్రతాపంబున ఘోటకం బనాఘాటంబుగా సంచరించి వచ్చె. దిక్కులరాజుల నెల్లం గెలిచి నీయనుజుండు కప్పంబులు గొనివచ్చె” నని హంస ధ్వజుం డాదిగాఁ గలరాజన్యుల జన్యప్రకారంబు దెలియం జెప్పి యచ్చటనున్నమునిజనులకు నమస్కారంబును గుశల ప్రశ్నంబునుం గావించి కుంతి మొదలగు గురువనితాజనం బులకుం బ్రణమిల్లి తనకు మ్రొక్కినభీముని మాద్రేయుల సుభద్రాద్రౌపదుల నాదరించి, వృకోదరసహితంబుగా నిజ మందిరంబునకుం జని రుక్మిణీసత్యభామాదిమహిషారత్నం బుల యుల్లంబులు పల్లవింప నించుకవడి వినోదించి తోరణ వితానాదులచేఁ బురంబు సింగారింప నియమించి పౌరులు పురోహితులు, సామంతదండనాథులు,తద్వ్యధూజనంబులు

వార సుందరీబృందంబులు ధర్మరాజానుమతంబున బయలు వెఱయుటయు, భీమాదియోధవరులతోడం గూడ నమ్మా ధవుండు చతురంగంబులు గొలువ బకదాల్భ్యునెదుర్కొ నుటకుం గదలి వికసితకుసుమసౌరభసంభరితం బైనపురో ద్యానసమీపంబున నర్ధచంద్రవ్యూహంబు పన్నించి నిలి చె. అంతం బద్మినీకాంతుండు పశ్చిమపర్వతంబు చెంత నిలిచె. అప్పుడు గంధతైలావసిక్తంబు లగు కరదీపికాసహ స్రంబులు వెలుంగ నభినవశృంగారభూషితాంగు లగురాజ పుంగవులు గొలువ, మంథానమథ్యమానమహార్ణవఘుమం ఘుమితఘోషగంభీరం బైనసేనాకోలాహలంబుతోడ జల ధరగర్భనిర్భేదనారంభ విజృంభమాణ మాణిక్యధ్వజంబు లు చెలంగం, బ్రచండమారుతపూరితకులాచలదరీఝరీ జృంభమాణగంభీరనిస్వనంబులం బురుడించు నిస్సాణరవం బులతోడ సనర్ఘ్యమణిమయశిబికాధిరూఢుం డైనబకదా ల్భ్యమహామునీంద్రు వెంబడి నశ్వమేధాశ్వంబుల మున్నిడు కొని, గాండీవధన్వి యెదుట నున్నపుండరీకాక్షుతోడ సం ధించుకొనియె. పౌరపురంధ్రీమణు లింద్రనందనునిమీఁదం జల్లుమౌక్తికంబులవలన భూమిరత్నగర్భయయ్యె. వారలు చల్లెడు పూవులవలన గంధవతి యయ్యె. భీమసేనమా ద్రేయముఖ్యులు బకదాల్భ్యమునీంద్రపాదపద్మంబులకుం బ్రణమిల్లి పల్లునసేనాప్రకరంబులతోడం గలసి పట్టణంబు నకుం జనిరి.

—కృష్ణుండు ధృతరాష్ట్రునకువచ్చినరాజుల నెఱింగించుట—

తదనంతరంబ, మహీపాలకు లందఱు విచిత్రంబులైన కానుకలు గొనుచు వ్రతదీక్షాపరుండైనధర్మనందనుని పాదారవిందంబులకుఁ బ్రణమిల్లిరి. అప్పుడు విదురసంజయకృపాచార్య ప్రముఖమిత్ర బాంధవ సుహృజ్జనులతోఁ డంగూడఁగొలువై యున్న ధృతరాష్ట్రుని చెంతకుం జని మహీపాలకుల నెల్లనమస్కారంబు సేయించి పుండరీకాక్షుండు వారల పేర్వేఱ నిట్లనియెఱింగించె. ఇతండు శౌర్యసముద్రుం డైననీలధ్వజుండు, స్వాహావధూవల్లభుం డైనవైశ్వానరుం డీతని యల్లుండు. ఇతండు చిత్రాంగదాకుమారుం డైన బభ్రువాహనుండు. రణంబున సాత్యకిప్రద్యుమ్నవృష కేతన కపికేతనుల జయించి సంజీవనరత్నంబుఁ దెచ్చిమగుడ బ్రతికించె. ఇతండు చంద్రహాసభూపాలుండు. ఇతనిచరిత్రంబు విచిత్రంబు. ఇతం డలిగెనేని దేవదానవులు వడవడవడంకుదురు. ఇతండు మయూరకేతనుండు. ఈరాజుసౌదార్యంబు శౌర్యంబును వర్ణింప నాతరంబుగాదు. వృద్ధబ్రాహ్మణరూపంబునం బోయి నేను వేడినయెడఁ దనశరీరంబు సగంబు గోసి యిచ్చె. ఇతండు హంసధ్వజుండు; ఈరాజుకొమరులను బవరంబున గెలుచుటకై నేనుపూర్వంబు నేసినపుణ్యంబులన్నియు వెచ్చపెట్టితి. వారలశిరఃకపాలంబులు రుద్రుండు హారనాయకంబుగా ధరియించె. ఇతండు వీరవర్మ; సర్వప్రాణిసంహారకర్త యైనయముం డీతనియల్లుండు. వీర లందఱు నొక్కరికన్న నొక్కరధికులు. వీరల నెల్ల నీకుమారుం

డైనయర్జునుండునిర్జించె. నీభాగ్యంబునకుం గొంత మే
మి? అని వినిపించుచుండ ఫల్గునుండు ధృతరాష్ట్రునకునమ
స్కరించి తల్లికి మ్రొక్కుటయు (నామె)బహుళాస్త్రశస్త్ర
వ్రణకిణాంకితంబు లగు నతని యంగంబుల నిమురుచు
మ్రొక్కిన కర్ణనందనుం గౌఁగిలించికొనియె.

తదనంతరంబ,ద్రౌపదిశుభముహూర్తంబున హాటక
పుటికలో నానావిధంబు లైనవిత్తనంబులు గొనుచు మురారి
యయ్యమ్మననువర్తించి పిఱిందిదెస నరుదేర నానాపృథివీ
పాలకులు దూరంబున నిలువ యమనందనుండు నధ్వరభూ
మిశుద్ధిగా నాఱువృషభంబులఁ బూన్చిన బంగరునాఁగలి
గైకొనిమహామునులు మంత్రంబులు పఠించుచు వెంబడిరా
యాగస్థలంబుదున్నె. అంత దీక్షితుం డగు ధర్మనందనుని
రత్నకుంభసంభృతంబులును, గంధద్రవ్యపరిమళమిళితంబు
లునానావిధౌషధియుక్తంబులు నైన పుణ్యసలిలంబులచేఁ
గుంతియు దేవకియు యశోదయు సాదరంబుగానభిషేకంబు
గావించిరి. ఋత్విజులు నెనమన్నూట తొమ్మిది కుండ
నంపు టిటికలు గరుడాకారంబుగా నమర్చి యిట్లు లొక
టొకటికి నినుమడిసంఖ్యగా గరుడాకారంబున నైదువేదిక
లమర్చి శాస్త్రోక్తంబుగా నిష్టకాచయనంబు సేసి యష్ట
ద్వారసమన్వితంబు నష్టాపదేష్టకామయంబును వివిధ విచి
త్రతోరణధ్వజాలంకృతంబునుంగా యాగశాల గట్టించిబద
రీబిల్వపలాశయూపంబు లిరువదియొక్కటి వరుసగా నిలిపి

—:ధర్మరాజశ్వమేధం బొనరించుట:—

స్రుక్స్రువంబులు నులూఖల జుహువు మొదలైన యజ్ఞ పాత్రంబు లలంకరించిరి. సంశతిబ్రహ్మకల్పజీవి యైన బక దాల్భ్యుండు బ్రహ్మయు, వేదవేదాంగ రహస్య నిస్సంశ యుండైన సాత్యవతేయుం డధ్వర్యువు, వసిష్ఠవామదేవరో మశగాలవ కపిలసుమంత భాగురి భరద్వాజ జమదగ్నిరైభ్య కౌండిన్యగౌతములు ఋత్విజులును గా, నరుణి పులహ పులస్త్యోపమన్యువిశ్వామిత్ర మధుచ్ఛంద విభండకధౌమ్య వాయుభక్షకులగక్షోఘ్నమంత్రపాఠకులు గానియమించిధర్మ నందనుండు, మృగశృంగధరుండును కృష్ణాజినాంబరుండు ను, కుశాసనాసీనుండు నై యున్నసమయంబునం బరాశర నందనుండు, రాజలోకంబు నవలోకించి, మీరలు కళత్ర సమేతంబుగా జాహ్నవీపవిత్రోదకంబుల ధర్మరాజునభిషే కింపవలయు ననియె. అంతట ననసూయయు నత్రియు, నరుంధతియు వసిష్ఠుండును, రుక్మిణియుశ్రీకృష్ణుండును, హి డింబయు భీమసేనుండును, సుభద్రయు నర్జునుండును, మా యావతియుఁ బ్రద్యుమ్నుండును, ఉషాకన్యయు ననిరుద్ధుం డును, ప్రభద్రయు వృషకేతుండును, ప్రభావతియు యౌవ నాశ్వుండును, సునందయు నీలకేతుండును, ధమ్మిల్లయు ననుసాల్వుండును, మొదలుగాఁ గల యిఱువదినలువుర దంపతులు పంచపల్లవసమంచితంబులైనకలశంబులుగొను చు మందమందగమనంబులం గదలి ముందట గీతవాద్య

నృత్యంబులు మొరయ గజాధిరూఢు లై విప్రకన్యలు చల్లు మౌక్తికంబులు మెఱయఁ, గుంతీదేవకీయశోదలం బురస్కరించికొని యరుగుసమయంబునఁ గలహఘటనావిశారదుం డైననారదుండు సత్యభామాగృహంబునకుం జని పూజలు గైకొని యిట్లనియె. "భామామణీ! మగండు నీదెసఁ గూర్మి గలవాఁడని మిగుల గర్వించియుండుదువు. నేఁడు పెద్దతనంబు రుక్మిణీదేవి కిచ్చె. అది యెట్లంటి వేని మూర్ధాభిషిక్తులైనక్షత్రియోత్తములు పట్టంపురాణులతోడంగూడఁ జుట్టు నుం గొలువ, ఛత్త్రచామరంబులు మెఱయ భ్రాజిష్ణుం డైన శ్రీకృష్ణదేవునితోడం గూడ రుక్మిణీదేవి కలశాభిషేకంబు సేయుటకై జాహ్నవికిం జనియె నీచనువు వ్యర్థంబయ్యె," ననిన సాత్రాజితి కలహాశన మునిం జూచి యేకాంతంబునందును బ్రాణేశ్వరుండు నన్ను మఱచునే యని తన కేళిసౌధంబున నున్న మురారిం జూపిన సురముని విస్మితుండై విష్ణుదేవుని వ్యాపకత్వంబుఁ గొనియాడుచు యథేచ్ఛముగాఁ జనియె.

—:అశ్వమేధవిధి:—

అనంతరంబ,యిరువదినలుగురు దంపతులు, కొంగుముళ్ళతోడంగూడఁ గుసుమగంధబంధుర హేమకుంభసంభరితగంగాతరంగిణీపవిత్రోదకంబులుదెచ్చి ఋత్విజులువేదమంత్రంబులు చదువ హేమకటాహంబులం బోసి ధర్మతనయున (కభిషేక మాచరింపఁ బూతాత్ముం డగు నతండు)

మఘాశ్వంబునకు నభిషేకంబు సేసి, మహామునుల నెల్లఁ గన కాసనంబుల నిడి గంధమాల్యాంబరభూషణంబు లర్పించి యథోక్తదక్షిణ లొసంగి యయ్యశ్వంబును యూపస్తంభంబునం గట్టినఁ దానిని బాంచాలియుఁ దానును బూజచేసి వలగొని, యగ్నిశిఖాముఖంబున గంధర్వలోకంబునకుం జను మనిన నయ్యశ్వంబు మోర యల్లార్చుచుఁ దనయభిప్రాయంబు నభినయించిన నశ్వహృదయజ్ఞుం డైన నకులుండు ధర్మజునింజూచి "క్రతుఫలప్రదాయకుం డైన శ్రీహరి తనముఖంబున నున్నవాఁడు. స్వర్గఫలం బేమి హెచ్చు!" అనియశ్వంబు దెలుపుచున్నదన శ్రీకృష్ణసహితంబుగా బుధులు సంతోషించిరి. అంత నగ్గంధర్వరత్నంబును మంత్రంబుల విశసనంబు గావించిన సౌమ్యుండైన ధౌమ్యుండు వాజిదక్షిణకర్ణంబు మెలివెట్టెఁ బాలు వెడలె. భీమసేనుండు పురోహితునియనుమతిని గృపాణంబు గొని యశ్వశీర్షంబు ఖండించిన నది తేజోరూపంబున నెగసి సూర్యునిం గలసె. మురహరుండు నత్తురంగకళేబరంబు విశసనంబు సేసినఁ దత్తేజంబు శ్రీహరిలోనం గలసె. తన్మాంసరాశి కర్పూరరాశియైన మునులు గనుంగొని "కుంతీతనయాగ్రణి! నీభాగ్యంబునకుం గొలంత యెయ్యది? అపఘనసారంబు ఘనసారం బయ్యె" నని సన్నుతులు సేయ నక్కర్పూరంబు ప్రథమాహుతిగా నాచార్యుండు నింద్రు నుద్దేశించి చేసిన నయ్యైంద్రుండు చేయి చాఁచి యాహుతిం గైకొనియె.

అశ్లే దేవత లందరు వేదవ్యాసు లొసంగు నాహుతులు సాకారంబుగా వచ్చి కైకొనిరి. త్రైలోక్యంబును దృప్తిం బొందె. పురోడాశప్రాశనంబును సోమపానంబునుం జేసి ఋత్విజు లానందించిరి. ధర్మనందనుండు పూర్ణాహుతి గావించి యవభృథస్నానంబు నాచరించె. అ య్యశ్వమేధయాజిని రాజీవాక్షుండు నందంద కౌఁగిటం జేర్చి యభినందించె. అంత ననసూయ మొదలగు వధూజనులు నీరాజనంబులు సేసిరి. అజాతశత్రుండు బకదాల్భ్యునకు రత్నమయ వృషభంబును వ్యాసునకు సకలభూమండలంబు దక్షిణగా నొసంగిన నతండు క్రమ్మఱ నాభూమి విక్రయించి యా ధనంబు దీనుల కొసంగె. ఒక్క యరదంబు నొక్క మదగజంబును నూఱుగుఱ్ఱంబులు నూఱుధేనువులు నాలుగుసోలల ముత్తియంబులు నలువురు సైన్యపతులనొక్కొక్క ఋత్విజునకు దక్షిణగా నొసంగి సభాసదులైన ద్విజులకు నపారంబుగా దక్షిణ లొసంగికోటిస్వర్ణంబులు పదివేలగుఱ్ఱంబులు నూఱేనుంగులు నొక్కవరుస సొమ్ములు వచ్చిన రాజులకెల్ల వేర్వేఱయొసంగి, యాదవులకెల్ల నందులకు రెట్టి ప్రత్యేకంబుగా బహుమానంబు సేసి రుక్మిణీప్రముఖు లైనగోపాలదేవునివనితామణులకు నపరిమిత రత్నభూషణంబు లొసంగి భీమార్జున మాద్రీపుత్త్రుల మన్నించి, యుధిష్ఠిరుండు నవరత్నఖచితసింహాసనంబున శ్రీకృష్ణదేవుని రుక్మిణీసమేతంబుగానునిచి, యాతనిదివ్యశ్రీపాదంబులు బంగరుపళ్ళెరంబు

లోఁ బన్నీటం గడిగి తడి యొత్తి గంధపుష్పదివ్యభూష ణాంబరంబుల నలంకరించి; యయ్యశ్వమేధక్రతుఫలంబు సమస్తంబును దత్కరంబున దారవోసె. అప్పుడు పుష్పవృష్టియు దివ్యదుందుభిధ్వానంబును గలిగె. మఘుపూర్తిగనుం గొని దేవతలు మునులు రాజర్షులు మహాపురుషులుహర్షం

## —:భీముని పాకమహిమ:—

బునం గొనియాడిరి. అప్పుడు భీమసేనుండు తనపాకచాతుర్యంబు నందఱకు నెఱింగింపంగోరి విందు సేసి బిరుసుమెత్తనయు నన్నుఁబ్రాయియుఁ జిమిడికయుం గాక గరగరికయగు కలమాన్నంబును బద్ధకేసరచ్ఛాయ ననుకరించు పప్పును, దివ్యగంధబంధురంబులైన గోదుమపిండివంటలును నానారుచుల విచిత్రంబులైనశాకపాకంబులును భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయంబులు నొదలగు సమస్తంబును నిమిష మాత్రంబున నమర్చి పసిఁడిపళ్ళెరంబుల నించి ఋషుల రాజుల బంధులను బాతులు దీర్చి సర్వాలంకారభూషితలైన యోషాసహస్రంబులచే వడ్డన చేయించుట యు, "జంపినారచీర లేమిసేసెడి వని మనంబున నెన్నకుఁడు, ఇవి ఖండశర్కరామయంబులైననమండెఁగలు. తెగినజందెంబు లివియేల యనకుఁడు, ఇవి వింతలైన గోదుమపూజంతికలు. ఔదుంబరఫలంబు లివి యని యెన్నకుఁడు, నమలి చూడుఁడు. మేలిపూర్ణంబులిడిన కుడుములు. తెల్ల నురుఁగు లేమిటి కంటికొనియెదు నని దూఱకుఁడు, యివి పా

సనాతుచిరంబు లైన పేణియలు" అని యొడంబడఁ జెప్తి
చుఁ బడంతుకలు వడ్డింప మహామునులు భుజియించి గంధో
దకధౌతహస్తాంబుజులై కర్పూరవీటికా సుగంధమాల్యం
బులం దనిసి యనిలజునిఁ బలువితంబులఁ బ్రశంసించుచు
యాగశాలం గూర్చుండియుండిరి. ఆసమయంబుననిరువురు
బ్రాహ్మణులు తమలోనఁ గోలాహలంబుగాఁ గలహించుచు
వచ్చి ధర్మనందనుం గనుంగొని యాశీర్వదించి మా వివా

—:కృష్ణధర్మరాజులు బ్రాహ్మణవివాదము వినుట:—

దంబు దీర్పవలయుననిన నతం డరుణిపుత్రులహాబకదాల్భ్యాది
మహామునులు నీ గోపాలదేవుండును విన మీ వాదంబులు
దెలుపుఁ డనవుడు, వారిలోనొక్కరుండిట్లనియె. "నాపేరు
యజ్ఞశర్మ. ఈతనినామధేయంబు విష్ణుశర్మ. ఇతనికినేనొక్క
క్షేత్రంబు నమ్మితిని. ఇతం డా క్షేత్రంబు దున్నించునపు
డొక్కనిక్షేపంబు గానంబడియె. ఆనిక్షేపంబు న న్నెత్తి
కొమ్మనిన నాకు నిమిత్తంబు లేదంటిని. అందుల కితండు
మల్లాడుచు నున్నవాఁడు. మీర లితనికిఁ దెలియఁ బలుక
రింపుం"డనినయనంతరంబ విష్ణుశర్మ యిట్లనియె. "ఇతండు
నాకుఁ గ్రయంబు సేయునప్పుడు నిక్షేపంబుతోడం గూడఁ
గొనినవాఁడం గాను. నాకుఁ గార్యంబేమి? ఇతండు ధర్మం
బెఱుంగని వెఱ్ఱివాఁడు, తనద్రవ్యంబు నాకేమిటికి? మీర
లీతగవుదీర్పుం"డనుటయు, శ్రీకృష్ణదేవుండు నవ్వుచు నిట్ల
నియె. విప్రవరులారా! మీర లిరువురు మూఁడు నెలలకు

మగుడ రండు; అప్పుడు తగవుతీర్చెదఁ బొండు వృథాజగడంబు వలదనిన, వారలిరువురుఁ దద్ధనంబునగరికినప్పగించిచనుటయు, ధర్మనందనుండు శ్రీకృష్ణదేవుం గనుంగొని దాల్భ్య వ్యాస కణ్వ వసిష్ఠాదిమహామును లుండఁ దగవు తేలుగడసేయక యేల యూరకపొండంటి వనిన, ముకుందుం డిట్లనియె. “నీసమక్షంబున నానాసౌఖ్యగోష్ఠీవినోదంబులం బ్రొద్దుగడపునెడ నిదేమిటి వృథాసంవాదం బని పొం డంటిని. మాసత్రయానంతరమునఁ గలియుగంబు సంప్రాప్తం బగు; అప్పటికి వీరల కీబుద్ధి యుడిగి మగుడఁ గలహించి మనయొద్దికి వత్తురు. అప్పుడు సమంబుగాఁ బంచియిచ్చి పొం డందము. అంతియకాదు. కలియుగాచారంబులు వినుము. వేద విహితంబులు గాని దురాచారంబులచేతను, జనులయన్యోన్యవైరంబులచేతను, అన్యాయవర్తను లగు రాజులచేతను, స్త్రీద్యూత మృగయాపానాది దుర్వ్యసనంబులచేతను, ధర్మపత్నీ నిరాదరణంబుచేతనుబరదారపరిగ్రహంబుచేతను, వేశ్యాసంగమంబుచేతను;బరద్రవ్యాపహరణంబులచేతను, నానాఁటికి రెట్టించు లోభ మోహ మాత్సర్యంబులచేఁ గలియుగంబు దర్పించి ధర్మంబు నొప్పించి యందులోనఁ బ్రథమపాదంబున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై పెరుఁగు వడ్లు గలిపినకరణి వర్ణాశ్రమధర్మంబులు సంకరంబు లగు. అప్పుడే నొక్కరాజరూపంబున నవతరించి కొంతకొంతధర్మప్రతిష్ఠా

పనంబు సేయుదు" నని యానతిచ్చి శౌరి ధర్మనందనునిచే బహువిధసత్కారంబులు గైకొని పదియాఱువేలనూటయె నమండ్రు భార్యలతోడంగూడ హంసధ్వజాదిరాజాధిరాజులు గొలువ, మహావైభవంబున ద్వారకానగరంబునకు వేంచేసి, సబహుమానంబుగా రాజుల నెల్ల నాయాపురంబులకుఁ బనిచి దివ్యభోగంబు లనుభవించుచు సుఖంబున నుండె. యుధిష్ఠిరుండును సకలధాత్రీమండలంబు నేలుచు నభీష్టభోగంబు లనుభవించుచు నానావిధదానంబు లాచరించుచు హరిపదారవిందంబుల డెందంబునఁ గుదురుకొలిపి యానందంబు నొందుచు నుండె. అని జైమినిమునీంద్రుండు మఱియు నిట్లను:—

"జనమేజయమహీపాలకా! అజాతశత్రుని,యశ్వమేధారంభంబును, యౌవనాశ్వహంసధ్వజచంద్రహాసాదిమేదినీవల్లభులవర్తనంబులును, శ్రీకృష్ణునిభక్తవాత్సల్యాదిదివ్యశ్రీగుణంబులును బ్రతిపాదించునట్టి యీయితిహాసంబు వినినఁ, జదివిన, వ్రాసిన, భారతరామాయణంబు లాకర్ణించిన ఫలంబును, గన్యాదాన గోసహస్ర తులాపురుషాది మహాదానంబులకంటెను నూఱంత లధికంబు ఫలంబు గలదు. ఆయురభివృద్ధియు, నభీష్టసిద్ధియు, హరిపదభక్తియు నభివృద్ధిఁ జెందు. ఈమహాపురాణంబు తేటపడ వినిపించిన విద్వాంసులకు రత్నభూషణంబులును రజతకనకంబులు రమణీయధవళచామరంబులుఁ బీతాంబరంబులు గ్రామంబు లొసంగి

డెందంబున నానందింపవలయు" నని జైమినిమునీంద్రుం డా నతిచ్చుటయు జనమేజయనరపాలుండు కౌతూహలాయత్త చిత్తుండై యమ్మునివరునకుఁ గనకాంబరంబులు, రత్నమయ భూషణంబులు...నపారంబగుగోసహస్రంబులు సమర్పించి చతుస్సాగరవేలావలయితమహీచక్రంబునేలుచుఁ దర్వాతి సత్కథలు వినుచు శాశ్వతైశ్వర్యభోగంబు లనుభవించుచు నుండె.

గద్యము.

ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వరశ్రీవిజయరంగచొక్క
నాథమహీనాథ కరుణాకటాక్షసంపాదిత గజతురంగ
మాందోళికా ప్రముఖనిఖిలసంపత్పారంపరీ
సమేధమాన సముఖమీనాక్షీనాయక
తనూభవ మీనాక్షీ దేవీకటాక్షలబ్ధకవి
తాసాంప్రదాయక వేంకటకృష్ణప్ప
నాయఁకప్రణీతం బైనజైమిని
భారతంబున నశ్వమేధపర్వ
మ్మను వచనకావ్యంబు
నందుఁ బంచమా
శ్వాసము.

సర్వము సంపూర్ణము.

# అనుబంధము.

## ప్రథమాశ్వాసము.

(అచ్చులో 7 వ పుట ప్రారంభము.)

అనిన విని ధర్మనంద్దనుండ్డు కృష్ణద్వైపాయనుంగ్గనుం గ్గొని మహాత్మా। నాతమ్ములు భీమార్జున నకులసహదెవులు యుద్ధంబ్బునమిగులండస్సి యున్నవారు। మహాబలుండ్డును। కర్ణసూనుండ్డును। నగువృషకేతుండ్డు బాలుండ్డు। ఘటోత్కచుండ్డు మాకార్యంబున హతుండ్డయ్యె నతనితనయుండగు మేఘవర్ణుం డ్డత్యంత్త బాలుండ్డు గావున। వారల నిరువుర కయ్యంబ్బునకుం బంప్పుట అయుక్తంబ్బయవ్వాని ప్రావునం గ్గవ్వడి వైరిరాజులం బ్బరాజయంబు నొంద్దించ్చ నాగోపాలదేవుండ్డు దూరంబ్బుననుంన్న వాండు గావున నియ్యాగం బ్బవిఘ్నంబ్బున జాయంగ్గలవారము। అనిన విని భీమసేనుండ్డు అగ్రజు నవలోకించ్చి శ్రీకృష్ణదేవుండ్డు సర్వత్ర పరిపూర్ణుండ్డు యిచ్చట లెం డననేటికి। యద్దేవునిం ద్దలంచ్చినమాత్రంబ్బున పాపంబ్బులు రూపణంగ్గు। సుకృతంబ్బులు లభించ్చు। నదియునుంగ్గాక। యొక్కరహస్యంబ్బు వినుము। శ్రీవాసుదేవునియానతిప్రకారంబ్బున మనము కయ్యంబ్బునచ్చిర్ జ్ఞాతివధం బ్బునచ్చిర్తి।మింత్తియు కానిస్వతంత్రంబ్బుగా జేశినవారముగాము

హా! పురందరనందన! నివాతకవచకాలకేయాంతక! దేవతాసమూహంబులను దఱిమి యాఖండలునిజయించి ఖాండవవనంబు నగ్నిదేవుని కాహుతిఁజేసిన నీశౌర్యంబెందుఁజనె! ఎక్కటికయ్యంబున ముక్కంటితోడఁ బెనంగి మెప్పించి పాశుపతాద్యస్త్రంబులఁ గైకొన్న నీవిక్రమంబెందణంగె! కాలకేయనివాతకవచాదిదైతేయుల నుక్కణంగించి జయంబుగైకొనిన మహాప్రతాపం బేమూలడాఁగె! భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామ దుర్యోధనదుశ్శాసన వికర్ణాదుల జయించి, యేకవీరుఁడవై గోగణంబు మరల్చిన బాహుబలం బేచక్కికిం జనియె! అన్న యగుధర్మజుచే రాజసూయాధ్వరంబుం జేయింపంబూని, యిలావృతకింపురుషభద్రాశ్వకేతుమాలకురువర్షంబుల దేవతాయోగ్యంబులైన దివ్యవస్తువాహనంబుల నపారంబుగాఁ దెచ్చినభుజావిజృంభణం బెక్కడఁ బోయె! యాదవబలంబుల నరకుసేయక సుభద్ర నరదంబుపై నుంచుకొని వచ్చినయామగటిమి యేదిక్కునకుంబోయె! చక్కరవిలుతునిధిక్కరించు చక్కఁదనంబు గలనీచొక్కటపునెమ్మేను దుమ్మునఁ గ్రమ్మియున్నయది! ఇంద్రనీలకవాటంబుకరణి వాటంబైన నీయురస్తటంబున నిశితవిశిఖంబులు నాఁటి యున్నయవి! చంద్రబింబోపమానంబునుమందస్మితసుందరంబునైననీవదనారవిందంబు ఖండితం బయ్యును గలకల నగుచు, జెన్నుఁదొఱఁగక యున్నయది!” అని బహుప్రకారంబులఁ బల